అపరాధ పరిశోధన అనుబంధం—43

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మూడు తరాల పగ
రచన : వసుంధర

## అన్వేషణ
రచన : అజీజ్

## యమకూపం
రచన : శశిభూషణ్

## శని దేవతలు
రచన : సుజనశ్రీ

'శాన్యోరా' సీరియల్-ఎనిమిదవభాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—43
జూలై, 1977
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

# మూడు తరాల పగ

## వసుంధర

"ఎందుకు బామ్మా పిలిచావు?" అన్నాడు రామదాసు.

ఆ గదిలో రామదాసు బామ్మతోపాటు తల్లికూడా ఉంది.

"రేపు నీ పుట్టిన రోజు. గుర్తుందా?" అంది దాను బామ్మ.

"గుర్తు లేదనుకో కానీ ఏటా వచ్చేదే కదా దీంట్లో విశేషమేముంది?"

బామ్మ అదోలా నవ్వి "నీ భార్య కడుపున ఓ కాయ కాస్తే చూడాలని తపించిపోతున్నాం. పాతికేళ్ళు రాకుండా నువ్వు తండ్రివి కాగలవని ఆశించాం. సరిగ్గా రేపు నీకు పాతికేళ్ళు నిండుతున్నాయి" అంది ఆ

తర్వాత బాధతో కాబోలు ఆమె కంఠం పెగలలేదు.

దాసు తనలో తను నవ్వుకున్నాడు. అతనికి ఇరవై రెండో ఏట పెళ్ళయింది. అతని భార్య రామలక్ష్మినరుసు చాలా అందంగా వుంటుంది. పెళ్ళయిన నాలుగేళ్ళవరకూ పిల్లల్ని కనరాదని భార్యాభర్తలిద్దరూ నిశ్చయించుకున్నారు. రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి వాళ్ళకు.

ఒక విధంగా దాసు అదృష్టవంతుడని చెప్పాలి. పదెకరాల మాగాణీ, రెండిళ్ళూ, బ్యాంకులో పాతిక వేల రొఖ్ఖం ఇవన్నీగాక నెలకో అయిదొందలొచ్చే ఉద్యోగం. అందమైన భార్య. కంటికి రెప్పలా చూసుకునే అమ్మా, బామ్మ. అతనికి తండ్రి లేడు. చిన్నతనంలోనే గతించాడు.

"ఇంకొక ఏడాది ఆగు బామ్మ ఒక్క కాయేం కర్మ..." అంటూ నవ్వాడు దాసు.

"ఏడాదేం ఎంత కాలమైనా ఆగుతాను. కానీ మీ తాతగారు, మీ నాన్నకూడ సరిగ్గా పాతికేళ్ళు నిండిన రోజునే పోయారు..." అంది బామ్మ. ఆవిడ కాస్త నిగ్రహంగానే మాట్లాడగలిగిందేమో కానీ దాసు తల్లి దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది.

"అమ్మా" అన్నాడు ఆశ్చర్యంగా తల్లి ఏడుపు విని "ఏమిటి మీరనేది? నేను కూడా రేపు చచ్చిపోతానని మీ అభిప్రాయమా?"

"అభిప్రాయం కాదురా భయం!" అంది బామ్మ.

"పెద్దదానివి. ఇలా అపశకునం మాటలు మాట్లాడవచ్చా?" అన్నాడు దాసు బాధగా. కానీ ఏదో కారణం లేకుండా బామ్మ ఇలా మాట్లాడదని అతనికి అనిపించింది.

బామ్మకిప్పుడు అరవై ఏళ్ళు. తన పదిహేనో ఏట కాబోలు ఆవిడ దాసు తండ్రిని కన్నది.

"అపశకునం మాటలు మాట్లాడాలని నాకూ ఉండదు. కానీ నా కళ్ళముందే రెండు ఘోరాలు జరిగిపోయేక ఇప్పు డెంత బాధ పడుతున్నానో చెప్పలేను..." అంది బామ్మ.

"అసలు నీ మనసులో ఉద్దేశ్యమేమిటో చెప్పు" అన్నాడు దాసు చిరాగ్గా.

"మన వంశంమీద ఒకడు పగబట్టాడు. ఈ యింటి వారసుణ్ణి పాతికేళ్ళు నిండినరోజున చంపేసి పగ తీర్చు కుంటున్నాడు. ఇది ఇప్పటికి రెండు సార్లు జరిగింది. మూడోసారి కూడా జరుగుతూందనీ ఈ వంశమున్నంత కాలం ఇలా జరుగుతూనే వుంటుందనీ వాడు వ్రాయనే వ్రాశాడు."

దాసు నవ్వి "తాతనూ, నాన్ననూ కూడా వాడే చంపేడంటున్నావు. వాడింకా బ్రతికే వున్నాడంటావా? బ్రతికున్నా ఈ పాటికి బాగా ముసలాడైపోయుంటాడు. వాడేంచేయగలడు నన్ను?" అన్నాడు. ఆ కథ గురించిన వివరాలు కూడా అడగలేదు దాసు. అతనసలు దాన్ని సీరియస్ గా తీసుకోలేదు.

బామ్మ ఈ సారి దాసువంక కోపంగా చూసి "వాడు బ్రతికివుంటే ఏ బాధ లేకపోయేది? ఏ పోలీసులో పట్టు కునివుండేవారు. మీ తాతగార్ని చంపడానికి ముందే చచ్చిపోయాడు వాడు" అన్నాడు.

"అయితే..." అన్నాడు దాసు ఆశ్చర్యంగా.

"ఈ హత్యలు చేస్తున్నది వాడి దయ్యం!" అంది బామ్మ.

దాసు ఉలిక్కిపడి—"ఏమన్నావ్?" అన్నాడు.

"జరిగిన కథ వినకూడదూ..." అంది బామ్మ.

ఆ ఇంట్లో అందరికీ డైరీలు రాసే అలవాటుంది. ఇంట్లో కొన్ని ఉత్తరాలున్నాయి. బామ్మ చాలా వివరాలు చెప్పింది. వీటన్నిటినీ జోడించి దాసు అర్థం చేసుకున్న కథలివి.

# 2

## రామదాసు తాతగారి కథ:

రామదాసు తాత పేరు జగ్గరాజు. ఆయన ఎత్తైన మనిషి. ఆయనవి ఒత్తైన మీసాలు. మగవాడనే మాటకాయనకు కొన్ని నిర్వచనాలున్నాయి. తలిదండ్రులు చెప్పిన పెళ్ళి చేసుకుని, అందరిలాగే కొందరు పిల్లల్ని కని తన జీవితాన్ని తనకీ తన సంసారానికీ పరిమితం చేసుకుని బ్రతికే మగవాడు, జగ్గరాజు దృష్టిలో మగవాడు కాదు. ఆడవాళ్ళ క్రిందే లెక్క!

ఆడ్వెంచర్సు చేయడమే మగతనం! చేయాలనుకోక పోవడమూ, చేయకపోవడమూ ఆడతనం!

స్నేహితులతో పందెంకట్టి తన పన్నెండవ ఏట జగ్గరాజు ఒంటరిగా అర్ధరాత్రి స్మశానానికి వెళ్ళివచ్చాడు. తన పదహారో ఏట క్లాసులోని ఇద్దరు ఆడపిల్లల దగ్గర బూతు మాటలు మాట్లాడేడు.

పద్ధెనిమిదేళ్ళు వచ్చేసరికి జగ్గరాజు మగతనం తప్పు దార్లుకూడా తొక్కింది. కొడుకు ధోరణి చూసి కంగారు పడి జగ్గరాజు తండ్రి అతనికి పందొమ్మిదో ఏట బామ్మనిచ్చి పెళ్ళిచేశాడు.

బామ్మ పేరు సంజీవి. చాలా అందంగా ఆకర్షణీయంగా

వుండేది. జగ్గరాజు కొంతకాలం పాటు భార్య ఆకర్షణకు లొంగిపోయాడు. ఇంటిపట్టునే వుండసాగాడు. పెళ్ళైన ఏడాది తిరక్కుండా జగ్గరాజు తండ్రి అయ్యాడు. అప్పుడే అతని తండ్రికూడా పోయాడు.

తండ్రి పోవడంతో జగ్గరాజు ఇంటికి యజమాని అయ్యాడు. భార్య సంజీవి కొడుకే లోకంగా ఉండటంతో అతని మగతనం మళ్ళీ ఇల్లు దాటాలనుకోసాగింది. అతని ప్రయత్నాలకు తోడుగా బాపన్న స్నేహం అతనికి లభించింది.

బాపన్నకు డబ్బులేదు. కానీ డబ్బున్న వాళ్ళు చాలా మందితో అతనికి స్నేహముంది. అతను డబ్బుకెన్నడూ ఇబ్బంది పడలేదు. బాపన్నకు భార్యలేదు. కానీ అతనికి చాలామంది ఆడవాళ్ళతో పరిచయముంది. భార్య అవసరం అతను గుర్తించలేదు. బాపన్నకు ఇల్లుకూడా లేదు. ఇంటి అవసరం బాపన్నకు కనపడలేదు.

నేరాలు చేయడమూ, నేరాల్ని చేయించడమూ బాపన్నకు హాబీ మాత్రమే కాక జీవనోపాధి కూడా! ఈ బాపన్న హాబీ జగ్గరాజు మగతనానికి నచ్చడంతో వారిద్దరూ స్నేహితులు కావడానికెంతో కాలం పట్టలేదు. వారిద్దరి తొలి పరిచయమూ చాలా తమాషాగా జరిగింది. ఇంటికాక్కావలసిన సరుకులు కొనడానికి దుకాణానికి వెళ్ళాడు జగ్గరాజు. అప్పటికే అక్కడ బాపన్నవున్నాడు. జీళ్ళు, కొబ్బరుండలు, బిస్కట్సు ఇలాంటివి కొన్ని కొనుక్కుతిన్నాడు. రూపాయిపావలా ఇవ్వాలన్నాడు సెట్టి.

బాపన్న జేబులు తడుముకుని "నా దగ్గర ఆరుకాన్న

మాత్రమేవున్నాయి. మిగతా డబ్బులు రేపిస్తాన్లే" అన్నాడు. సెట్టి మండిపడ్డాడు. బాపన్నను నానామాటలు అన్నాడు. అన్నీ విని బాపన్న నవ్వి "డబ్బు ఇవ్వనందుకే గదా నన్నీ మాటలన్నీ అన్నావ్ ఇచ్చివుంటే ఏమీ అనకపోదువుకదా" అన్నాడు.

"ఇస్తే ఎందుకంటాను?" అన్నాడు సెట్టి.

"అయితే నా డబ్బుకీ నీ మాటలకూ చెల్లు" అంటూ బాపన్న అక్కణ్ణించి కదిలి వెళ్ళబోయాడు. సెట్టి గల్లా పెట్టి దగ్గర్నుంచి లేచి అతని చేయి పట్టుకుని ఆపి "డబ్బుకీ మాటకీ బేరం కుదరదు. కావాలంటే మాటకు మాట చెల్లు వేద్దువుగానీ ముందు డబ్బులిచ్చి మరీ వెళ్ళు. డబ్బివ్వని పక్షంలో నీ చొక్కా యిచ్చి వెళ్ళు" అన్నాడు కాస్త తీవ్రంగానే.

బాపన్న ఆగి సెట్టి చేయి విదిలించుకుని "సరే ఆమాట మీదే నిలబడు" అంటూ చటుక్కున అక్కడే వున్న జగ్గరాజువంక తిరిగి "అయ్యా మీరూ నాకులాంటి పెద్ద మనిషిలాగే కనబడుతున్నారు. సాటి పెద్దమనిషి పరువు మీరే కాపాడాలి. ఈ రాత్రికే మీ బాకీ తీర్చుకుంటాను నా మీద నమ్మకముంచి ఒక రూపాయి మూడణాలు నాకు అప్పివ్వండి. నిజానికి నాక్కావలసింది ఒక రూపాయి రెండణాలన్నర మాత్రమే. కానీ అర్ధణాతో నాకింకా పనివుంది. ఎలాగూ అప్పు చేస్తున్నాను గదా అని ఓ అర్ధణా ఎక్కువ తీసుకుంటున్నాను" అన్నాడు.

జగ్గరాజుకేం చేయాలో తోచలేదు. సెట్టివంక ఏంచేయ మన్నట్లు చూశాడు. సెట్టి ఏ అభిప్రాయమూ వ్యక్తపర్చ లేదు. బాపన్న జగ్గరాజుకు డబ్బు తిరిగిస్తాడన్న నమ్మకం

సెట్టికి లేదు. కానీ ఆ విషయం చెబితే ఇప్పుడు తన బాకీ తీరదు. అందుకే మౌనంగా ఊరుకున్నాడు సెట్టి. క్షణం తటపటాయించి అడిగిన డబ్బు బాపన్నకిచ్చేశాడు జగ్గ రాజు.

"నా పరువు కాపాడేరు" అని బాపన్న ఆ డబుబ సెట్టికి తిరిగిచ్చేసి నానామాటలూ అని "డబ్బుకు డబ్బూ చెల్లు—మాటకు మాటా చెల్లు" అన్నాడు.

బాపన్న మాటల్ని సెట్టి అంతగా పట్టించుకోలేదు కానీ ఈ సంఘటన జగ్గరాజుకు చాలా వినోదాన్ని కలిగించింది. "మీ ఇల్లెక్కడ?" — అని పలకరించాడతను బాపన్నను.

"నాకు ఇల్లేమిటిలెండి అదడక్కండి మీ ఇల్లెక్కడో చెప్పండి. రాత్రికి నేనే స్వయంగా వచ్చి మీ బాకీ తీర్చేస్తాను" అన్నాడు బాపన్న.

నమ్మకమున్నా లేకున్నా తన ఇంటి వివరాలు చెప్పాడు జగ్గరాజు.

ఆ రోజురాత్రి ఏడున్నర ప్రాంతంలో బాపన్న నిజంగానే జగ్గరాజు ఇంటికి వెళ్ళాడు. జగ్గరాజు ఆశ్చర్యంగా చూశాడు బాపన్న వంక. రూపాయ మూడణాలు తిరిగివ్వడంకోసం ఆ వ్యక్తి ఆ సమయంలో తనింటికి వస్తాడని అతననుకోలేదు.

"నాకు డబ్బులు జేబులో వేసుకు తిరిగే అలవాటు లేదు. ఊరినిండా నాకు స్నేహితులే. ఎక్కడికక్కడే ఎప్పటికప్పుడే నాకు సర్దుబాటై పోతూంటుంది. అలా రామాలయం నుంచి మా ఇంటికి పోతూండగా ఈ ప్రాంతంల్లో నే మీ ఇల్లుందని గుర్తుకొచ్చింది. సరే పిల్చుకు

తీసుకెడతే డబ్బిచ్చేసినట్లూ వుంటుంది. మా ఇల్లు చూపించినట్లూ వుంటుందనిపించి వచ్చాను.''

''డబ్బుకేం తొందరలేండి. ఎప్పటికైనా ఇవ్వచ్చు'' అన్నాడు జగ్గరాజు కాస్త మొహమాటంపడుతూ.

''అబ్బే అలాగనకండి. ఈ వేళ కాకపోతే మళ్ళీ మనం కలుసుకునే అవకాశం రాకపోవచ్చు. నేను బొత్తిగా తీరుబడిలేని మనిషిని'' అంటూ బాపన్న బలవంత పెట్టి జగ్గరాజును తీసుకుపోయాడు.

ఇద్దరూ ఒక చిన్న పెంకుటిల్లు చేరారు. బాపన్న వెళ్ళి తలుపు తట్టాడు. ఎవరో తలుపు తీశారు. ''రండి'' అన్నాడు బాపన్న.

జగ్గరాజు లోపలకు వెళ్ళాడు. ఇల్లు చాలా నీట్ గా వుంది. బాపన్న చెప్పిన మీదట జగ్గరాజు ఓ కుర్చీలో కూర్చున్నాడు.

''భానుమతీ'' అని కేక పెట్టాడు బాపన్న. సుమారు ఒక నిమిషం అనంతరం ఒక యువతి అక్కడకు వచ్చింది. ఆమెను చూస్తూనే జగ్గరాజు కళ్ళు చెదిరిపోయాయి. ఆ సౌందర్యాన్ని వర్ణించడం ఏ కవికీ సాధ్యపడదేమో!

''ఈయన జగ్గరాజుగారని నా స్నేహితుడు. ఈమె భానుమతి'' అంటూ పరస్పరం పరిచయం చేశాడు బాపన్న.

''నమస్కారం'' అంది భానుమతి.

బంగారానికి తావి అబ్బినట్లు—సౌందర్యానికి తగ్గ కంఠస్వరం భానుమతికి ఉందని జగ్గరాజుకు తోచింది. అతనూ ప్రతినమస్కారం చేశాడు.

''లోపల ఏర్పాట్లు చేయి'' అన్నాడు బాపన్న. భాను

మతి వెళ్ళిపోయింది.

"మీ ఆవిడా?" అన్నాడు జగ్గరాజు.

"నాకింకా పెళ్ళికాలేదు" అని బాపన్న నవ్వి "అందరిలా జీవించడం నాకిష్టముండదు. అనుక్షణం ఏదో సాహసం చేస్తూ బ్రతకాలన్నది నా కోరిక. అందుకే జేబులో డబ్బులు వేసుకోకుండా తిరుగుతాను. అడ్డమైనవీ కొనుక్కు తింటాను. ఎదురైన పరిస్థితులకు ఎలాగో తట్టుకుంటాను. అలా జీవించడం నాకిష్టం.

ఊరినిండా నాకు స్నేహితులున్నారు. అయితే ప్రతి వారికీ స్నేహితులుంటారు. కానీ నా స్నేహం అందరి స్నేహంలా వుండకూడదు. చెప్పుకోదగ్గ విశిష్టత వుండాలి విశిష్టత అంటే ఉదాహరణ చెబుతాను. మీకు నేను రూపాయ మూడణాలు బాకీపడ్డాను. ఇంకెవరైనా అయితే ఆ డబ్బు మీకు యథాతథంగా తిరిగిచ్చేవారు. అంతగా అయితే అర్థణాయో, ముక్కానీయో వడ్డీ ఇచ్చేవారు. కానీ నాకులా భానుమతి అనబడే ఒక అద్భుత సౌందర్య రాశిని ఒక రాత్రికి మీకు స్వంతం చేసేవారా చెప్పండి" అన్నాడు.

జగ్గరాజు తెల్లబోయాడు.

## 3

"రాత్రి మీరు చాలా ఆలస్యంగా ఇంటికి వచ్చారు" అంది సంజీవి.

"అవును—పేకాటలో టయిం తెలీలేదు" అన్నాడు జగ్గరాజు.

సంజీవి ఇంకేమీ మాట్లాడలేదు. జగ్గరాజు మాత్రం రాత్రి మధురానుభూతుల్ని నెమరు వేసుకుంటున్నాడు.

ఈ రాత్రికి కూడా అక్కడికి వెళ్ళాలని అతనికి మహ ఇదిగా వుంది.

ఎక్కడ రూపాయ మూడణాలు ఎక్కడ భానుమతి!

బాపన్న స్నేహం లభించడం జీవితంలో తన అదృష్టం!

జగ్గరాజుకు సాహసచర్యలపైనా, చీకటితప్పుల మీదా చాలాకాంక్ష వున్నప్పటికీ కులీనుల ఇంట్లో పుట్టిన కారణంగా ఇంట్లోని వాతావరణం అందుకు పూర్తిగా అనుకూలించని కారణంగా అతనికి తన కాంక్షలు తీర్చుకోవడానికి బాపన్న ఆసరా అవసరమయింది. ఆసరా దొరకగానే అతనిలో వున్న అతననుకునే మగతనం విజృంభించింది.

భానుమతి బాపన్న ఎలా సంపాదించినదీ విన్నప్పుడు జగ్గరాజు స్నేహితుడి తెలివితేటలకు సెహబాష్ - అనుకోకుండా ఉండలేకపోయాడు.

భానుమతిదా ఊరుకాదు. అక్కడికి కనీసం వంద మైళ్ళున్న గ్రామం. ఆమెకు తల్లీతండ్రీ లేరు. మేనమామ ఇంట్లో పెరుగుతోంది. ఆ మేనమామైనా డబ్బున్నవాడు కాదు' కష్టంమీద రోజులు గడుస్తున్నాయి.

ఏదో పనిమీద ఆ ఊరు వెళ్ళిన బాపన్న భానుమతిని చూడడమూ, ఆమె పరిస్థితులను గమనించడమూ జరిగింది. అప్పుడు భానుమతికి పధ్నాలుగేళ్ళు. అతనొక నెల రోజులా గ్రామంలో మకాంపెట్టి భానుమతికి ఎన్నో ఆశలు చూపించాడు. రంగుల కలల్లో తేలేలా చూశాడు. ఫలితంగా ఆమె అతనితో లేచి వచ్చేసింది.

అయితే భానుమతి ఆశించినట్లు బాపన్న ఆమెను పెళ్ళి

చేసుకోలేదు. వయసులో బాగా చిన్నది కావడంవల్ల
అతను మాటలతో ఆమెను తనకు అవసరమైన విధంగా
మార్చగలిగాడు. రకరకాల పుస్తకాలూ, బొమ్మలూ
ఆమెకు సరఫరాచేసి ఆమెనొక శృంగారమూర్తిగా తీర్చి
దిద్దాడు. భానుమతికిప్పుడు తనదంటూ వ్యక్తిత్వంలేదు.
బాపన్న ఏది చెబితే అదే ఆమెకు వేదవాక్కు. అతనంటే
ఆమెకు ఆరాధనాభావం.

ఆమెకు జీవితం సుఖంగా గడిచిపోతోంది. ధనవంతు
లతో పరిచయానికీ, ధనసంపాదనకూ బాపన్న ఆమెనుప
యోగించుకుంటున్నాడు.

బాపన్నతో పరిచయం పెరిగిన కొద్దీ ఆ ఊళ్ళో ఇంకా
భానుమతికాక మరి నలుగురైదుగురు ఆడవాళ్ళు బాపన్న
ఆధ్వర్యంలో ఉన్నట్లు జగ్గరాజు తెలుసుకున్నాడు. వారి
స్నేహం దిన దిన ప్రవర్ధమానమవుతోంది.

భర్త ప్రవర్తన గురించి సంజీవికూడా అట్టే పట్టించు
కోవడంలేదు. అతనంటే ఆమెకు చాలా భయముంది.
కోపం వచ్చినప్పుడు జగ్గరాజు ఒకటి రెండు పర్యాయాలు
భార్యను కొట్టాడు. కూర్చుని తిని కండలు పెంచే రకం
కావడంవల్ల అతని దెబ్బలకామె ఒళ్ళు హూనమై
పోయింది. అవి తలచుకుని ఆమె అతని అవసరాలు సమ
కూర్చడం తప్పితే, అతని గురించి ఆరాలు తీయడంగానీ,
అతన్ని ఎదురుప్రశ్నలు వేయడంగానీ చేసేది కాదు. దానికి
తోడు కొడుకు ముద్దుచేష్టలతో ఆమెకు బాగా కాలక్షేప
మైపోయేది.

తన దారికి అడ్డురానంతకాలమూ భార్య గురించి జగ్గ
రాజుకేవిధమైన అసంతృప్తి లేదు. అందువల్ల భార్యను

అతను బాగానే చూసుకునేవాడు. ఆమెకు అన్యాయం చేస్తున్నానన్న భావం కూడా మనసులో ఉండడం అందుకు కొంత కారణం. వారి సంసార జీవితం ఒడిదుడుకులు లేకుండా నడిచిపోతోందనే చెప్పవచ్చు.

మొదటి పర్యాయం రూపాయ మూడణాలకే లభించినా ఇప్పుడు రాత్రి అనుభవాలగురించి జగ్గరాజు కాస్త ఎక్కువగానే డబ్బు ఖర్చు చేయవలసివస్తోంది. ఒకరోజు చంద్రమతితో గడిపి ఆమెకు-కొంత డబ్బు ఇచ్చేక-ఆ నెలలో తను సుమారు వంద రూపాయలవరకూ ఖర్చు పెట్టానని గుర్తించి కాస్త కలవరపడ్డాడు జగ్గరాజు. డబ్బంతా కేవలం ఆడవాళ్ళ గురించే అయిపోవడంలేదు. అందులో కొంత వాళ్ళు స్వయంగా అందించే మద్యానికి కూడా అవుతుంది. భానుమతి, చంద్రమతిలాంటి అందమైన ఆడవాళ్ళు స్వయంగా మద్యం అందించడమంటే మాటలా?

ఆ మర్నాడు జగ్గరాజు తన కలవరపాటును బాపన్న దగ్గర వ్యక్తపరిచాడు-"నేను కాస్త జాగ్రత్త పడాల్సిన అవసరముందనుకుంటూను. ఈ నెలలో అప్పుడే వంద రూపాయలు ఖర్చైపోయింది. నేనేం వ్యాపారస్తుణ్ణి కాదు గదా-వందలకు వందలు వెదజల్లడానికి జాగ్రత్తగా వచ్చే దాంట్లోనే ఖర్చు చేసుకోవాలి..." అన్నాడతను.

బాపన్న-"నేనూ ఈ విషయం మీతో అందామనుకుంటున్నాను. మీరు నాకు అందరిలాంటివారు కాదు. కానీ ఇంతవరకూ నేను అందరు స్నేహితులతో ప్రవర్తించినట్లే మీతోనూ ప్రవర్తించాను. మీ ఖర్చులు తగ్గడంతో పాటు-ఆదాయంకూడా పెరగాలంటే ఒక ఉపాయముంది

అదే మీరు నా భాగస్వామి కావడం—" అన్నాడు.

జగ్గరాజు ఆశ్చర్యంగా—"అంటే?" అన్నాడు.

"ఆడవాళ్ళకూ, తాగుడుకూ మీరు పైసా ఖర్చుపెట్టక్కర్లేదు సరిగదా—నెల నెలా మీ ఆవిడకో నగకూడా చేయించవచ్చు—నా భాగస్వామి కావడం ద్వారా—"

"ఎలా?" అన్నాడు జగ్గరాజు.

"సుందర్రావుగారు తెలుసా మీకు?" అన్నాడు బాపన్న.

"జమీందారుగారా?" అన్నాడు జగ్గరాజు అప్రయత్నంగా.

"ఊఁ ఆయనే—ఆయన దివాణంలో మీకు ఉద్యోగం దొరుకుతుంది..." అన్నాడు బాపన్న.

"ఉద్యోగమా—అది చేయవలసిన అవసరం నాకు లేదు" అన్నాడు జగ్గరాజు దర్పంగా.

"అలాగంటే ఎలాగండీ..." అన్నాడు బాపన్న- "సుందర్రావుగారి రెండో పెళ్ళాం అప్సరసలా ఉంటుంది' కానీ సుందర్రావుగా రెప్పుడూ ఆవిణ్ణి పట్టించుకోడు. తన్ను నిర్లక్ష్యం చేస్తున్నాడని ఆమెకు భర్తమీద కోపం, కసి. ఇది మీకు ఫస్ట్ కేసు."

"అర్థంకాలేదు" అన్నాడు జగ్గరాజు.

"పూర్తిగా వినండి. సుందర్రావుకో చెల్లెలుంది. ఆమె కూడా అప్సరసలాగే ఉంటుంది కానీ తల చెడింది. ఇది మీకు రెండో కేసు."

"సరిగ్గా చెప్పండి" అన్నాడు జగ్గరాజు.

"నాకూ సుందర్రావుగారికీ పరిచయముంది. ఆయన భానుమతి దగ్గరకు చాలా పర్యాయాలు వెళ్ళారు. నా

ద్వారా సుందర్రావుగారి భార్య ఇందిరకు భానుమతి సమాచారం తెలిసి_ఒకసారి భానుమతిని కలుసుకుంది_ఆమెలోని విశేషం తెలుసుకునేందుకు. భానుమతి తనకంటె విశేషమైన ఆడదికాదనీ_తన భర్త ప్రవర్తనకు మగవాడి చంచలబుద్ధి కారణమనీ గ్రహించేక ఇందిరకు భర్తమీద పగతీర్చుకోవాలనిపించింది.

భానుమతిని అడిగి తెలుసుకుని_ఆమెకు నచ్చిన మగవాడు మీరేనని గ్రహించింది. ఆ తర్వాత నా సహాయంతో మిమ్మల్నొకసారి చూసింది. అప్పట్నించీ మీకోసం తపించిపోతోంది. ఆమె, సుందర్రావుగారి చెల్లెలూ ఈ విషయంలో తోడు దొంగలు. ఇద్దరాడవాళ్లు పూనుకుంటే ఏమైనా సాధించవచ్చు. ఇప్పుడు మీకు దివాణంలో ఉద్యోగం రానున్నది. నెలజీతం కాక అదనంగా బహుమతులు కూడా మీకు ముడుతూంటాయి. ఆయాచితంగా ఆడవాళ్ళు లభిస్తారు...'' అని నవ్వాడు బాపన్న.

కృతజ్ఞత, అనుమానం, ఆశ్చర్యం, భయం - అన్నీ తొంగి చూశాయి జగ్గరాజు ముఖంలో. 'ఇది అసలైన సాహసిక చర్య-త్వరపడకు—' అని హెచ్చరించింది అంతరాత్మ.

## 4

ఆరోజు జగ్గరాజు కొడుకు పుట్టినరోజు. ఎరిగున్నవాళ్ళెవర్నైనా భోజనానికి పిలవమంటే బాపన్నను పిలిచాడు జగ్గరాజు.

''అప్పుడే మీవాడికి మూడేళ్ళు నిండేయన్నమాట'' అన్నాడు బాపన్న నవ్వుతూ.

"అవును. వాడు పుట్టినప్పట్నించీ నా జీవితం మారి పోయింది. వాడు పుట్టి ఏడాది తిరక్కుండా నాకు భానుమతి దొరికింది. రెండేళ్ళు తిరిగేసరికి ఇందిర దివాణం దొరికింది. ఇప్పుడు మూడేళ్ళు తిరిగాయి. ఇంకా ఏమేం కొత్త అనుభవాలు కాచుకొన్నాయో" అన్నాడు జగ్గరాజు ఆశగా.

"కొన్ని కొన్ని విషయాలను మూఢనమ్మకాలని కొట్టిపారేస్తాం కానీ—మీరు చెప్పినదాంట్లో నిజముందని నాకు తోస్తోంది" అన్నాడు బాపన్న సాలోచనగా.

మిత్రులిద్దరూ తీరుబడిగా దొడ్లో పందిరికింద చెరో పడక్కుర్చీలోనూ కూర్చుని కబుర్లు ముచ్చటించుకుంటున్నారు.

"ఏం?"—అన్నాడు జగ్గరాజు.

"నిజంగానే కొత్త అనుభవాన్ని మీరు రుచి చూడబోతున్నారు" అన్నాడు బాపన్న.

జగ్గరాజు ముఖంలో ఆశ కనబడింది—"వివరంగా చెప్పండి—" అన్నాడు.

"మిమ్మల్ని నా భాగస్వామి అని చెప్పానుగదా—కానీ ఇంతవరకూ మీరు నాకు చేసిన సాయమేమీ లేదు. ఇప్పుడు మీరు నాకు సాయపడాల్సి ఉంది. ఆ సాయంలోనే మీకు సదుపాయాలూ అమరుతాయి" బాపన్న ఆగాడు. జగ్గరాజు మాట్లాడకుండా తనవంకే చూడడం గమనించి అతను మళ్ళీ చెప్పుకు పోసాడు. "మీకూ ఇందిరకూ ఉన్న వ్యవహారం చూచాయగా జమీందారుగారికి తెలిసింది. ఆయనకు చాలా కోపంవచ్చి నన్ను పిలిచి మిమ్మల్ని హత్యచేసే ఉపాయం చూడమన్నాడు."

"చాలా తాపీగా చెబుతున్నారు మీరు!" అన్నాడు జగ్గరాజు భయాన్ని వ్యక్తపరుస్తూ.

బాపన్న నవ్వి—"ఆయన మిమ్మల్ని చంపమన్నా నేను చలించలేను. తాపీగా ఆయన కొక ఫొటో చూపించాను. ఆ ఫొటోలో అమ్మాయిని సుందర్రావుగారికి అప్పజెప్ప గల గొప్పవాడు జగ్గరాజు మాత్రమే—అని చెప్పాను. జమీందారుగారికి ఫొటోని చూస్తూనే మతిపోయింది. ఆయన మీ తప్పుల్ని క్షమించేశారు. తనకాసక్తి లేని ఇందిర ఎలాపోయినా బాధ లేదన్న భావం వ్యక్తంచేశారు. ఫొటోలో అమ్మాయిని తన స్వంతం చేస్తే వేరే నగదు కూడా బహుమతిగా ఇస్తానన్నారు" అన్నాడు.

"బాగుంది—ఇందులో మీకు లాభమేముంది? ఏమైనా ఉంటే నాకేగానీ—"

"మీ రాకపోకలు ఆగిపోనంతకాలం ఇందిరనుంచి నాకు డబ్బు ముడుతుంది. ఈ అమ్మాయిని అప్పజెపితే సుందర్రావుగారు కూడా నాకు డబ్బిస్తాడు. లాభం లేక పోవడమేమిటి?"

"అయితే నేనేం చేయాలి?"

బాపన్న తన చొక్కా జేబులోంచి ఒక ఫొటోను తీసి జగ్గరాజు కందించాడు. చూస్తూనే అతని కళ్ళు చెదిరి పోయాయి. ఆకాశంలో విహరించే దేవతలాగున్న దామె. ఆమెను చూడగానే మగవాడి మనసు ఆకాశంలో విహ రిస్తుంది.

"ఈ అమ్మాయిని నువ్వు సుందర్రావుగారి కప్ప గించాలి" అన్నాడు బాపన్న.

"ఎవరీ అమ్మాయి?"—అన్నాడు జగ్గరాజు.

ఊరిపేరు చెప్పాడు బాపన్న. ఆ ఊళ్ళో శాస్త్ర కలిగిన వారింటనే పుట్టిందట ఈమె. జగ్గరాజామెను వశపర్చుకుని బాపన్న కప్పగించాలి.

"ఎలా?" అన్నాడు జగ్గరాజు.

"మగవాడిలా" అన్నాడు బాపన్న. అతని కళ్ళు క్రూరంగా నవ్వాయి.

## 5

"మీ పేరేనా సరస్వతి!" అన్నాడు జగ్గరాజు.

"అవును. ఏం?"

"మీ నాన్నగారేనా రామన్నపంతులుగారు."

"అవును. ఏం?" అందా అమ్మాయి కంగారుగా.

"అయితే త్వరగారండి. ఆయన మా ఇంటిముందు కళ్ళు తిరిగి పడిపోయారు. మీ వాళ్ళంతా మా ఇంట్లోనే ఉన్నారు. మీ రిక్కడుంటారని తెలిసివచ్చాను, అదృష్ట వశాత్తూ బాగానే గుర్తు పట్టగలిగాను."

సరస్వతి కంగారుగా జగ్గరాజును అనుసరించింది.

"అవిగో—తలుపులు తీసి ఉన్నాయి. మీరు లోపలకు వెళ్ళండి నేనిప్పుడే వస్తాను" అన్నాడు జగ్గరాజు. ఆమె సంకోచించకుండా ఇంట్లోకి నడిచింది. ఆమె లోపలకు వెళ్ళగానే మెరుపులా తనూ లోపలకు వెళ్ళి అదే వేగంతో తలుపులు వేసేశాడు.

కంగారుగా వెనుదిరిగింది సరస్వతి. ఆమెకిప్పుడు జగ్గరాజు చేతిలో కత్తి కనబడింది. భయంతో ఆమెకు నోట మాట రాలేదు.

"అరిస్తే చంపేస్తాను. చెప్పినట్లు చేయి—" అన్నాడు జగ్గరాజు.

ఆమె మాట్లాడలేదు కానీ శరీరం వణికిపోతోంది. జగ్గరాజామెను సమీపించి తన జేబులోంచి కొన్ని గుడ్డలు తీసి ఆమె నోట్లో కుక్కి వెనక్కి తిరగమన్నాడు. ఒక పెద్ద రుమాలుతో నోటిని బిగించి కట్టి వెనుక ముడివేశాడు. తన జేబులోంచి ఒక కలం, కాగితం తీసిచ్చి చెప్పినట్లు రాయమన్నాడు. ఆమె రాస్తున్నంతసేపూ జగ్గరాజు చేతిలోని కత్తి ఆమె వీపుకానించి ఉంది.

"నేను మీ ఇంట చెడబుట్టాను. కులటను. నన్ను మరిచిపొండి. నాకోసం వెతికించకండి" అని జగ్గరాజు చెప్పినట్లు వ్రాసి కాగితంమీద సంతకం పెట్టింది సరస్వతి. ఆ తర్వాత జగ్గరాజు ఆమె వంటిమీద బట్టలన్నీ విప్పించేశాడు_కత్తి చూపించి. వాటినన్నింటినీ తన దగ్గరున్న ఒక సంచీలో పెట్టుకుని_"ఎక్కడికీ వెళ్ళడానికి ప్రయత్నించకు_నేనీ ఉత్తరాన్ని మీ ఇంటికి చేరవేసి వస్తాను" అన్నాడు. వెళ్ళేటప్పుడతనామె చేతులు వెనక్కి విరిచి కట్టడం మరిచిపోలేదు.

"నిజానికి జగ్గరాజు కామెనా స్థితిలో వదిలి కదలాలనిపించలేదు. కానీ నిగ్రహించుకున్నాడు.

అతను వెళ్ళాక సరస్వతి మతిపోయినదానిలా అక్కడ కూర్చుంది. తన బ్రతుకంతా అంధకార మయమైపోయిందని ఆమెకు తోచింది. ఆ మనిషి మళ్ళీవచ్చి తననేం చేస్తాడోనని ఆమె భయపడుతోంది. అయితే, తానేమీ చేయలేని నిస్సహాయురాలు. ఎవరైనా వచ్చినా కంటబడకుండా తప్పించుకోవలసిన స్థితిలో తన్ను వదిలిపెట్టాడు వాడెవడో కానీ!

సుమారు గంట అనంతరం జగ్గరాజు వచ్చాడు. ఇందా

కటి ఆవేశమంతా అతనిలో ఇప్పుడు కట్టలు తెంచుకుంది. ఆమె ప్రతిఘటించి ప్రయోజనంలేకపోయింది.

ఆ రాత్రే సరస్వతికూడా పురుష దుస్తులు ధరించి జగ్గరాజుతోపాటు ఆ ఊరు వదిలిపెట్టింది.

## 6

"గుర్తున్నానా?" అన్నాడతను.

అతని పక్కనున్న అమ్మాయి మీంచి చూపులు మరల్చుకుని-"మనిషి నెక్కడో చూసినట్లే ఉంది. మాట ఎక్కడో విన్నట్లే ఉంది" అన్నాడు జగ్గరాజు.

"మొత్తానికి నువ్వు నువ్వేరాజగ్గా - నాపేరు శేఖరం- సెకండ్ ఫారంలో..."

"నువ్వా?" అన్నాడు జగ్గరాజు. అతను చటుక్కున లేచి శేఖరాన్ని కౌగలించుకున్నాడు.

శేఖరం, జగ్గరాజు చిన్నప్పుడు ప్రాణ మిత్రులు. క్లాసులో జగ్గరాజు అల్లరిచిల్లరిగా ఉండేవాడు. శేఖరం బుద్ధిగా ఉండేవాడు. శేఖరంమీద ఈగ వాలనిచ్చేవాడు కాదు జగ్గరాజు. ఇద్దరూ పరీక్షల్లో పక్క పక్కన కూర్చునేవారు. మేస్టారికి తెలియకుండా తన ఆన్సరు పేపర్లు జగ్గరాజుకు చూపించేవాడు శేఖరం.

చాలా పర్యాయాలు శేఖరం, జగ్గరాజుకు హితబోధ చేస్తూండేవాడు-"కాపీ కొట్టడమంటే నాకేమాత్రమూ నచ్చదురా. కనీసం పరీక్ష సమయంలోనైనా కష్టపడి చదివి స్వంతంగా రాయడం నేర్చుకో, లేకపోతే ఏదో ఒకరోజున ఇబ్బంది పడతావు. నేనుమాత్రం కలకాలం నిన్నిలా నా పేపర్లలోంచి కాపీ కొట్టనివ్వను. నువ్వు నాకు చేస్తున్న ఉపకారానికి ప్రత్యుపకార మెలా

చేయాలో తెలియక ప్రస్తుతం నా ఆన్సరు పేపర్లు చూపిస్తున్నాను."

జగ్గరాజు నవ్వి—"చూపించడం మానేస్తే మానేయరా—అంతగాపోతే పరీక్షే గదా పోయేది. నేనేం చదివి ఊళ్ళేలాలా ఏమన్నా నా?" అనేసేవాడు.

ఏవో గృహసంబంధమైన కారణాలవల్ల సెకండ్ ఫారం తర్వాత శేఖరం ఆ ఊరువదిలి పెట్టాల్సివచ్చింది.

మిత్రులిద్దరు మళ్ళీ ఇదే కలుసుకోవడం.

"ఒకసారి చూశానంటే ఎన్ని సంవత్సరాల తర్వాత చూసినా ఆ మనిషిని గుర్తుపట్టగలను నేను. అదీ నా స్నేహం" అన్నాడు శేఖరం.

కుశలప్రశ్నలయ్యేక కథాకమామీషూ అడిగాడు జగ్గరాజు.

"చూడు - అలా అమాయకంగా చూస్తూ నిలబడ్డ మెరుపుతీగను. ఈమె నక్కాబోయే భార్య. ఈ పెళ్ళి మా ఇంట్లో ఎవరికీ ఇష్టంలేదు, అందర్నీ ఎదిరించి ఎవరికీ చెప్పకుండా ఈ ఊరొచ్చేశాను. కొంతకాలం నాకు మీ ఇంట్లో ఆశ్రయం కావాలి" అన్నాడు శేఖరం.

"తప్పకుండా" అన్నాడు జగ్గరాజు. అతను ఆప్యాయంగా స్నేహితుడినీ, అతని ప్రియురాలినీ లోపల కాహ్వానించి భార్యకు పరిచయంచేసి వాళ్ళుండడానికి గది చూపించాడు.

* * *

"అలా పిచ్చిగా మాట్లాడకండి. ఆమె నా ప్రాణ స్నేహితుడికి కాబోయే భార్య" అన్నాడు జగ్గరాజు కాస్త చిరాగ్గా.

"కాబోయే భార్య తలిదండ్రులతోపాటు కాకుండా- కాబోయే భర్తతో ఒంటరిగా ఉంటోందనుకోండి. దాన్ని లేచి రావడమంటారు. ఈ కాబోయే భార్యను వాళ్ళ ఊళ్ళో లేచివచ్చిన పిల్లగా చెప్పుకుంటూ ఉంటారు" అన్నాడు బాపన్న.

"ఏమిటి మీరనేది?" అన్నాడు జగ్గరాజు విసుగ్గా.

"భానుమతి, చంద్రమతి,......, సరస్వతి...వీళ్ళంతా లేచిపోయిన పిల్లలే. వాళ్ళగతి పట్టించడానికే మీ స్నేహితుడామె నిక్కడికి తీసుకొచ్చాడని నా అనుమానం. మీ స్నేహితుడిక్కణ్ణించి వెళ్ళిపోయేలోగా మీరూ ఒక ఛాన్సు తీసుకుని సుందర్రావుగారికో ఛాన్సు ఇప్పిస్తారా పుణ్యమూ ... పురుషార్థమూ ... అన్నీ..." మాటలు మింగేశాడు బాపన్న.

"మీతో వాదించడం నాకిష్టం లేదు. ఈ విషయంలో ఇంకేమీ మాట్లాడవద్దు" అన్నాడు జగ్గరాజు.

* * *

"బ్రాహ్మణ్ణి కలుసుకువచ్చాన్రా సరిగ్గా అయిదు రోజులకి మంచి ముహూర్తముందన్నాడు..." అన్నాడు శేఖరం.

"అప్పటికి మా వాడి పుట్టినరోజు అయిపోతుంది. ఎల్లుండే మా వాడి పుట్టినరోజు అన్నయ్యగారూ" అంది సంజీవి.

జగ్గరాజులిక్కిపడ్డాడు. తన కొడుకు పుట్టేక ప్రతిఏటా తన జీవితంలో కొత్త అనుభవాలెదురౌతున్నాయి. అతనొక పర్యాయం శేఖరానికి కాబోయే భార్య అరుంధతి కళ్ళలోకి చూసి తల దించేసుకున్నాడు. అందమైన ఆమె

ముఖంలో కొట్టవచ్చినట్లున్న అమాయకత్వం అతన్ని బాపన్న మాటలు మరిచిపోయేలా చేసింది.

* * *

"రేపు శేఖరం ఊళ్ళో వుండడు" అన్నాడు బాపన్న.

"ఏం?"

"ఇది జమీందారుగారి ఏర్పాటు. ఆ రోజాయనకు అరుంధతి కావాలి."

"అరుంధతికి నేను కాపలా అని మర్చిపోకండి..."

"కంచే చేను మేస్తుందని నాకు తెలుసు. జమీందారు గారికి మీరు చాలా ఋణపడి ఉన్నారని గుర్తుంచుకోండి."

జగ్గరాజు వంక చూసి బాపన్న నవ్వి "ఆలోచించండి. ఒక్క పర్యాయం అరుంధతితో అనుభవాన్ని ఊహించుకోండి. అప్పుడు మీ మనసెలా చెబితే అలా చేయండి. ఈ రాత్రికీ ఊరు వదిలిపెట్టిన శేఖరం ఎల్లుండి సాయంత్రం వరకూ ఇక్కడికి రాడు. ఆవలెల్లుండి వారి పెళ్ళి ముహూర్తం. దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలని పెళ్ళి కాకుండానే అరుంధతిని మీరు వశపర్చుకోవాలి. మీ మీద మీ స్నేహితుడికి చాలా నమ్మకం. అందువల్ల ఆమె భవిష్యత్తుకేమీ భయంలేదు. మీరు చేసే తప్పు ఆమెమీద ఏదైనా ప్రభావం చూపించే పక్షంలో శేఖరంతో పెళ్ళి దాన్ని కమ్మేస్తుంది" అన్నాడు.

జగ్గరాజు మనసు మెత్తపడుతోంది. ఆ మెత్తదనం లోంచి ఆశ పుడుతోంది. మగతనానికి తనిచ్చిన నిర్వచనం గుర్తొస్తోంది. ఆ గుర్తులో స్నేహపు విలువలు మరిచిపోతున్నాడు.

* * *

జగ్గరాజు చేతిలోని కత్తిను సంజీవి ఆశ్చర్య పోయింది.

"ఏమిటండీ ఇది!" అందామె.

"నన్ను నేను అంతం చేసుకోపోతున్నాను" అన్నాడు జగ్గరాజు ఓ నిర్ణయానికి వచ్చిన వాడిలా.

"ఎందుకు?" అంది సంజీవి.

"నువ్వు పురాణాలు చదివావు. అందులో పతివ్రతలు మొగుళ్ళకోసం ఎలాంటి త్యాగాలు చేశారో కూడా చదివుంటావు. కానీ ఆ త్యాగాలు చేయడం నీ వల్లకాదు. నేను పురాణపురుషుణ్ణి. కానీ నువ్వు వాటిలోని సతివి కాలేవు. అందుకే నన్ను నేను అంతంచేసుకుందామనుకుంటున్నాను" అన్నాడు జగ్గరాజు.

కాసేపు సంజీవికి అర్థంకాలేదు. అందుకే అతని కోరిక ఎలాంటిదైనా తీరుస్తానని కొడుకుమీద ఒట్టేసి చెప్పింది. అప్పుడు బయటపడిన భర్తకోరిక విని ఆమె ప్రాణ్పడి పోయింది.

జగ్గరాజిప్పుడు అరుంధతి గదిలోనికి వెడతాడట. జరిగే వ్యవహారంలో సంజీవి కలగజేసుకోరాదట.

"నా బలహీనత నన్ను జయించింది. నేను అసహాయుణ్ణి" అన్నాడు జగ్గరాజు బాధ నటిస్తూ.

'కన్నకొడుకుమీద ఒట్టేశాను. నేనిప్పుడు అసహాయురాల్ని' అనుకుంది సంజీవి.

వీరిద్దరి అసహాయత కారణంగా అరుంధతికూడా అసహాయురాలై పోయింది.

ఇంచుమించు స్పృహ తప్పిన స్థితిలోవున్న అరుంధతి కోసం ఆ రోజు అర్ధరాత్రి పన్నెండు గంటలకు జమీం

దారు గుర్రపుబండి వచ్చింది. బాపన్న, జగ్గరాజు కలిసి ఆమెను బండిలో ఎక్కించారు.

ఆ తర్వాత వచ్చిన శేఖరానికి అరుంధతి ఏమయిందో తెలియలేదు. ఎవరూ చెప్పలేదు.

# 7

“మా వాడికి అయిదేళ్ళు నిండబోతున్నాయి. ఈ ఏడాది ఏ వింత అనుభవం నాకోసం కాచుకునుందో చూడాలి” అన్నాడు జగ్గరాజు.

“రెండ్రోజుల క్రితం అరుంధతి పారిపోయింది తెలుసా?” అన్నాడు బాపన్న ఉన్నట్లుండి.

జగ్గరాజు ఉలిక్కిపడి “ఏమిటన్నారూ?” అన్నాడు.

“అరుంధతి పారిపోయింది...”

జగ్గరాజుకు క్షణంపాటు బుర్ర పనిచేయలేదు. ఆ రోజు బండెక్కించి జమీందారుగారింటికి పంపించేక జమీందారు గారికామె విపరీతంగా నచ్చేయడంవల్ల పర్మనెంటుగా ఉంచేసుకుంటానంటే బాపన్న కాదనలేకపోయాడు. ఆమె వైఖరిగమనించి ఆత్మహత్యా ప్రయత్నాలూ వగైరాలు కొనసాగనీకుండా కట్టుదిట్టమైన కాపలా ఆమెకేర్పాటు చేయబడింది.

కొన్ని నెల్లా జీవితం గడిపేక అరుంధతిలో కాస్త మార్పువచ్చింది. ఒక పర్యాయం జగ్గరాజు కూడా ఆమె కబురుపెట్టి రప్పించుకుంది. జగ్గరాజువద్ద జమీందారు గురించీ, జమీందారువద్ద జగ్గరాజు గురించీ చాడీలు చెప్పి వాళ్ళమధ్య విరోధాన్ని సృష్టించడానికి ప్రయత్నించింది. కానీ బాపన్న తెలివితేటలతో దాన్ని ముందుగానే పసిగట్టి ఇద్దర్నీ హెచ్చరించేడు.

వ్యభిచారానికి మానసికంగా యింకా సిద్ధంకాక పోవడంవల్లనే అరుంధతిపట్ల జమీందారు ఆకర్షణ తరగకుండా వుండిపోయింది. ఒక నెలరోజులనుండి ఆమె కాస్త ఉత్సాహంగా కనబడుతూ మామూలుగా వుంటోంది. ఈ కారణంగా ఆమెకు కాపలా కట్టుదిట్టం కాస్త తగ్గిందేమో రెండ్రోజుల క్రితం ఆమె తప్పించుకు పారిపోయింది.

"పారిపోయి ఏంచేస్తుందంటారు?" అన్నాడు జగ్గరాజు కాస్త వెటకారంగా.

"కాబోయిన మొగుడు దగ్గరకు వెడుతుందేమో?" అన్నాడు బాపన్న.

"ఏం మొహం పెట్టుకు వెళుతుంది? దానికి మనమే దిక్కు" అన్నాడు జగ్గరాజు.

"అంతేలెండి మరి" అన్నాడు.

## 8

ఊరంతా అట్టుడికిపోయింది బాపన్న హత్యతో.

బాపన్న చచ్చినందుకు విచారించిన వాళ్ళు బహు తక్కువ. కానీ ఆ బహుతక్కువమందిలోనూ జగ్గరాజున్నాడు. కారణం బాపన్న అతిదారుణంగా హత్య చేయబడినందుకాదు. హంతకుడు శేఖరమైనందుకు!

శేఖరం బాపన్నని చంపేడంటే అరుంధతి అతన్ని కలుసుకునివుండాలి. అరుంధతి అతన్ని కలుసుకుందంటే శేఖరం తననూ చంపడానికి వస్తాడు. హత్యచేసిన శేఖరం పోలీసులకు పట్టుబడి జైల్లో వున్నాడు. అయినా జగ్గరాజుకు భయంగానేవుంది.

శేఖరం జగ్గరాజు కంటె బలమైనవాడు కాడు. ధైర్య

సాహసాల్లో అతను జగ్గరాజుకు సాటిరాడు. ప్రస్తుతం అతను జైల్లోకూడా వున్నాడు. అయినా జగ్గరాజు శేఖ రాన్ని తల్చుకుని భయపడుతున్నాడు.

మనిషికి బలానిచ్చేది కండలుకాదు. నీతి. మనిషి చేసిన తప్పు అతని బలాన్ని హరింపజేస్తుంది. తను చేసినది తప్పని జగ్గరాజుకు ఖచ్చితంగా తెలుసును. అందుకే అతను శేఖ రానికి భయపడుతున్నాడు. అతని భయాన్నధికం చేస్తూ శేఖరం జైల్లోంచి తప్పించుకుపోయిన వార్త ఈ రోజే అతన్ని చేరింది.

ఎల్లుండి తను పుట్టినరోజని గుర్తుచేస్తే జగ్గరాజు కంగా రుగా తన భయాన్ని భార్య దగ్గిర వ్యక్తపరిచాడు. భర్త అలా భయపడడం కొత్తగా వున్నప్పటికీ సహజమేనని తోచింది సంజీవికి. అతను చేసిన నేరంలో తనకూ పాత్ర వుంది మరి.

"ఈ పుట్టినరోజు ఎలా గడుస్తుందో" అనుకున్నాడు జగ్గరాజు. తనకెంతో దగ్గిరవాడైన బాపన్న మరణించేక అతని కిసుమంత మనోదౌర్బల్యం కూడా కలిగింది.

అందుకు తగ్గట్టుగానే ఆ మధ్యాహ్నం అతనికి పోస్టులో ఒక ఉత్తరం వచ్చింది. అది శేఖరం వ్రాశాడు.

"ఒరేయ్ జగ్గూ!

చిన్ననాటి స్నేహితుడవని నమ్మి ప్రాణానికి ప్రాణ మైన అరుంధతిని నీ దగ్గిర వదిలిపెట్టాను. కానీ నువ్వు నన్ను దారుణంగా మోసం చేశావు. నువ్వు చేసినది తల్చు కుంటూంటే నా గుండెలు కుతకుత ఉడికిపోతున్నాయి.

నీ భాగస్వామి బాపన్న చచ్చేడుగదా. ఇంక నీ వంతు కూడా రానుంది. కేవలం నీ అంతు తేల్చడంకోసమే

నేనిప్పుడు జైల్లోంచి తప్పించుకున్నాను. నిన్ను దేవుడు కూడా కాపాడలేడు.

నీ మూలంగా అరుంధతి జీవచ్ఛవమైపోయింది. విషయం నాకు చెప్పి నిజంగా శవమైపోయింది. అరుంధతి లేనిదే నాకు జీవితంలేదు. నాకింత అన్యాయం చేసినందుకు నీతో వదిలిపెట్టను. నీ వంశాన్ని సర్వనాశనం చేస్తాను.

శేఖరం."

ఉత్తరం చదివిన జగ్గరాజు కంపించిపోయాడు. భార్యకు కూడా ఆ ఉత్తరం అందించాడు. ఆమె చదివి "దీన్ని తీసుకువెళ్ళి పోలీసులకు చూపించండీ" అంది.

అదే చేయాలనుకున్నాడు జగ్గరాజు. కానీ ఈ ఉత్తరం చూపించి అరుంధతి గురించి కూడా చెప్పాల్సి వస్తుందేమో నని భయపడ్డాడతను. అయితే కాసేపు ఆలోచించి కొన్ని అబద్దాలు జోడించి అరుంధతి కథ పోలీసులకింకో విధంగా చెప్పవచ్చునని అనుకున్నాడు. ఉత్తరాన్ని జేబులో పెట్టుకుని వీధిలోపడ్డాడు.

జగ్గరాజు పోలీస్టేషనుకు వెడితే అక్కడ అతను ఎదురు చూడని వార్త ఎదురై సంతోషంతో ఉక్కిరిబిక్కిరై పోయాడు. శేఖరం జైలునించి పారిపోయి ఈ ఊరు వచ్చాడు. పోలీసుల కంటబడ్డాడు. తప్పించుకునేందుకు ప్రయత్నించగా కాల్పులు జరిగాయి. అతను తీవ్రంగా గాయపడగా పోలీసులు హాస్పిటల్లో జేర్పించారు. ప్రస్తుతం కొన ఊపిరితో వున్నాడు.

జగ్గరాజు తన జేబులో ఉత్తరాన్ని బైటకు తీయలేదు. అతను శేఖరాన్ని చూడ్డానికి హాస్పిటల్ కు వెళ్ళాడు. జగ్గరాజు హాస్పిటల్ కు చేరుకునేసరికి శేఖరం చనిపోయాడని తెలిసింది. శేఖరం శవాన్నతను కళ్ళారా చూసి తృప్తిగా, బాధగా నిట్టూర్చాడు.

# 9

ఏదో పీడకలవు అర్ధరాత్రివేళ మెలకువ వచ్చింది జగ్గ రాజుకి. అతనికి విపరీతమైన భయంవేయగా పక్కనే పడు కున్న భార్యను లేపాడు. విసుక్కుంటూ లేచింది సంజీవి.

"దీపం కాస్త పెద్దదిచేయి. నాకు భయంగా ఉంది!"- అన్నాడు జగ్గరాజు.

కలిగిన ఆశ్చర్యం సంజీవి నిద్రమత్తును పోగొట్టింది. హారికేన్ లాంతరువత్తి కాస్త హెచ్చించి—"మీకు భయ మేమిటండి" అంది.

"శేఖరం చాలా భయంకరంగా కలలో కన్పించాడు" అన్నాడు జగ్గరాజు. విపరీతమైన భయం కలిగినప్పుడు మనిషి మరీ చిన్నపిల్లవాడిలా ప్రవర్తిస్తాడు. జగ్గరాజిప్పుడు భార్య రక్షణ కోరుతున్నాడు.

సంజీవి కూడా కాస్త భయపడింది. కానీ ధైర్యం చెప్పడంకోసమని "తెల్లారితే మీ పుట్టినరోజు. అనవసరం భయాలు పెట్టుకోక హాయిగా పడుకోండి" అంది.

"రేపు నీ పుట్టినరోజా—అయితే రేపే వస్తాను..." అన్న మాటలు జగ్గరాజుకి వినిపించాయి.

"శేఖరం!" అన్నాడు జగ్గరాజు అప్రయత్నంగా.

"ఏమిటండీ మీరనేది?" అంది సంజీవి. ఈ పర్యాయం ఆమెకూ భయంగా ఉంది.

"ఆ మాటలు విన్నావా?"

"ఏ మాటలు?"

జగ్గరాజు చెప్పాడు.

సంజీవి నవ్వి "అదంతా మీ భ్రమ. మీ నీడను చూసు కుని మీరే భయపడుతున్నారు. నాకు ధైర్యం చెప్పాల్సిన

మగవాళ్ళు మీరు'' అంది.

జగ్గరాజు పడుకు నేందుకు ప్రయత్నించాడు కానీ నిద్ర పట్టలేదు. మరో పది పదిహేను నిముషాల్లోనే సంజీవికి నిద్ర పట్టేసింది. జగ్గరాజు కళ్ళు మూసుకుని కాసేపటూ ఇటూ దొర్లి నిద్రపట్టక కళ్ళు తెరిచి చూశాడు. ఒక్క సారి అతని నరాలన్నీ బిగుసుకుపోయాయి.

శేఖరం అతని మంచంమీద పక్కనే కూర్చుని జగ్గరాజు వంకే పరీక్షగా చూస్తున్నాడు.

''కళ్ళు తెరిచావా - ఎప్పుడు తెరుస్తావా అని చూస్తున్నాను. తెల్లవారడాని కింకెంతో వ్యవధిలేదు. ఎందరో గొప్పవాళ్ళకు కానీ రాని అవకాశం నీకిస్తున్నాను. అదే నీ చావు నీకు తెలియడం. రేపురాత్రి ఎనిమిది గంటలకు నువ్వు చస్తావు. ఈ చావు నువ్వు తప్పించుకోలేవు. ఎక్కడ దాగున్నా వెతుక్కుంటూ వచ్చి మరీ నిన్ను చంపుతాను. ఈ హత్యాకాండ ఇంతటితో ఆగదు. తరతరాలకీ నీ వంశాన్ని పట్టుకు వేన్నాడుతుంది. నీ వంశంలోని ప్రతి వాడినీ సరిగ్గా ఇరవై అయిదేళ్ళ ఐన రోజు రాత్రి ఎనిమిది గంటలకు అంతం చేస్తాను.

ఈ విషయం నీ భార్యకు చెప్పు. ఈ విషయం తెలుసు కున్న తర్వాత కొడుక్కు పాతికేళ్ళు వచ్చేదాకా నీభార్య పడే మానసిక క్షోభ నాకు సంతోషాన్ని కలిగిస్తుంది. ఆ తర్వాత మానసిక క్షోభపడే వంతు నీ కోడలిదౌతుంది. అలా తరతరాలు'' శేఖరం వికటంగా నవ్వాడు. ఆ నవ్వులో అతని ముఖం భయంకరంగా మారిపోయింది చూస్తూండగా అతను అదృశ్యమైపోయాడు.

వెర్రికేక పెట్టాడు జగ్గరాజు. ఉలిక్కిపడి లేచింది సంజీవి.

జగ్గరాజు వణికిపోతూ భార్యకు జరిగినది చెప్పాడు. సంజీవికి ఏం మాట్లాడాలో తోచలేదు. ఆ తర్వాత భార్యా భర్తలిద్దరికీ సరిగ్గా నిద్రపట్టలేదు.

తెల్లవారుతూనే జగ్గరాజు భయాలన్నీ పోయాయి. అతను అనవసరంగా రాత్రి భయపడినందుకు నవ్వుకున్నాడు. పగలు గడుస్తున్నకొద్దీ అతనిలో క్రమంగా ఉత్సాహం పుంజుకుంది.

జగ్గరాజు తలంటిపోసుకున్నాడు. కొత్తబట్టలు కట్టుకున్నాడు. భార్య అతని కిష్టమైన పులిహోర, పాయసం చేసింది. ఇంటికి వేరే ఎవరినీ పిలవలేదు.

రాత్రి ఏడున్నర దాటాక ఎవరో జగ్గరాజు ఇంటితలుపు తట్టారు. జగ్గరాజే స్వయంగా వెళ్ళి తలుపుతీశాడు. సుమారు పద్దెనిమిదేళ్ళ కుర్రాడు లోపలకి వచ్చాడు.

"నా పేరు సుదర్శనం ఒక సారి లోపలకు రావచ్చా" అన్నాడు.

"సుదర్శనమంటే..."

"సుందర్రావుగారి దివాణంలో పని చేస్తున్నాను. ఇందిర గారు పంపించారు. అర్జంటుగా మీకో సమాచారం చెప్పాలి. అలా పక్కగదిలోకి వెడదాం" అన్నాడతను.

జగ్గరాజు అతన్ని తీసుకుని పక్కగదిలోకి వెళ్ళాడు.

తర్వాత సరిగ్గా అయిదునిముషాలకు ఒక భయంకరమైన కేక వినపడింది.

లోపల వంటింట్లో ఉన్న సంజీవి చటుక్కున పరుగెత్తుకు వచ్చింది. ఆమెకు సుదర్శనం కనపడ్డాడు.

"జగ్గరావుగారెందుకో పెద్ద కేకపెట్టి పడిపోయారు" అన్నాడు సుదర్శనం.

"నువ్వెవరు!" అంది సంజీవి.

సుదర్శనం మాట్లాడకుండా అకస్మాత్తుగా వెళ్ళిపో బోయాడు.

"ఆగు..." అంది సంజీవి. సుదర్శనం ఆగలేదు.

అతన్ని ఆపడం సంజీవివల్ల కాలేదు. ఆమె త్వరగా పరుగెత్తుకుని పక్కగదిలోకి వెళ్ళింది. అక్కడ జగ్గరాజు చచ్చి పడి వున్నాడు.

జగ్గరాజు గుండె ఆగి చచ్చినట్లు డాక్టరు పరీక్షలో తేలింది.

# 10

## రామదాసు తండ్రిగారి కథ:

రామదాసు తండ్రిపేరు ప్రసాద్. అతను బుద్ధిగా చదువుకునేవాడు. క్లాసులో మంచి మార్కులు వచ్చేవి. ఎంత తిండి తిన్నా మనిషి పీలగా ఉండేవాడు. మనిషి పీలగా ఉన్నా అతనికీ పంతం, పట్టుదల ఎక్కువ.

ప్రసాద్ సాధారణంగా ఎవరిజోలికీ వెళ్ళడు. ఎవరైనా తన జోలికి వస్తే సహించడు. ఇంటర్మీడియట్ రెండో సంవత్సరం చదువుతూండగా అతనికి చంచలతో పెళ్ళయింది. రెండో సంవత్సరం పూర్తిచేసి సెకండ్ క్లాసులో పరీక్ష ప్యాసుకాగానే అతను చదువు మానేశాడు.

చదువు పూర్తయి ఒక ఏడాదివరకూ ప్రసాద్ బాగానే ఉన్నాడు. అతనికి పుత్రోదయంకాగానే బుద్ధి నెమ్మదిగా పెడదారులు తొక్కసాగింది. అయితే ఏ విషయమూ పైకి తేలనిరకం కాబట్టి ఏడాదివరకూ అతని సంగతి బయట పడలేదు.

రోజూ పేకాటకని ఒక స్నేహితుడింటికి వెళుతూండే

వాడు ప్రసాద్. ఒకరోజున అత్తగారు హఠాత్తుగా కళ్ళు తిరిగి పడిపోగా పక్కింటివాళ్ళబ్బాయిని ఆ స్నేహితుడింటికి పంపించింది చంచల. ఆ ఇల్లు తాళం వేసుందని తిరిగొచ్చాడు పక్కింటబ్బాయి. ఈలోగా అత్తగారు తేరుకుంది కానీ రాత్రి పది గంటలకు తిరిగివచ్చిన భర్త-పేకాటలో ఈరోజూ డబ్బు పోయిందనగానే ఆమె మనసులో అనుమానం చోటుచేసుకుని-పేకాట ఎక్కడా దేరని అడిగింది.

“రోజూ ఆడే చోటేది?” అన్నాడు ప్రసాద్.

“ఆ ఇల్లు తాళంవేసి ఉందట” అంటూ జరిగింది చెప్పింది చంచల.

ప్రసాద్ తడబడ్డాడు కానీ విషయం చెప్పకుండా మాట దాటించాడు.

భర్త తనవద్ద అబద్ధమాడుతున్నాడని తెలియగానే ఎందుకూ అన్న అనుమానంకూడా దానంతటదే చంచలకు కలిగింది. ఆమె సునిశిత దృష్టి భర్త తప్పునడవడిని గుర్తించేయగలిగింది. ఒకరోజామె స్వయంగా భర్తకు తెలియకుండా అతన్ననుసరించి వెళ్ళింది.భర్త ఏ ఇంటికి వెళ్ళాడో ఆ ఇంటి తలుపులు తట్టింది.

తలుపులు తీసిన ప్రసాద్ భార్యను చూసి ఆశ్చర్యపోయాడు. ఆమె అతన్ని తోసుకుంటూ లోపలకు వెళ్ళి అక్కడున్న వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయింది.

ఆమె తన స్నేహితురాలు లీల!

లీల భర్త త్రాగుబోతు, జూదరి. అతను లీలను పూర్తిగా అలక్ష్యంచేస్తున్నాడు.

ఈ ఇల్లు ప్రసాద్ అద్దెకు తీసుకున్నాడు. అప్పుడప్పుడు

స్నేహితులతో పేకాడుతుంటాడు. లీలదా పక్కల్లే. వాళ్ళ దొడ్లోంచి ఈ ఇంటి దొడ్లోకి రావడం చాలా సులువు. రహస్యంగాకూడా ఉంటుంది.

ఈ వ్యవహారం బయటపడినాక క్షణకాలం మాత్రమే నేరస్థులిద్దరూ భయపడ్డారు. తర్వాత లీల "చంచలా నీకు సంగీతంబాగా వచ్చుగదా – శిక్షణకూ, సాధనకూ రోజూ మీ ఇంటికి వస్తాను" అంది.

లీల లేకపోతే నేను చచ్చిపోతానని ప్రసాద్ అన్నాడు.

ఇంతకాలం గుంభనగా సాగుతున్న వ్యవహారం ఇప్పుడు చంచలకు తెలిసేక ఆగిపోలేదు. సరిగదా ఆమె అనుమతితో ఆమె గృహంలోనే జరుగుతోంది.

ఆడదాని అలుసు చూసుకుని తన ఇచ్చవచ్చిన రీతిని ప్రవర్తించే అనేకమంది మగవాళ్ళ లిస్టులో తన కొడుకూ చేరాడని చూచాయగా గ్రహించిన సంజీవమ్మ కోడల్ని పిలిచి తన భర్త ఉదంతం చెప్పింది. అది విని కంపించిపోతూ చంచల ప్రసాద్‌కు వివరించింది.

ప్రసాద్ నవ్వి "ఇద్దరాడవాళ్ళు ఏకమై నన్ను మార్చడానికి మంచి కథే అల్లారుగానీ – ఎంతకాలమూ లీలేనా – సంగీతానికింకో మంచి శిష్యురాలిని చూడు" అన్నాడు.

## 11

సాయంత్రం అయిదు గంటల ప్రాంతంలో ప్రసాద్ ఒక్కడూ వరండాలో పడకకుర్చీలో పడుకుని పేపరు చదువుకుంటున్నాడు. ఆ రోజుతనికి ఇరవై అయిదేళ్ళు నిండాయి. పుట్టినరోజు సందర్భంగా ఆ రోజుకతను ఇంట్లోనే ఉండిపోయాడు.

ఎవరో తలుపు తట్టేరు. ప్రసాద్ లేచివెళ్ళి తలుపు

తీశాడు.. ఎవరో అపరిచితుడు. .

"నా పేరు సుదర్శనం_లోపలకు రావచ్చా?" అంటూనే లోపల అడుగు పెట్టాడు ఒక పద్దెనిమిదేళ్ళ కుర్రాడు.

"ఎవరున్నువ్వు?" అన్నాడు ప్రసాద్.

"పేరు చెప్పానుగా. నన్ను లీలమ్మగారు పంపించారు. మీ పుట్టినరోజు కానుకగా ఆవిడ ఒక అపూర్వ విశేషాన్ని పంపించారు" అంటూ జేబులోంచి ఒక ఫొటో తీశాడు. ప్రసాద్ కుతూహలంగా ఆ ఫొటో వంక చూశాడు. అందులో ఒక అద్భుత సౌందర్యవతి వుంది.

"మీ కిష్టమైన పక్షంలో సరిగ్గా రాత్రి ఏడున్నర కీ అమ్మాయిని తీసుకుని నేను మీ ఇంటికి వస్తాను. మచ్చిక చేసుకునే బాధ్యత మీది" అంటూ అతను జేబులోంచి రెండు పొట్లాలు తీసి ప్రసాద్ కిచ్చాడు. "ఒక పొట్లంలో తెల్లనిమందు, రెండో దాంట్లో ఎర్రమందు. తెల్లమందు మీ అమ్మగారికివ్వండి. ఆవిడకి ఒళ్ళు తెలియని నిద్ర పట్టేస్తుంది. ఎర్రమందు మీ శ్రీమతి కివ్వండి. అది వేసుకుంటే కదల లేరు, మాట్లాడలేరు" అన్నాడా యువకుడు.

మంత్రముగ్ధుడిలా అవందుకున్నాడు ప్రసాద్. అతనికి ఏం మాట్లాడాలో తెలియలేదు. రకరకాల అనుమానా లతన్ని వేధిస్తున్నాయి. ఎన్నడూ లేనిది లీల ఇలాంటి ఆఫర్ ఎందుకిచ్చింది?

ఆశ ఆవేశాన్ని పుట్టించింది. ఆవేశం వివేకాన్ని చంపింది. ఏడున్నరయ్యేసరికి సిద్ధంగా వున్నాడు ప్రసాద్. అప్పటికతని తల్లి తెల్లమందు తిని పడుకుంది. అతని భార్య పడకగది మంచంమీద కదలలేని స్థితిలో కూర్చుని వుంది ఉలుకూపలుకూ లేకుండా.

సరిగ్గా ఏడున్నరకు - సుదర్శనం వచ్చాడు - బంగారు బొమ్మలాంటి అమ్మాయిని తీసుకుని. అతను వరండాలో వుండిపోయాడు. ఆ అమ్మాయిని తీసుకుని పడకగదిలోకి వెళ్ళాడు ప్రసాద్. అతను తలుపులు వేస్తుంటే అమాయకంగా అడిగిందామె-"సంగీత పాఠం మీరు నేర్పుతారా? మా శ్రీమతా."

ప్రసాద్ నవ్వి "నువ్వు వీణలాంటి దానివి. నిన్ను మీటి నీలోంచి రాగాలు పలికిస్తాను" అంటూ ఆమె చేయి పట్టుకున్నాడు. అప్పటి కతని ఉద్దేశ్యం అర్థమైనదానిలా "లీల నన్ను మోసంచేసిందా" అందామె అతన్ని విదిలిస్తూ. జరిగినదంతా ఆమెకు వివరించి "లీల నాకోసం నిన్ను పంపింది. నన్ను కాదనకు..." అంటూ ప్రసాద్ ముందడుగువేశాడు.

చంచలకంతా కనబడుతోంది. అన్నీ వినబడుతున్నాయి. కానీ అసహాయురాలిలా ఆమె కళ్ళముందుజరిగే ఘోరాన్ని చూస్తూ వుండిపోయింది.

చంచల కిప్పుడా అమ్మాయి కనబడడంలేదు. ప్రసాద్ మాత్రమే కనబడుతున్నాడు. అతనామెకు ఇప్పుడడ్డంగా వుండడం అందుకు్కారణమయుండవచ్చు.

వున్నట్లుండి కెవ్వుమన్న కేక—"అస్థిపంజరం" అన్న మాట చంచలకు వినపడ్డాయి.

ప్రసాద్ నిలువునా నేలకూలాడు. చంచల ఆశ్చర్యపోయింది. అతని ముందుండవలసిన అమ్మాయక్కడ లేదు.

హఠాత్తుగా చంచలలో చలనం వచ్చింది. ఆమె కదిలి భర్తదగ్గిరకు వెళ్ళింది.

ప్రాణం అప్పుడే పోయిందేమో తెలియదుగానీ-డాక్టరు వచ్చిచూసి అతను మరణించాడని చెప్పాడు. గుండె

అగడంవల్ల మరణం సంభవించిందని డాక్టరు అన్నాడు. సుమారు ఎనిమిది గంటల ప్రాంతాల అతని మరణం సంభవించినట్లు డాక్టరు భావించాడు.

కోడలినోట సంజీవమ్మ అన్నీ విని — "సుదర్శనం పేరు నాకు బాగా గుర్తుంది. ఆయన ప్రాణాలు తీసింది వాడే. వాడు మనిషయ్యుండడు. అస్థిపంజరం అని ప్రసాద్ అరిచేడంటే—చివరి క్షణాల్లో ఆ అమ్మాయి వాడికలా కనిపించి వుండాలి. దెయ్యం ఆయనకు చెప్పనే చెప్పింది - ఇరవై అయిదేళ్ళు నిండిన రోజున రాత్రి ఎనిమిది గంటలకు మీ వంశంలోని ప్రతి ఒక్కడిని అంతంచేస్తానని. అలాగే జరిగింది. వ్యవహారం చూస్తూంటే రామదాసుకూడా మనకు దక్కడనిపిస్తోంది" అంటూ ముందు కళ్ళనీళ్ళొత్తుకుని తర్వాత బావురుమని ఏడ్చేసింది.

# 12

రామదాసు కథ :

సరిగ్గా ఆ రోజున రామదాసుకు పాతికేళ్ళు నిండాయి. ఇదే ఆఖరి వేడుకన్న భావం సంజీవి ముఖంలో స్పష్టంగా కనబడుతోంది. చంచల ముఖంలో వేదనవుంది. లక్ష్మీనరసు మాత్రం ధైర్యంగావుంది.

"నిజం చెప్పాలంటే మీ నాన్నగారూ, తాతగారు హీనులు. చేయరాని పాపాలు చేశారు. వాళ్ళు చేసిన పాపాలే వాళ్ళని కబళించివేశాయి. దానికి ఈ ముసలాళ్ళిద్దరూ దెయ్యాల కథను జోడించారు. నిజంగానే దెయ్యాలుండి అవి మిమ్మల్ని చంపాలని వస్తే అప్పుడు వాటికి దేవుడే ఎదురెళ్ళి చంపేస్తాడు. మనుషుల్లో మీలాంటి వారు నూటికీ కోటికీ ఒకరుంటారు. మీలాంటి

వాళ్ళకు మీ పూర్వీకులకు వచ్చిన విధంగా చావురాదు. రావడానికి వీల్లేదు'' అంది లక్ష్మీనరుసు.

రామదాసుకూడా ధైర్యంగానే వున్నాడు. కానీ తన శత్రువు మనిషికాదని తెలియడంవల్ల కాస్త బెంగగా వున్నాడు.

ఈ రోజతను ఇల్లు కదలలేదు. సాయంత్రం అయిదు గంటలవేళ అతను లక్ష్మీనరుసుతో కబుర్లాడుతుండగా ఎవరో తలుపుతట్టారు. రామదాసు స్వయంగా వెళ్ళి తలుపు తీశాడు.

సుమారు పధ్ధెనిమిదేళ్ళ కుర్రాడు అక్కడ నిలబడి వున్నాడు. అతను రామదాసు పక్కనవున్న లక్ష్మీనరుసు వంక గుచ్చి గుచ్చిచూస్తూ "నేను మీతో అయిదు నిమిషాలు ఏకాంతంగా మాట్లాడాలి చాలా ముఖ్యమైన విషయం'' అన్నాడు.

ఆ కుర్రాడిలో ఏదో ఆకర్షణవుంది. రామదాసు అతన్ని లోపలకు రమ్మన్నాడు. లక్ష్మీనరుసు అక్కణ్ణించి పక్క గదిలోకి వెళ్ళిపోయింది.

"నా పేరు సుదర్శనం'' అన్నాడా యువకుడు.

రామదాసు ఉలిక్కిపడ్డాడు. ఆ యువకుడు జేబులోంచి ఒక ఫోటో తీసి రామదాసు కందించాడు. అందులో మూర్తీభవించిన సౌందర్య దేవతలా వున్న అమ్మాయి వుంది.

"చాలా పొగరైన పిల్ల. కానీ మీవంటి వాళ్ళను చూస్తే లొంగిపోతుందని నా ఉద్దేశ్యం. మీకభ్యంతరం లేకుంటే రాత్రి ఏడున్నరకే పిల్లను మీ యింటి దగ్గర వదిలి పెడతాను...''

"నువ్వు నేదేమిటో నాకర్థం కావడం లేదు. నాకు వివాహమైంది. ఇందాకా నువ్వు నా పక్కన చూసినావిడే నా భార్య" అన్నాడు రామదాసు చిరాగ్గా.

సుదర్శనం నవ్వాడు "నాకు తెలుసు. అయినా ఫరవాలేదు. మీ ఇంట్లోవాళ్ళు మీకడ్డురాకుండా చేయగల ఉపాయం నాకు తెలుసు. ఇది బంగారు అవకాశం..."

"నాకక్కర్లేదు. నువ్వు బయటకు వెళ్ళు" అన్నాడు రామదాసు కోపంగా.

సుదర్శనం సూటిగా రామదాసువంక చూశాడు. ఆ చూపులు తట్టుకోలేకపోయాడు రామదాసు.

"సరే అయితే నేను బయటకు వెడుతున్నాను. మీరూ నాతో బయటకు రండి" అన్నాడు సుదర్శనం.

అప్రయత్నంగా లేచి నిలబడ్డాడు రామదాసు. మంత్రముగ్ధుడిలా అతన్ననుసరించాడు.

# 13

"ఇదీ నేనన్న ఇల్లు" అన్నాడు సుదర్శనం.

రామదాసు మాట్లాడలేదు. అతన్ననుసరించాడు. ఇద్దరూ లోపలకు వెళ్ళేక తలుపులు వేశాడు సుదర్శనం.

"నేనిప్పుడే వస్తాను అలా కుర్చీలో కూర్చుని ఆ పక్కనున్న పుస్తకాలు చదువుతూ వుండండి" అన్నాడు సుదర్శనం.

రామదాసు పుస్తకాలుతీశాడు. కుర్చీలో కూర్చున్నాడు. సుదర్శనం అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

అవి రెండు పుస్తకాలు. ఒకదాని నిండా కథలున్నాయి. రెండో దాని నిండా ఫోటోలున్నాయి. కథలన్నీ ఒళ్ళు వేడెక్కించే సెక్సు కథలు. ఫోటోలన్నీ

మతులుపోగొట్టే సెక్సుఫోటోలు.

రామదాసు కవి నచ్చలేదు. కానీ తీసుకెళ్ళి భార్యకు చూపించాలని వుంది. అతను రెండింటినీ కుర్చీకి ఎదురుగా వున్న బల్లమీద పడేసి చిరాగ్గా ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. సుమారు అర్ధగంట తర్వాత కాబోలు అడుగుల చప్పుడైతే తలెత్తిచూశాడు.

ఆమెకు ఇరవైఏళ్ళుంటాయేమో. చూడ్డానికి అందానికి మరో పేరులావుంది. నవ్వుతూ అతన్ని పలకరించి "మీ పేరేనా రామదాసుగారు. తమ్ముడు తీసుకువస్తానన్న వ్యక్తి మీరే అయుండాలని అనుకుంటాను" అంది.

రామదాసు నమస్కారం చేసి "సుదర్శనం మీ తమ్ముడా?" అన్నాడు.

"అవును. ఈ ఇంట్లో మేమిద్దరమే వుంటున్నాం. వాడిప్పుడే దొడ్డిదారిన బయటకు వెళ్ళాడు. రావడానికింకా చాలాసేపు పట్టవచ్చు" అందామె.

"మీ పేరు తెలుసుకోవచ్చా?" అన్నాడు రామదాసు.

ఆమె మాట్లాడలేదు. కానీ ఎదురుగా బల్లమీది పుస్తకాలు తన చేతిలోకి తీసుకుంటూ—"చదివారా ఇవి!" అంది.

"అవి చదవదగిన పుస్తకాలు కావు" అన్నాడు రామదాసు ఇంకో వైపుగా చూస్తూ.

ఇద్దరిమధ్యా ఒక పావుగంట సేపు సంభాషణ నడిచింది. రామదాసు కాట్టే ఉత్సాహంగాలేదు. అతను లేచి నిలబడి "నన్నిక్కడికి ఎందుకు తీసుకువచ్చారో నాకు తెలియదు. మరి నేను వస్తాను" అన్నాడు.

ఆమె అతన్ని చేయిపట్టుకుని ఆపి "ప్లీజ్ — వెళ్ళవద్దు.

ప్రతిరోజూ ఏడున్నరకూ ఎనిమిదికీ మధ్య ఒక దొంగ వెధవ వస్తున్నాడీ ఇంట్లోకి. ఎలా వస్తున్నాడో తెలియదు. కానీ వాడు నన్నూ నా తమ్ముణ్ణీ కూడా ఏడిపిస్తున్నాడు. తరతరాలుగా మీ వంశం వారు సాహసికులట. మాకు వాడి పీడ వదిలిస్తారని మిమ్మల్ని పిల్చుకువచ్చాడు. మమ్మల్ని వాడి బారినుంచి రక్షిస్తే మీకేం కావాలంటే అదిస్తాం'' అంది.

రామదాసు ఆగిపోయాడు. సుదర్శనం తన యింటికి వచ్చి తన అక్కయ్య ఫోటో చూపించడంలోని ఆంతర్యం బోధపడింది. తను తప్పక వీళ్ళకు సహాయం చేయాలనుకున్నాడు.

సుమారు పది నిముషాలు గడిచేక సుదర్శనం వచ్చాడు' ''క్షమించాలి. చాలా ఆలశ్యమైపోయింది'' అన్నాడు.

రామదాసు మాట్లాడకుండా నవ్వాడు. అతనికి పరిస్థితి ఏమీ అర్థంకావడంలేదు. కానీ అక్కణ్ణించి వెళ్ళలేక పోతున్నాడు.

సుదర్శనం స్వరం తగ్గించి ''అక్కయ్య చెప్పేవుంటుంది మీకు. ఆ దొంగాడెలావస్తున్నాడో తెలిసిపోయింది నాకు. ఇందాకట్నించీ నేను దొడ్డికాపలా కాస్తున్నాను. అయిదు నిముషాల క్రితం వాడు కాంపౌండ్ వాల్ దూకి దొడ్లో ప్రవేశించాడు. తర్వాత బాత్రూం ప్రాంతంలో క్షణంపాటు తచ్చాడాడు. ఆ తర్వాత బాత్రూంకున్న చిన్న కిటికీ తలుపులు బయటికి లాగాడు. అవి సాధారణంగా మేము గడియవేయం. అవి వెంటిలేషన్ గురించి ఉద్దేశించినవి. వాడాకిటికీలోంచి బాత్రూంలోనికి దిగాడు. నేను వెంటనే ఏం చేశానంటే ఒక రబ్బరుపాము నా

వెంటిలేటర్ దగ్గర పెట్టాను. వాడు మళ్ళీ పారిపోవాలంటే ఆ పామును చూసి భయపడతాడు. అది అచ్చం నిజం లాగే వుంటుంది. ఆ తర్వాత క్షణాలమీద లోపలకు వచ్చి బాత్రూం తలుపు బయట గడివేశాను. ఆ తలుపు ఎప్పుడూ దగ్గరకు వేసివుంటుంది. అంచేత నేను బయట గడియపెట్టి నట్లు వాడికి తెలియదు. ఓ గంటో, అరగంటో పోయాక ఇంట్లోకి దూరవచ్చునని వాడనుకుంటూండవచ్చు. ఇప్పుడు మీరు వాడిదగ్గర కెళ్ళాలి. నేను మాత్రం రాను. వాడంటే నాకు చాలా భయం'' అన్నాడు.

రామదాసు చటుక్కున లేచాడు. ''బాత్రూం ఎక్కడుందో చూపించు'' అన్నాడు. సుదర్శనం అతన్ని తీసుకు వెళ్ళి బాత్రూం చూపించి అక్కణ్ణించి వెంటనే వెనక్కు వెళ్ళిపోయాడు.

రామదాసు క్షణం తటపటాయించాడు. ఆ గదిలో ఉన్నవాడు గోడదూకి, వెంటిలేటరు ద్వారా బాత్రూంలో దూరాడు. వాడిదగ్గర తప్పక ఏమైనా ఆయుధాలు వుండవచ్చు. కానీ వాటిని ఉపయోగిస్తాడా?

మొండిధైర్యం తెచ్చుకుని రామదాసు తలుపు గడియ తీసి బార్లా తెరిచి లోపలి దృశ్యం చూసి ఉలిక్కిపడ్డాడు.

లోపల దొంగాడెవడూ లేడు. సుదర్శనం అక్కయ్య తను విప్పిన బట్టల్ని హేంగర్‌కి తగిలించి షవర్ దగ్గరకు వెడుతోంది, దీపపు కాంతిలో ఆమె బంగారు మేనిఛాయ మెరుస్తోంది. తనతో కొద్ది క్షణాల క్రితం మాట్లాడిన ఆ అద్భుత సౌందర్యం ఇప్పుడిలా నగ్నంగా దర్శనమిస్తుందని రామదాసు అనుకోలేదు.

"ఎవరది?" అంటూ ఆమె చటుక్కున రామదాసు వైపు తిరిగింది.

"సారీ..." అని రామదాసు చటుక్కున అక్కణ్ణించి కదిలాడు. రామదాసుకు సుదర్శనంమీద పీకలదాకా కోపం వచ్చింది. ఆ కోపంతో అతను సుదర్శనం దగ్గరకు వచ్చి కాస్త దురుసుగానే మాట్లాడాడు.

సుదర్శనం, రామదాసువంక అదోలా చూసి "కావాలని నేనలా చేశాననుకుంటున్నారా అసలు అక్కయ్యను ఎవడో వేధవనించి రక్షించడానికి మిమ్మల్ని తీసుకు వచ్చిన నేను ఇంకోలా చేస్తానని ఎందుకనుకుంటున్నారు? ఈ ఇల్లు చాలా పెద్దది. నేను గడియపెట్టేలోగానే వాడింకో గదిలోకి దారి తీసినట్లున్నాడు పదండి, ఇద్దరం కలిసే వెదదాం" అన్నాడు.

ఇద్దరూ కలిసి ఓ పావుగంటకు పైగా కొన్ని గదులు వెతికాక "మీరామూల గదులు రెండింట్లో వెతకండి నేనీమూల గదుల్లో వెదుకుతాను" అన్నాడు సుదర్శనం. రామదాసు అటువెళ్ళాడు.

ఆ మూల రెండు గదులున్నాయి. మొదటిగదిలో ఏమీ విశేషం కనబడలేదు. కానీ రెండో గదిలో రామదాసుకు మళ్ళీ అవాంఛనీయ పరిస్థితి ఏర్పడింది.

గదిలో బల్బు ప్రకాశవంతంగా వెలుగుతోంది.సుదర్శనం అక్కయ్య నిలువుటద్దం ముందు నిలబడి ఉంది. ఆమె ముందు నాలుగైదు రకాల చీరలున్నాయి. ఒకొక్కటే ఒకసారి మీద వేసుకుని చూసుకుంటోందామె. ఇంకా ఏ చీరా ఆమెకు నచ్చినట్లు లేదు. అద్దంలో కనపడుతున్న ఆమె నగ్నశరీరం ఆ విషయాన్ని రామదాసుకు చెప్పింది.

అతను కళ్ళు మూసుకుని అక్కణ్ణించి బయటపడ్డాడు.

సుదర్శనం ఇంకా ఇందాకా తాము కూర్చున్న చోటికి రాలేదు. బహుశా ఇంకా వెతుకుతున్నాడేమో.

పరిస్థితి చాలా అయోమయంగా ఉంది రామదాసుకు. తనిక్కడికి ఎందుకు వచ్చాడో—ఇప్పుడు జరుగుతున్నవన్నీ ఎందుకు జరుగుతున్నాయో అర్థంకావడంలేదు. అతను తల పట్టుకుని కూర్చున్నాడు. బుర్ర సరిగా పనిచేయడంలేదు.

ఎప్పటికీ సుదర్శనం రాకపోవడంచూసి అతను విసుగ్గా ఒక్కసారి టైము చూసుకున్నాడు. ఏడున్నర కావస్తున్నది.

కొద్ది సెకన్ల తర్వాత—కెవ్వుమన్న కేక వినిపించింది. అది ఒక స్త్రీ కంఠం. సుదర్శనం అక్కయ్యే అయుండాలి.

రామదాసు హడావుడిగా పరుగెత్తాడు. దార్లో ఒక గోడ మూలగా మనిషి మూలుగు వినిపించిందతనికి. దగ్గరకు వెళ్ళి చూడగా అతను సుదర్శనం. కాళ్ళు చేతులూ ఎవరో కట్టేశారు.

సుదర్శనం నీరసంగా మూలుగుతూ — "ముందు వెళ్ళి అక్కయ్యను రక్షించండి. మీరు వచ్చేరని ఆ దుర్మార్గుడన్నింటికీ తెగించినట్లున్నాడు..." అన్నాడు.

మళ్ళీ — "కెవ్వు"మన్న కేక వినపడింది. రామదాసు చటుక్కున పరుగెత్తాడు. ఆ కేక డ్రస్సింగ్ రూంలోంచి వస్తోంది. అతనా గది చేరుకునేసరికి దృశ్యం చాలా ఘోరంగా వుంది. గోడకు జారగిలపడి రెండుచేతులూ జోడించి దణ్ణం పెడుతూందామె. ఆమెను సమీపిస్తున్నాడో యువకుడు.

రామదాసు చటుక్కున వెళ్ళి ఆ యువకుణ్ణి పట్టుకుని లాగి గడ్డంమీద గట్టిగా బలంగాగుద్దాడు. దీనికి తయారుగా లేని ఆ యువకుడు క్రింద పడిపోయాడు.

"నన్ను రక్షించండి—" అంటూ ఆమె రామదాసును సమీపించి అతన్ని వాటేసుకుంది.

"మీకేమీ భయంలేదు" అంటూ ఆమెను విడిపించుకున్నాడు రామదాసు.

ఆ యువకుడు నెమ్మదిగా సర్దుకుని లేచి మెరుపు వేగంతో రామదాసు పొట్టలో గుద్దేశాడు. రామదాసు పొట్ట చేత్తో పట్టుకుని మెలికలు తిరిగిపోతూ నేలమీద పడ్డాడు. ఆమె పరుగెత్తబోయింది. అతను పైటకొంగు చేజిక్కించుకున్నాడు. లేడిలా ఆమె పరుగెడుతూంటే పులిలా అతను లంఘిస్తున్నాడు. రామదాసు తేరుకుని లేచేసరికి ఆమె ఇంచుమించు వివస్త్ర అయింది. అతనికి పూర్తిగా లొంగిపోయేలా వుంది. ఆమె ఒంట్లో ప్రతిఘటించే శక్తి వున్నట్లు లేదని తెలిసిపోతోంది.

రామదాసులో కోపం పెరిగింది. ఆవేశం కట్టలు తెంచుకుంది. అతనా యువకుణ్ని సమీపించి పిడిగుద్దులు గుద్దాడు. క్షణం వదలకుండా అందినచోటల్లా కొట్టడం ప్రారంభించాడు. అతని దెబ్బలకా యువకుడు తట్టుకోలేక — రెండు చేతులూ జోడించి నమస్కరించి "చూడు మిస్టర్ నన్నేం చేయకు. దీన్ననుభవించాలని నాకు చాలా కోరికగా వుంది. నా కోరిక నెరవేరనిస్తే నీకు రెండు లక్షలిస్తాను. కావలిస్తే ముందుగా నువ్వే దీన్ననుభవించి ఆ తర్వాతనే నాకు వది లేయ్. నేను నీ కడ్డురాను. ఇంక కొట్టకు..." అన్నాడు.

ఆమెకూడా అతన్ని సమీపించి — "రామదాసుగారూ— మీలాంటి ఉత్తముడిని నేను చూడలేదు. మీకు నా సర్వస్వం అర్పించడానికి సిద్ధంగా ఉన్నాను. ఈ క్షణం నుంచీ నేను మీదాన్ని" అంది.

రామదాసు ముఖం గంభీరంగా ఉంది "చూడమ్మా—

నాకు వివాహమైంది. లక్షణంగా కాపురం చేసుకుంటు న్నాను. నువ్వు నాకు చెల్లెలి లాంటిదానివి. నీకేవిధమైన భయంలేదు. ఈ దుర్మార్గుణ్ని పోలీసులకు అప్పజెప్పేద్దాం. ఆ తర్వాత నీకుతగ్గ వరుణ్ని నేనే స్వయంగా వెతికితెచ్చి పెళ్ళి చేస్తాను'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే ఆ యువకుడు అక్కణ్నించి పరుగెత్తాడు. అతన్ని పట్టుకుందామని తనూ లేవబోయాడు రామదాసు. కానీ ఆమె అతన్ని వారించి ''పోనీయండి. వాడు పారిపోతున్నాడు. ఏవిధంగానూ తనకు నేను దొరకనని తెలిసి వాడు వెళ్ళిపోతున్నాడు. బహుశా ఈ దరిదాపులకు మళ్ళీ రాడనుకుంటాను...'' అంది.

''నువ్వు వెళ్ళు బట్టలు కట్టుకో చెల్లాయ్'' అన్నాడు రామదాసు. ఆమె అదోలా అతనివంక చూసి అక్కణ్నించి కదిలింది. రామదాసు వెళ్ళి సుదర్శనం కట్లు విప్పాడు. సుదర్శనం రామదాసు పాదాలమీద వాలిపోయి ''నన్ను మీరు క్షమించాలి'' అన్నాడు.

''ఎందుకు?''

''అరుంధతి అనబడే అమ్మాయిని శేఖరం వివాహం చేసుకోవాలనుకున్నాడు. కానీ మీ తాతగారు మిత్ర ద్రోహం చేసి అరుంధతి బ్రతుకు అధోగతిపాలు చేశారు. శేఖరం మీ వంశంమీద పగబట్టినా పగతీరకుండానే జైలు పాలై చనిపోయాడు.

అయితే శేఖరం పగ మీ వంశంలోని దుర్మార్గత్వం మీదనే కానీ మీ వంశంలోని మనుషులమీద కాదు.

మీ నాన్నగారిని, తాతగారిని చంపినవిధంగా మిమ్మల్ని చంపడం కుదరదని—ఫోటో చూసి మీరు చలించనప్పుడే తెలిసింది. అయినా మిమ్మల్ని క్కడికి తీసుకువచ్చి పశువులా

మీరు మారడాని కథకాళాలు సృష్టించాను. కానీ మీరు ఈ క్షణందాకా కూడా మనిషిలాగే మనగలిగారు. మీరు సామాన్యులు కారు. మానవజాతికే ఆదర్శమైన మీరు మీలాంటి సంతానాన్ని కని మంచి పౌరుల్ని తయారు చేయాలి. ఇంక మీరు వెళ్ళిరండి..'' అన్నాడు సుదర్శనం.

రామదాసు ఆశ్చర్యంగా చూసి ''కావచ్చు. కానీ మీరు నేరసులు. చట్టాన్ని చేతుల్లోకి తీసుకోవడం నేరం. మా తాతగారినీ నాన్నగారినీ హత్యచేసిన నేరానికి...'' అన్నాడు.

''నన్ను మీరు నేరస్థుడిగా భావిస్తే రేపు నేనే మీ ఇంటికి వస్తాను. పోలీసుల కప్పగిద్దురు. కాని ప్రస్తుతానికి వెళ్ళండి'' అన్నాడు సుదర్శనం. ఆమాట చాలా గంభీరంగా ఏదో ఆజ్ఞాపిస్తున్నట్లుగా ఉంది.

రామదాసు మారు మాట్లాడకుండా అక్కణ్ణించి కదిలాడు.

# 14

రామదాసు ఇల్లు చేరేసరికి ఎనిమిదిన్నర దాటింది. అతని బామ్మ ఏదో ఫోటో దగ్గర నిలబడి ధ్యాన నిమగ్నురాలై ఉంది. అతని రాక ఇంటిల్లపాదినీ ఆనందాబ్ధిలో ఓలలాడించింది. చంచల కళ్ళమ్మట ధారగా ఆనంద బాష్పాలు కారాయి.

''మీరు వస్తారని నాకు తెలుసు. మంచివాళ్ళకు దేవుడు ద్రోహం చేయడు'' అంది లక్ష్మీనరుసు.

''అరుంధతి తల్లి నా ప్రార్థన నాలకించింది'' అంది బామ్మ.

అప్పుడే బామ్మ దగ్గిరున్న ఫోటో రామదాసు నాకర్షించింది. ''ఎవరు బామ్మా-ఈ ఫోటోలో ఆవిడ...''

అన్నాడతను.

"మన వంశానికి శాపం ఇచ్చిన అరుంధతి" అన్నాడు.

రామదాసు కళ్ళు తిరిగిపోయాయి. "ఈమెను నేను ఒక అరగంట క్రితమే చూశాను" అన్నాడు.

బామ్మ ఆశ్చర్యపోయింది. ఆ తర్వాత పాత ఫొటోలు తిరగేసి చూసి-రామదాసు ఆశ్చర్యకరమైన విషయాన్ని గ్రహించాడు. ఆ రాత్రి తనే అమ్మాయినైతే శాపాదేవో ఆమె అచ్చం అరుంధతిలాగుంది. ఆమె నెవర్నించి శాపాదేవో అతను శేఖరం లాగున్నాడు. సుదర్శనం మాత్రం ఎవరో తెలియలేదు.

తనకు జరిగిన అనుభవాన్ని విశదీకరించి ఇంటిల్లపాదికీ చెప్పాడు రామదాసు.

అంతావిని బామ్మ "అవన్నీ దయ్యాలే అయుంటాయి. నువ్వు దడుసుకుని ప్రాణాలు కోల్పోతావేమోనని అవి నీకు నిజంచెప్పలేదు. నా చిట్టితండ్రి పెద్ద పరీక్షకే తట్టుకుని వచ్చాడు" అంది.

లక్ష్మీనరసు ముఖంలో అటువంటి భర్తను పొందగలిగానన్న గర్వం స్పష్టంగా కనపడింది.

చంచల ముఖంలో రవంత బాధ కనపడింది.

ఆమె బహుశా తన భర్తను తల్చుకుంటున్నట్లుంది.

ఆ మర్నాడతను విచారించగా తను రాత్రి వెళ్ళిన భవనం ఒక సంపన్నుడిదనీ ఆయన ఏదో విలాసయాత్రకని వెళ్ళగా గత పదిహేను రోజులుగా తాళం పెట్టబడి వుందనీ తెలిసింది. సుదర్శనం మాత్రం మళ్ళీ అతనికి కనపడలేదు.

—: ఐపోయింది :—

# అన్వేషణ!

## అజీజ్

"ఇక్కడ ఆపు నాయనా!" అంది కౌసల్యాదేవి రిక్షా వాడితో.

ఆమె చెప్పినచోట రిక్షా ఆగింది.

కౌసల్యాదేవి దిగకుండా, కళ్ళజోడు సరిజేసుకుంటూ తలెత్తి గేటుమీది బోర్డువైపు చూసింది. 'సరస్వతీ ప్రైమరీ స్కూల్.'

ఆఁ, తన గమ్యం ఇదే, అనుకుంటూ తృప్తిగా రిక్షా దిగింది.

సీటుమీద చిన్న మూటా, చేతిసంచీ అందుకుని, రిక్షా వాడి చేతిలో రూపాయి నోటుపెట్టి స్కూలు భవనం వైపు అడుగులు వేసింది.

ఏభైఏళ్ళు దాటిన ప్రౌఢ. పసిమి ఛాయ. మెడకిందా, నుదుటిమీదా వయసూ, అనుభవాలూ వేసిన ముడతలు. ఒకసారి కన్నెత్తి చూసినవారికి ఆమె వదనంలో సన్యాసినులకుండే ఏదో అనూహ్యమైన దివ్యతేజస్సు ద్యోతకమౌతుంది. తెల్లని నేతచీరా, రవికా, మెడలో రుద్రాక్షమాలా వేసుకున్న ఆమె చూపరులకి నిజంగా సన్యాసినేమో అన్న భ్రాంతి కలిగిస్తుంది.

కాని, ఆమె సన్యాసిని కాదు. సన్యాసినులకి తనదీ, తనవాళ్ళూ అన్న ఆపేక్షలూ, ఐహిక బంధాలూ, మమకారాలూ ఉండవు. మోహపాశాలకీ, కలతలకీ కార్పణ్యాలకీ అతీతంగా ఉంటాయి వారి మనసులు.

ఆధ్యాత్మిక చింతనతో, మోక్షానికి మెట్లు వేసుకోవాలని ఇల్లూ, వాకిలి వదిలి, కన్న కూతుర్ని పరాయివాళ్ళ చేతుల్లో పెట్టి తెగిన గాలిపటంలా ఎక్కడెక్కడో ఉన్న పుణ్యతీర్థాలు సేవిస్తూ వాటిలో ఈశ్వరుణ్ణి అన్వేషిస్తూ తిరిగి తిరిగి హఠాత్తుగా కూతురివైపు మనసుమళ్ళి, మమతానురాగాలు పొంగులువారి, కన్నకూతుర్ని చూడాలన్న కాంక్షతో ఉరుకూ పరుగులతో వచ్చిన కౌసల్యాదేవి సన్యాసిని ఎలా అవుతుంది?

పదహారు నెలలు!

ఈ పదహారు నెలలు తన చిట్టితల్లిలో ఎన్ని మార్పులు తెచ్చాయో? ఇంకా చిట్టితల్లి ఏమిటి? ఇప్పుడు పవిత్రకి ఇరవై రెండేళ్ళు నిండి ఉంటాయి. బహుశా, ఇరవై మూడులో ప్రవేశించి ఉంటుంది. ఆడపిల్లల్లో ప్రతివారం ఏదో ఒక మార్పు కనిపిస్తూనే ఉంటుంది మరి!

పవిత్ర ఎంతమారినా తను చిటికెలో గుర్తుపట్టగలదు.

కన్నకళ్ళు కదా? పవిత్రకూడా తనని లిప్తపాటులో పోల్చుకుంటుంది. ఆనందం పట్టలేక పరిగెత్తుకు వస్తుంది. తనని అల్లుకుపోయి ఉక్కిరి బిక్కిరిచేస్తూ గారాలు పోతుంది.

ఆలోచిస్తూ స్కూలు కాంపౌండ్ గేటు తోసుకుని లోనికి నడిచింది కౌసల్యాదేవి. చాలా చిన్న కాంపౌండు. కాంపౌండ్ నాలుగువైపులా కట్టిన క్లాసు గదులు క్లాసుల్లో పనివాళ్ళేదో తెలుగు పద్యాన్ని ముక్తకంఠంతో పెద్దగా ఆలాపిస్తున్నారు. చేతిలో సన్నని బెత్తం పట్టుకుని అప్పుడే ఓ క్లాసులోంచి వరండాలోకి వచ్చిన ఓ స్త్రీ కౌసల్యాదేవిని చూసి–"ఎవరండీ? ఏంకావాలి?" అంది.

"సుభద్రమ్మగారికోసం వచ్చేనమ్మా! వారు ఉన్నారా?"

"ఇంతక్రితమే రిక్షాలో బైటికెళ్ళారు. ఎప్పుడొస్తారో చెప్పలేను."

కౌసల్యాదేవి కళ్ళు పవిత్ర కనిపిస్తుందేమోనని క్లాసు గదులవైపు పారి, నిరాశతో తిరిగి ఆమెవైపు మళ్ళేయి. "ఆవిడ వచ్చేవరకూ నేనిక్కడ ఎదురు చూడవచ్చా?" అడిగింది నీరసంగా.

ఆ స్త్రీ తలూపి, "రండి!" అంటూ వరండా మెట్లు దిగింది.

ఆమెని అనుసరిస్తూ కుడిపక్క క్లాసుల చివర ఉన్న గదివైపు నడిచింది కౌసల్యాదేవి.

ఆ గది ద్వారానికి "హెడ్ మిస్ట్రెస్" అనే నేమ్ ప్లేట్ తగిలించి ఉంది.

ఆమె కౌసల్యాదేవిని లోనికి తీసికెళ్ళి–"ఇది సుభద్రమ్మ

గారి ఆఫీసు. ఆమె వచ్చేవరకూ ఇక్కడ కూర్చోండి" అంది.

కౌసల్యాదేవి చిన్నగా నవ్వుకుంది. ఈమె ఎవ్వరో గానీ తనకేం తెలీనట్లే మాట్లాడుతోంది. ఏణ్ణర్థం క్రితం తను చూసినప్పుడు ఈమె ఇక్కడ లేదు. ఈమధ్యే కొత్తగా చేరి ఉంటుంది.

తనకి సుపరిచితమైన ఆఫీసు ఇది. కాని, అప్పటికీ, ఇప్పటికీ ఏదో మార్పు కనిపిస్తోంది.

గదిలో ఉన్న ఫర్నీచరూ, వస్తువులూ, గోడలకి వేళాడుతున్న పటాలూ, తలుపుకీ, కిటికీలకీ వేళాడుతున్న పరదాలూ ఉత్తమ అభిరుచినేగాక, సంపన్నతని కూడా చాటుతున్నాయి. దీన్నిబట్టి సుభద్రమ్మ స్కూలు మును పటికంటే బాగానే నడుస్తోందని తెలుస్తోంది. ఆమెతో బాటు పవిత్రకూడా సుఖంగా ఉండి ఉంటుంది మరి.

అనుకుంటూ చంకలోవున్న మూటా, చేతిలోని సంచీ కింద పెట్టి కుర్చీలో కూర్చుంది కౌసల్యాదేవి. వెళ్ళబోతున్న ఆ స్త్రీని ఆపి—"చూడమ్మా! నేను సుభద్రమ్మనుకాదు, పవిత్రనికూడా చూడాలి. కాస్త ఆ అమ్మాయిని పిలు స్తావా?" అంది.

ఆమె కనుబొమలు ముడిచి అర్థంకానట్టు చూసింది. "పవిత్రా? స్కూల్లో కొత్తగా చేరిందా? ఏ క్లాసు?"

ఊహించని ఆ ప్రశ్నతో కౌసల్యాదేవి కాసేపు అవాక్కయిపోయింది. "పవిత్ర స్కూల్లో చదివే పసి పిల్ల కాదమ్మా! పిల్లలకి పాఠాలుచెప్పే పాతికేళ్ళ యువతి. నీవూ ఇక్కడ పనిచేస్తున్నట్టున్నావుగా? పవిత్రని ఎరగవా?"

ఆ స్త్రీ మొదటిసారి నవ్వి-"బహుశా, ఆ పేరుగల టీచర్ ఒకప్పుడు పనిచేసేదేమో! నాకు తెలిసినంత మటుకూ ఆ పేరుగల పంతులమ్మెవరూ లేరిక్కడ!" అంది.

"నీవు ఎన్నాళ్ళనించి పనిచేస్తున్నావిక్కడ?" అడిగింది కౌసల్యాదేవి ఆశ్చర్యంగా.

"ఆరు నెలలవుతోంది!"

"అంటే, ఆరు నెలలనించీ పవిత్ర ఇక్కడ లేదా?" విభ్రాంతితో అడిగింది కౌసల్యాదేవి.

"ఆ పేరు ఇప్పుడే కొత్తగా వింటున్నాను!"

కౌసల్యాదేవి గుండె గతి వేగం అందుకుంది. ఏమిటీ విచిత్రం! ఏణ్ణర్థం క్రితం తను వెళ్ళేటప్పుడు సుభద్రమ్మ పవిత్ర తల నిమురుతూ స్వయంగా చెప్పింది.

"కొత్తగా కొన్ని క్లాసులు ప్రారంభించబోతున్నాను. అందులో పవిత్రకి అవకాశం కల్పించాలని వుంది. అటు తన చదువూ చూసుకుంటూ, ఇటు నా పర్యవేక్షణలో మంచి ఉపాధ్యాయినిగానూ శిక్షణ పొందుతుంది"అని.

ఓహో! సుభద్ర ఆ కొత్త క్లాసులు ప్రారంభించే సంకల్పం మానుకుందేమో, అందుకే పవిత్ర ఇక్కడ పని చెయ్యడంలేదు కామోను. ఆ కారణంగా ఈమెకి పవిత్ర గురించి తెలీదు.

స్కూలు వెనక భాగంలోనే సుభద్రమ్మ అందమైన ఒంటంతస్తు ఇల్లుంది. అందులోనే ఆవిడతో పవిత్ర వుంటోంది. ఆ పిల్లకి కలుపుగోలుతనం తక్కువ. తన పనేమిటో, తనేమిటో ఈమెకి పవిత్రగురించి తెలియకపోడానికి అదీ ఓకారణమే మరి! అనవసరంగా భయపడ్డాను.

అనుకుంటూ తలెత్తి—"చూడమ్మా! నీవు కొత్తకదా, ఆ విషయాలేవీ నీకు తెలీవు. ఎవరైనా పాత వుపాధ్యాయిని వుంటే పంపించు. ఆమెనడిగి కనుక్కుంటాను" అంది కౌసల్యాదేవి.

"సరే, పార్వతిని పంపిస్తానుండండి" అంటూ నడిచింది స్త్రీ.

కౌసల్యాదేవికి ఆలోచనలన్నీ కూతురుచుట్టే భ్రమిస్తున్నాయి. ఆ నాలుగు గోడలమధ్య ఒంటరిగా కూర్చున్న ఆమె మస్తిష్కం గతాన్ని సినిమా రీలులా గిరగిర తిప్పసాగింది వెనక్కి.

ఆరేళ్ళక్రితం తను సూర్యాపేటలోని గర్ల్స హైస్కూల్లో టీచరుగా పనిచేసేది. అప్పుడు సుభద్రమ్మ ఆ స్కూలుకి ప్రధానోపాధ్యాయిని. ఇద్దరూ అదే స్కూలు నించి కాస్త వెనకా ముందు రిటైరయ్యేరు. అప్పటికే తను భర్తృహీన!

సుభద్రమ్మ వాళ్ళ స్వస్థలం హైద్రాబాదే. రిటైరయ్యాక ఆమె ఇక్కడికి వచ్చి, ఈ కాంపౌండూ అదీ కొని, స్కూలు ప్రారంభించింది. విధివశాత్తూ ఆ మరుసటి ఏడే ఆమె భర్త పోయేడు. సంతానంలేని సుభద్రమ్మ తన దగ్గిర చేరే పిల్లల్ని కన్నవాళ్ళుగా, ఆప్యాయంగా చూసుకుంటుంది.

రిటైరయ్యేక తను పవిత్రతో తన స్వస్థలం అనంతపూర్ వెళ్ళిపోయింది. అక్కడే, ఓ స్వంత పెంకుటిల్లూ, మూడెకరాల మాగాణీ వున్నాయి. పవిత్ర ఒక్కతే సంతానం తనకి. కడుపులో పెట్టుకు పెంచింది.

స్వస్థలం చేరే సమయానికి పవిత్ర—మొదట సంవత్సరం

ఇంటర్ పాసయ్యింది, సూర్యాపేటలోనే. అనంతపూర్ వెళ్ళాక ప్రభుత్వ జూనియర్ కాలేజీలో రెండో సంవత్స రంలో చేర్పించింది.

స్వంత ఇల్లు, కొలుకిచ్చిన పొలం, ప్రభుత్వం ఇచ్చే పెన్షన్. ఇద్దరు ప్రాణులకి ఇంకేం కావాలి? రోజులు సాఫీగా, ఏ బాదరబందీ లేకుండా గడిచిపోసాగేయి.

పవిత్ర కాలేజీకి వెళితే ఒంటరితనంతో తనకి పిచ్చెక్కి నట్టుండేది. తోచక ఇంటికి తాళం వేసి, గుడీ గోపురాలకి వెళ్ళి పురాణ కాలక్షేపాలు వింటూ కూర్చునేది. అనేక దైనందిన కార్యక్రమం అయిపోవడంవల్ల తన మనసంతా అవ్యాజ్యమైన ఆధ్యాత్మిక చింతనలో క్రమేపీ మునిగి పోసాగింది. ఎక్కడికో వెళ్ళాలి. ఏదో చూడాలి. తరిం చాలి. ఇలాటి ప్రేరేణ కలిగేది మనసులో.

ఇలా వుండగా, పవిత్ర ఇంటర్ కానిచ్చి, డిగ్రీ కాలేజ్‌లో బి.ఏ. మొదటి సంవత్సరంలో చేరింది. పవిత్రకి చదువు పిచ్చి ఎక్కువ. దానికి తోడు సాహిత్య పిచ్చివుంది. ఇంటర్ కాగానే వున్న ఆ ఒక్క నలుసునీ ఓ అయ్య చేతిలో పెట్టి, నిశ్చింతగా కృష్ణా రామా అను కుంటూ దేశంలోని పుణ్యస్థలాలన్నీ చుట్టి, తనువు చాలించా లనే తపన వుండేది తనకి.

తను గ్రాడ్యుయేట్ అయ్యేవరకూ పెళ్ళి ప్రసక్తి ఎత్త వద్దని కరాకండీగా చెప్పేసింది పవిత్ర. దాని ఏకోరిక కాదన గలిగింది తను? కంటికి రెప్పలా చూసుకుంటున్న చిట్టితల్లి అభీష్టానికి విరుద్ధంగా మెడవంచి మూడు ముళ్ళు వేయించగలదా? అందుకే కిమ్మనకుండా ఊరుకుంది.

ఇంటర్‌లో చదివేటప్పుడు పవిత్ర పరకిణీలూ, ఓణీలూ

వేసుకునేది. శారీరకంగా ఆడపిల్లల్లో మార్పు రావడం ఎంతసేపు? ఆ మార్పే కాలేజీలో చేరేక చీరెల అవసరం తెప్పించేయి పవిత్రకి.

అక్కణ్ణించీ మొలకెత్తింది కొత్త సమస్య! సాయంత్రం కాలేజీనించి రాగానే పుస్తకాలు మూలకి విసిరి చిందులు తొక్కేది. ఏం జరిగిందమ్మా అంటే, దార్లో ఎవ్వడో కొంటె కోణంగి కన్ను గీటేడనీ, ఈల వేసేడనీ మండి పడేది.

కాలేజీలో కుర్రాళ్ళు తనని చూడగానే సినిమా డ్యూయెట్లందుకుంటూరుట. ఏదో ఓ కామెంట్ విసురు తుంటారుట. కాలేజి బ్యూటీ అనీ, మిస్ ఆంధ్రా అనీ ఏవో నిక్ నేమ్‌లూ తగిలించేరుట. కాలేజీకి వస్తున్నా, పోతున్నా ఎవ్వడో ఓ కుర్రాడు సైకిల్ మీద కూని రాగాలు తీస్తూ భత్యంలేని బాడీగార్డులా దిగబెడుతుంటా డట.

చదువుకునే అందమైన అమ్మాయిలకిది పరిపాటే. రోజూ జరిగేదింతే! పవిత్ర నవ్వితే పున్నమి జాబిల్లి జ్ఞప్తికి వస్తుంది. నడిస్తే హంసహొయలు స్ఫురణికి వస్తాయి. కాటిక దిద్దిన కళ్ళు చూస్తే లేడికళ్ళు ఇవేనా? అనిపిస్తుంది.

అటువంటి కుందనపు బొమ్మ కాలేజీ కుర్రకారులో చిచ్చు రగిల్చిందంటే రగల్చదూ మరి? కాని, రోజు రోజుకూ ఆ ఆగడాలు మితిమీరసాగేయి. ఒకటి రెండు సార్లు వళ్ళుమండి ఒకరిద్దరు కుర్రాళ్ళని గూబలు గుంయ్యి మనిపించిందట పవిత్ర.

అప్పటినించీ తన గుండెలో దడ ప్రారంభమైంది.

ఇంట్లో మగ దిక్కు లేని ఆడకూతుళ్ళు. పొగరుబోతు కుర్రకారు దేనికైనా తెగిస్తే? పవిత్ర క్షేమైనా హాని జరిగితే తను జీవించగలదా? ఏదైనా ముంచుకువస్తే ఆదుకోడానికి చుట్టు పక్కల దగ్గరి బంధువు లెవ్వరూ లేరాయె. ఈ సమస్య ఎట్లా పరిష్కరించేది?

చిన్న చిన్న పట్టణాల్లో ఎప్పుడూ ఈ చిక్కులు వుండనే వుంటాయి. ఊళ్ళో ఏ అమ్మాయైనా కాస్త అందంగా వుంటే చాలు, నలుగురి దృష్టిలో నానుతుంది. పనీ పాటా లేని జులాయి వెధవలకి ఓ చర్చై కూర్చుంటుంది.

పెద్ద పట్టణాల్లో ఇవన్నీ పట్టించుకునే నాధుడెవ్వడు? అక్కడ అడుగుతీసి అడుగు వేస్తే ఓ అందమైన అమ్మాయి ఎదురు పడుతుంది. కిళ్ళీ బడ్డీలముందూ, టీకొట్ల దగ్గర గంటల తరబడి నిల్చుని అమ్మాయిలగురించి మాట్లాడుకునే ఓపిక అక్కడెవరికుంటుంది?

అంధకారంలో ఆశాకిరణంలా సుభద్రమ్మ తళుక్కుమంది. హైద్రాబాద్ వంటి మహానగరంలో పవిత్రకి ఎలాంటి డిస్టర్బెన్సు వుండదు. నిక్షేపంగా చదువుకుంటుంది. ఒంటరిగా వున్న సుభద్రమ్మకి తమ తోడూ లభిస్తుంది.

ఈ ఆలోచన రాగానే సుభద్రమ్మ పేర ఓ వుత్తరం రాసి పడేసింది. దానికి వెంటనే ఆమెనించి జవాబు వచ్చింది, బైలుదేరి రమ్మని. ఆలోగా తను ఇంటికోసం అద్దెవాళ్ళని సంపాదించుకుంది. వాళ్ళు నెల నెలా అద్దె ఎం.ఓ. జేసే ఒప్పందం కుదుర్చుకుని, అటు పెన్షన్ డబ్బులు కూడా హైద్రాబాద్‌లోనే ముట్టే ఏర్పాట్లు జేసుకుని ఓ శుభముహూర్తాన పవిత్రతో రైలెక్కింది.

ఇక్కడి ఉమెన్స్ ఆర్ట్స్ కాలేజీలో, బి.ఏ. సెకెండియర్లో చేరింది పవిత్ర.

సుభద్రమ్మ ఆప్యాయతానురాగాల మధ్య నాలుగు మాసాలు చిటికెలో దొర్లిపోయేయి. ఈ మహానగరంలో ఒంటరిగా తనకేమీ తోచేదికాదు. ఇక్కడి మనుషులకి ఒకరి గొడవ పట్టించుకోడానిగ్గానీ, యోగక్షేమాలు అడిగి తెలుసుకోడానిగ్గానీ తీరిక వుండదాయె. ఎప్పుడూ ఏదో ముంచుకు వచ్చినట్టు వురుకూ పరుగులూను.

పవిత్రా, సుభద్రమ్మా వెళ్ళిపోయేక రామాయణ మహాభారతాలతోనూ, భగవద్గీతా పారాయణంలోనూ కాలం వెళ్ళమార్చేది తను. ఆ మహాగ్రంథాల ప్రభావమేమో, క్రమేపీ తనలో ఎక్కడలేని ఆధ్యాత్మిక చింతన చోటు జేసుకుంది.

అప్పుడే ఓ ఆలోచన బీజం వేసుకుంది తనలో. పవిత్రకిప్పుడు ఏ లోటూలేదు. ప్రశాంతంగా కాలేజీ కెళ్ళి చదువుకుంటోంది. సుభద్రమ్మకూడా పవిత్రను కన్నకూతురులా ఎంతో అనురాగంగా చూసుకుంటోంది.

తనిలా గోళ్ళుగిల్లుకుంటూ కూర్చునే బదులు, పుణ్యతీర్థాలు దర్శించిరావాలని ఎన్నాళ్ళనించో తనలో మెదలుతున్న చిరకాల వాంఛని దేనికి తీర్చుకోకూడదు? ఇటువంటి అవకాశం మళ్ళీ వస్తుందా? ఈ కాయం ఎప్పుడు ఏవిధంగా రాలిపోతుందో ఎవ్వరు కలగన్నారు? తన వాంఛ తీరక ముందే ఈ జీవుడు పరలోకానికి ప్రయాణం కడితే?

పవిత్ర చదువైపోయేలోగా తను తీర్థాలన్నీ చుట్టి రావచ్చు. ఆ తరవాత దానికి మంచి సంబంధం చూసి, ఏడడుగులు వేయించి, రామనామం జపిస్తూ తృప్తిగా

కన్ను మూయవచ్చు. ఓ రోజు సుభద్రమ్మ ముందు ఈ విన్నపం వుంచింది తను. దానికి ఆవిడగానీ, పవిత్రగానీ ఎలాంటి అభ్యంతరాలు చెప్పలేదు.

కావలసిన డబ్బూ, అవీ తీసుకుని ఓ సుముహూర్తాన ప్రయాణం కట్టింది. చిన్న చిన్న మజిలీలు, సుదీర్ఘ ప్రయాణాలు, కాశీ, రామేశ్వరం, బనారసు, అలహాబాదు, చిత్రకూట్ ఒక్కటేమిటీ...ఎక్కడికెళ్ళినా ఏదో అనూహ్యమైన తృప్తి, మనశ్శాంతి! గతజన్మలో ఎన్ని పుణ్యాలు చేసుకుంటే ఇటువంటి అవకాశం దొరుకుతుంది?

ఎవ్వరో వస్తున్న అడుగుల శబ్దం వినిపించి కౌసల్యాదేవి ఆలోచనలు చెదిరిపోయేయి. తలెత్తి తలుపువైపు చూసింది. పాతికేళ్ళుంటాయి ఆ యువతికి, పచ్చగా పొడుగ్గావుంది. పసిమిఛాయ.

"పార్వతి నువ్వేనా అమ్మా?"

ఆ యువతి తలూపి "మీరు?" అంది ప్రశ్నార్థకంగా.

"నేను కౌసల్యాదేవిని. ఇంత క్రితం నిన్నెక్కడో చూసినట్టేవుంది. ఎన్నాళ్ళనించి పనిచేస్తున్నావమ్మా ఇక్కడ?"

"రెండేళ్ళవుతోందండీ! నాకూ మిమ్మల్నెప్పుడో చూసినట్టు తోస్తోంది. ఇంతకీ విషయం ఏమిటి?" అందా యువతి కౌసల్యాదేవి కెదురుగా కూర్చుంటూ.

"సుభద్రమ్మతోబాటు ఇక్కడ పవిత్ర అనే అమ్మాయి ఉండేది..."

"పవిత్రా! మీరు పవిత్ర అమ్మగారా?" అందా యువతి నోరు తెరుస్తూ.

కౌసల్యాదేవి మనసు ఉరకలు వేసింది. "ఔనమ్మా!

పవిత్ర నీకు తెలుసా?" అడిగింది ఆత్రుతగా.

"తెలియకేం?"

"ఎక్కడుంది పవిత్ర?"

"అహఁ... నాకు...సరిగ్గా...సరిగ్గా... తెలియదండీ!" అంది పార్వతి తడబడుతూ.

కౌసల్యాదేవి తెల్లబోయింది. పార్వతి ఏదో చెప్పటానికి తటపటాయిస్తున్నట్టూ, దాచడానికి ప్రయత్నిస్తున్నట్టూ అనుమానం వేసింది.

"పోనీ తెలిసినంతవరకూ చెప్పమ్మా! కన్న కూతుర్ని చూడాలని ఎంతో దూరంనించి కళ్ళల్లో వత్తులు వేసుకు వచ్చేను. నీ తల్లిలాంటిదాన్ని. నిజాన్ని దాచి నన్ను క్షోభ పెట్టడం న్యాయమేనా?" అంది దీనంగా.

"ని...నిజంగా నాకేం తెలీదండీ! ఒక్క విషయం మాత్రం చెప్పగలను. పవిత్ర యిక్కడ లేదు!"

తలమీద ఏదో ఇనుపదూలం అకస్మాత్తుగా పడ్డట్టు తోచింది కౌసల్యాదేవికి.

"ఎక్కడుంది మరి?"

"తెలీదు. చాలా రోజులనించీ ఆమె ఇక్కడ కనిపించడం లేదు. ఎక్కడికెళ్ళిందో ఎందుకు వెళ్ళిందో కారణాలు నాకు తెలియవు!"

"ఎన్నాళ్ళనించి కనిపించడం లేదు?"

"బహుశా, ఏడాదిపైనే అయిందనుకుంటాను."

ఏడాది! అంటే, తనిక్కడినించి వెళ్ళిన కొద్ది నెలలకే పవిత్ర కనిపించడం లేదా? ఏమైంది? ఎక్కడికెళ్ళింది?

"ఇక నాకు సెలవిప్పిస్తారా? క్లాసులో పిల్లలు గొడవ పెడుతున్నట్లున్నారు. సుభద్రమ్మగారు వచ్చేక అన్ని విష

యాలూ అడిగి తెలుసుకోండి'' అంటూ లేచింది పార్వతి.

నేరస్తుడు పోలీసు ఆఫీసరు ముందు నిలిచి ఎంత త్వరగా జారుకుంటే అంత మంచిదనుకుంటాడు. అలా తోచింది కౌసల్యాదేవికి ఆ యువతి ప్రవర్తన. ఆమె జవాబుకెదురు చూడకుండానే పార్వతి గదిలోంచి వెళ్ళిపోయింది.

చేష్టలుడిగి అటే చూస్తుండిపోయింది కౌసల్యాదేవి.

## 2

బైట రిక్షా వచ్చి ఆగిన చప్పుడు వినిపించి ఆశగా తలుపువైపు చూసింది కౌసల్యాదేవి. ఎవ్వరో ఆఫీసువైపు వస్తున్న చెప్పుల సవ్వడి.

తలుపుగుండా లోనికి వచ్చిక సుభద్రమ్మ దృష్టి కౌసల్యాదేవిమీద పడి కాళ్ళకి ఏదో అడ్డుపడ్డట్టు అక్కడే ఆగిపోయింది. కౌసల్యాదేవి హృదయం పొంగి పొర్లింది. ఆమె పెదాలమీద జీవంలేని నవ్వొకటి పిల్లవాయువులా వీచి వెళ్ళింది. చేతులు జోడిస్తూ లేచి నిల్చుంది.

"చెప్పండి! నేను మీకేం..." అన్న వాక్యం సుభద్రమ్మ నోటివరకూ వచ్చి ఆగిపోయింది అప్పుడు గుర్తించింది ఆమె తన ఎదుట నిల్చున్నది ఎవ్వరో, "కౌసల్యా! నువ్వేనా?" అంది సంభ్రమంగా.

"గుర్తుపట్టలేనంత మారిపోయేనా సుభద్రా?"

"మారడం ఏమిటి? అసలు మారినట్టేలేవు. ఎవ్వరో కొత్తవ్యక్తిని చూసినట్టు భ్రాంతి కలిగిందంటే నమ్ము. ఆరోగ్యం విషయంలో యింత అశ్రద్ధ చేశావేమిటీ?"

"కాలచక్రం దేన్ని స్థిరంగా వుంచుతుందని సుభద్రా?"

"పరాయి ఇంటికి వచ్చినట్లు ఇంకా నిల్చునేవున్నావేం? కూర్చో కౌసల్యా!" అని నిండుగా నవ్వుతూ లోనికి వచ్చి కూర్చుంది సుభద్రమ్మ.

అంతవరకూ తెలియని భయంతో కొట్టుకుంటున్న కౌసల్యాదేవి గుండె సుభద్రమ్మ నవ్వు చూసి, స్థిమిత పడింది. పవిత్ర విషయంలో ఏదైనా అనర్థం జరిగివుంటే సుభద్రమ్మ అంత నిండుగా నవ్వుతూ దేనికి మాట్లాడుతుంది?

తేలిక పడ్డ మనసుతో కూర్చుంది కౌసల్యాదేవి.

"ఇదేనా రావడం?" అడిగింది సుభద్రమ్మ టేబిల్ మీద పెన్సిల్ అందుకుని గుండ్రంగా తిప్పుతూ.

"నాంపల్లిలో రైలు దిగగానే సరాసరి ఇక్కడికే వచ్చేను. మొత్తానికి చాలాసేపు నిరీక్షించ వలసి వచ్చింది నీ కోసం!"

"ఎక్కణ్ణించి బైలుదేరావు?"

"అలహాబాదు నించి కాశీ ఎక్స్‌ప్రెస్ ఎక్కేను. ఇటార్సీలో మరో బండి మారవలసివచ్చింది. రెండు రోజుల ప్రయాణం!"

"కార్డుముక్క కూడా వెయ్యకుండా ఇంత హఠాత్తుగా వస్తావనుకోలేదు."

"ఔను. అకస్మాత్తుగా బైలుదేరాను. అక్కణ్ణించి కార్డుముక్క వేసినా అది ఇక్కడ అందేసరికి నాలుగు రోజులు పడుతుందిట."

"కాలకృత్యాలు తీర్చుకున్నావా? కాఫీ, టిఫిన్ ఏనా తీసుకున్నావా లేదా?"

కౌసల్యాదేవి నవ్వి "ఇంకా ఎక్కడా? మిమ్మల్ని

చూడాలన్న ఆరాటం ఒక్క-క్షణం ఆగనిచ్చిందా నన్ను?''
అంది.

ఇంత సేపైనా సుభద్రమ్మ పవిత్ర విషయం ఎత్తదేం? తమ మధ్య అనవసర సంభాషణ సాగుతోంది. నిజానికి, తనని చూడగానే ఆమె పవిత్ర సంగతి ఎత్తవలసింది. ఆరాటాన్ని ఇహ అట్టే సేపు ఆపుకోలేక అడిగేసింది కౌసల్యాదేవి.

''పవిత్ర ఎక్కడుంది సుభద్రా? కనిపించదేం? కాలేజీకి వెళ్ళిందా? బుద్ధిగా చదువుకుంటోంది కదా? నే వెళ్ళాక నిన్నేమీ ఇబ్బంది పెట్టలేదు కదూ?''

ఆ ప్రశ్నల వర్షంతో సుభద్రమ్మ మొహం హఠాత్తుగా వివర్ణమైపోయింది. కనుబొమలు ముడిచి, కౌసల్యాదేవిని విచిత్రంగా చూస్తూ, ''పవిత్ర ఎక్కడుందో నీకు తెలియదా?'' అడిగింది ఆశ్చర్యంగా.

''అదేమిటి సుభద్రా! పవిత్రని నీ దగ్గరేగా వదిలి వెళ్ళేను? ఇంకా ఎక్కడుంటుంది?''

''పవిత్ర ఇక్కణ్ణించి వెళ్ళిపోయిన సంగతి నిజంగా నీకు తెలియదా?'' అంది సుభద్రమ్మ ఏదో చోద్యం చూస్తున్నట్లు.

''ఇక్కణ్ణించి వెళ్ళిపోయిందా? ఎందుకు? ఎక్కడికి?'' కౌసల్యాదేవి కంఠంలో కంపన.

''ఓహ్ గాడ్! ఆ పిల్ల ఎంత మోసంచేసింది నన్ను? ఇక్కణ్ణించి వెళ్ళిపోతూ, నీకన్ని విషయాలూ రాసేననీ, నీవు తననిక్కణ్ణించి వెళ్ళిపోడానికి అనుమతించేవనీ చెప్పింది!''

''నా చిరునామాకు ఒక స్థిరత్వం అంటూ వుంటేగా

దానికి తెలియడానికి? ఈ సంగతి ఆలోచించలేదా నీవు? సుభద్రా ప్లీజ్, నా గుండె ఆగిపోయేలా వుంది. దయచేసి ఏం జరిగిందో కాస్త వివరంగా చెప్పి పుణ్యం కట్టుకో!"

సుభద్రమ్మ భారంగా నిట్టూర్చి, తలెత్తి చెప్పసాగింది. "ఇక్కడికి వచ్చే ఉత్తరాలన్నీ పవిత్రే చూసి వేరు జేసేది. రోజూ పోస్ట్ మెన్ వచ్చే వేళకి, వరండాలో పచార్లు జేస్తూ, అతనింకా గేట్లోకి ప్రవేశించకముందే పరిగెత్తి పోస్టు అందుకునేది.

ఈ స్కూలుతో బాటు నేను కొన్ని పోస్టల్ కోర్సులు కూడా నడుపుతున్న విషయం నీకు తెలిసిందే కదా? రోజూ ఎన్నో ఉత్తరాలు వస్తుంటాయి. పవిత్రే వాటిని వేరుజేసి అందించేది. అప్పుడప్పుడూ చెప్పేదికూడా 'అమ్మ దగ్గర్నించి ఉత్తరం వచ్చింది పిన్నీ' అని. 'ఏదీ ఉత్తరం? నాకు చూపించు?' అని నేనెప్పుడూ అడగలేదు.

'ఏం రాసిందేమిటి? ఆరోగ్యం ఎలా వుందిట?' అని నీ యోగక్షేమాలు మాత్రం కనుక్కునేదాన్ని.

ఇలా రెండు నెలలు గడిచి ఉంటాయనుకుంటాను.

ఒకరోజు పవిత్ర లేని సమయంలో పోస్ట్ మెన్ ఉత్తరాలన్నీ నా టేబిల్ మీద పెట్టి వెళ్ళేడు. అందులో పవిత్ర పేర ఉన్న గులాబిరంగు కవరుచూసి, నాకేదో సందేహం కలిగింది. కవరుమీద హాండ్ రైటింగ్ ఎవ్వరో పురుషుడిలా కనిపించింది. ఆడవాళ్ళ చేతివ్రాత అప్పుడే తెలిసిపోతుంది కదా? చూడకూడదనుకుంటూనే కవరువిప్పి చూసేను.

చేంతాడంత ఉత్తరం అది. దాన్ని ఉత్తరం అనే బదులు ప్రేమలేఖ అంటే సమంజసంగా వుంటుంది!

ఆ లేఖ చదివేక నేను గ్రహించిన విషయాలు ఇవి —

అది మొదటిసారి రాసిన ఉత్తరం కాదు. ఇంతకి ముందు అనేకం రాయబడ్డాయి. అందులో వున్న విషయాలనిబట్టి, పవిత్రకూడా వాటికి తాత్సారం జెయ్యకుండా జవాబు లిస్తోంది.

ఇద్దరూ గాఢంగా ప్రేమించుకున్నారు. పెద్దలు అంగీక రించినా, అంగీకరించకపోయినా, పెళ్ళికూడా జేసుకోవా లని నిశ్చయించుకున్నారు. ఆ కుర్రాడి పేరు గౌతమ్! బయోలాజికల్ సర్వే డిపార్ట్మెంట్‌లో టైపిస్టుగా పని జేస్తున్నాడు. ఆ ఉత్తరం రాసిన తీరూ, వాడి భాషా చూస్తే, అతను పత్రికలకీ వాటికీ కథలూ గట్రా రాస్తుం టాడేమో అనిపించింది.

ఉత్తరం ఇంకా నా చేతిలో వుండగానే పవిత్ర గది లోకి రావడం జరిగింది. నన్నూ, నా చేతిలోని ఉత్తరాన్నీ చూసి, మొదట తెల్లబోయినా తరవాత కోపంతో మొహం జేవురించింది.

'ఇలా రా!' అన్నాను.

పట్టుబడ్డ దొంగలా వచ్చి కూర్చుంది.

'ఎన్నాళ్ళనించీ సాగుతోందీ వ్యవహారం?' అని రెండు మూడు సార్లు రెట్టించి అడిగితే నోరు విప్పింది.

అతను నవలా రచయితట. ఎన్నాళ్ళనించో అతన్ని అజ్ఞాతంగా అభిమానిస్తోందిట. హైద్రాబాద్ వచ్చేక అనుకోకుండా అతనితో పరిచయం కలిగిందిట. ప్రేమించు కున్నారుట.

అతని కులంగోత్రం అడిగేను. మనతో ఎందులోనూ సరితూగడు.

నాకు వళ్ళు మండిపోయిందంటే నమ్ము. ఈ రచయి

తలు భావోద్రేకలు, అల్పసంతోషులు. రాబడీ తక్కువే. అనవసర మోహపాశాలకిలోనై, పండంటి భవిష్యత్తు మట్టిపాలు జేసుకోక! చిన్నతనం గనుక, లోకజ్ఞానం లేదు గనుక, ఏదో రాశావ్. ఈసారి క్షమిస్తున్నాను. మళ్ళీ ఇలా ఉత్తర ప్రత్యుత్తరాలు సాగిస్తే మాత్రం సహించేది లేదు.

నీ తల్లి వచ్చేవరకూ, ఆమెతో సంప్రదించేవరకూ ఆ వ్రాడి ఛాయలకి వెళ్ళొద్దు. నా సంరక్షణలో వున్న నీవు నేను గీచిన గీటు దాటకూడదు. రేపు ఏమైనా ఐతే, లోకం ఎవ్వరిమీద నిందలు మోపుతుంది? నీ తల్లి నామీద దుమ్మెత్తి పొయ్యదూ? అన్నాను దాదాపు అరుస్తూ.

దాంతో, నేను ఊహించని విధంగా ఒక్కసారి నా మీద విరుచుకు పడింది పవిత్ర! నిమ్మకి నీరెత్తినట్టుండే ఆ పిల్ల, అలా అపరకాళిలా దాడిజేస్తే చేష్టలుడిగి చూస్తుండి పోయేనంటే నమ్మ.

పాతకాలపు అమ్మాయిల్లా ఈనాటి యువతులకి ఒకరి సంరక్షణలో ఉండే అవసరం లేదుట. ఈనాటి ఆడపిల్లలకి తమ సంరక్షణ ఎలా చేసుకోవాలో బాగా తెలుసుట.

చేసుకుంటే ఆ అబ్బాయినే చేసుకుంటాను. లేదా, ఉరిపోసుకు చస్తాను. మీ కులగోత్రాల పాత చింతకాయ పచ్చడి చాదస్తాలతో తన నిర్ణయాన్ని కూల్చవద్దు అంటూ విసవిసా వెళ్ళిపోయింది. నిశ్చేష్టురాలినై అలా చూస్తుండి పోయేను.

ఆ సంఘటన జరిగిన రెండవరోజునే, మా అమ్మకు అన్ని వివరాలు తెల్పుతూ టెలిగ్రాం ఇచ్చేను. ఆవిడ జవాబు కోసం ఎదురు చూస్తున్నాను అని నాతో చెప్పింది.

అది జరిగిన మూడవరోజు సాయంత్రం - నీ దగ్గర్నించి టెలిగ్రాం వచ్చిందనీ, తనిక్కణ్నించి వెళ్ళిపోయి, తన స్నేహితురాలి ఇంట్లో ఉండటానికి నీవు అనుమతించేవనీ ప్రకటించింది. అప్పుడు నేను పడ్డ మనఃక్షోభ అంతా ఇంతా కాదు" అంది సుభద్రమ్మ.

కౌసల్యాదేవి కథంతా చాలా శాంతంగా వింది. అంత శాంతంగా ఎలా వినగలిగిందా అని తరవాత ఆమెకే ఆశ్చర్యం వేసింది. అతి కష్టంమీద తలెత్తి_"ఆ టెలిగ్రాం ఏదో చూపించమని నీ వడగలేదా?" అంది.

"ఆపిల్ల అడిగే అవకాశం ఇస్తేగా? ఆదరాబాదరా బట్టలూ అవీ సూట్ కేస్‌లో సర్దుకుని ఆటోలో కూర్చుని వెళ్ళిపోతేనూ! శిలాప్రతిమలా చూస్తూ వుండటమే తప్ప ఆ సమయంలో నా కాలూ చెయ్యీ ఆడగలిగిందా?"

గుండెలో రేనుగుర్రాలేవో దౌడుతీస్తున్నట్టు తోచింది కౌసల్యాదేవికి. పవిత్రని ఇక్కడ వదలి వెళ్ళి తనెంత తప్పు జేసిందో ఇప్పుడు తెలుస్తోందామెకి. తప్పు తనదా? లేక, పవిత్రని సరిగ్గా అదుపులో పెట్టలేక పోయిన సుభద్రమ్మదా? అదీ కాక, రోజు రోజుకూ వెర్రితలలు వేస్తూ_మారుతూ, పెద్దల అనుభవాలనీ, శాసనాలని ధిక్కరిస్తూ తమ ఇష్టానుసారం సాగిపోతున్న ఈ యువతరానిదా? ఎవ్వరిది?

ఇప్పుడు దోషం నీదీ నాదీ అంటూ మథనపడితే ఒరిగే దేమిటి? జరిగిందేదో జరిగిపోయింది. ఇక జరగబోయే దాని గురించి యోచించడం వివేకం! "పవిత్ర వుంటానని వెళ్ళిన ఆ స్నేహితురాలి చిరునామా ఏమిటో తెలుసా నీకు?" అడిగింది కౌసల్యాదేవి ఆతృతగా.

"తెలీదు. ఆ అమ్మాయి నిదానంగా అన్నీ చెప్పి వెళితే కదా?"

"అదేమిటి? కాలేజీలో కనుక్కుంటే పోయేదిగా? రోజూ వస్తోందో, రావడం లేదో?"

సుభద్రమ్మ క్షణం మౌనంవహించి "పవిత్ర కాలేజీ మానుకుంది!" అంది.

కౌసల్యాదేవి గుండె ఒక్కసారి ఆగిపోయినట్లు తోచింది.

కనుక్కోవాలి. వెంటనే పవిత్ర ఎక్కడుందో కనుక్కోవాలి. ఎలా? ఎలా?

"అంత మాత్రాన నీవు దానిగురించి ఏమీ పట్టించుకో లేదా ఇన్నాళ్ళు?"

"నా మాట వినకుండా నన్నెదిరించి, ఇల్లువిడిచి వెళ్ళి పోయిన పిల్లకోసం నేను దేనికి దేవిర్లాడ్డం? ఆ అమ్మాయి మీద నా మనసు విరిగిపోయిందనుకో!"

సుభద్రమ్మ అన్న ఆ మాటలు కౌసల్యాదేవి గుండెల్లో శూలాల్లా దిగేయి.

నిజమే! ఆమెకీ తమకీ ఏమిటి బంధనం? ఏదో కలిసి పనిచేశామనీ స్నేహితురాలనీ తనకీ, తన కూతురికీ ఇంత ఆశ్రయమిచ్చింది, ఆదుకుంది. తన బంగారం మంచిది కానప్పుడు ఆమెనని ఏం లాభం?

కొంగులో మొహం కప్పుకుని వెక్కి వెక్కి ఏడవ సాగింది కౌసల్యాదేవి.

"మరీ పసిపిల్లలా ఏమిటిది కౌసల్యా? నాకు పూర్తి నమ్మకం వుంది. పవిత్ర ఎక్కడ వున్నా సురక్షితంగా వుందని. చాలా కాలం క్రిందట నాకు కొన్ని సూచన

లందేయి. పవిత్రని ఒకచోట చూసిన వాళ్ళు నాతో చెప్పేరు. ఇప్పుడక్కడే ఉందో లేదో నేను చెప్పలేను.''

కౌసల్యాదేవి కళ్ళు తుడుచుకుని "ఏ కాస్త ఆధారం దొరకినా సరే, నాలో ఊపిరి ఉన్నంతవరకూ ప్రయత్ని స్తాను నా బిడ్డ ఎక్కడుందో కనుక్కోడానికి. త్వరగా చెప్పు సుభద్రా?'' అంది చిరు ఆశగా.

"శాంత్ మహల్ టాకీసు తెలుసా నీకు?''

"ఆ దారమ్మట పోతూ ఒకసారి చూసినట్టు జ్ఞాపకం! ఏం?''

"పవిత్రని ఆ టాకీస్ బుకింగ్ ఆఫీసులో కూర్చుని టికెట్లమ్ముతుండటం ఒకరిద్దరు చూసినట్టు చెప్పేరు.''

"ఏమిటీ!'' తన చెవుల్ని తనే నమ్మలేకపోయింది కౌసల్యాదేవి. "పవిత్రకి సినిమా టాకీసులో టిక్కెట్లమ్మే గతేంపట్టింది?'' అంది నమ్మనట్టు.

"నాకు తెలీదు. ఆ సంగతి విన్నాక ఆ అమ్మాయిమీద నా మనసు పూర్తిగా విరిగిపోయిందనుకో. అది ఎంతవరకు నిజమో కనుక్కోడానిక్కూడా నేను ప్రయత్నించలేదు. ఆ టాకీసుకెళ్ళి, అక్కడి కర్మచార్లని అడిగితే ఏమైనా తెలియవచ్చు నీకు.''

దాంతో, ఆవిడకి తనవెంట రావడం ఇష్టం లేదనీ, తననే ఒంటరిగా వెళ్ళమని సూచిస్తోందనీ స్పష్టమైంది కౌసల్యాదేవికి. సుభద్రమ్మ ఎంత మారిపోయింది?

"సరే, వెళ్ళి కనుక్కుంటాను'' జారిపోతున్న గుండెల్ని కూడదీసుకుంటూ నీరసంగా లేచి నిల్చుంది.

"అదృష్టవశాత్తూ పవిత్ర కనిపించి, నామీద అవీ ఇవీ కల్పించి చెబితే నమ్మబాక!'' అంది సుభద్రమ్మ.

"నా చెవులు అంత పచ్చివి కావు సుభద్రా!" అంటూ బైటికి వచ్చింది కౌసల్యాదేవి.

స్కూలు ఆవరణ దాటగానే పోతున్న రిక్షా ఆపి ఎక్కింది. శాంత్ మహల్ టాకీసువైపు పోనిచ్చేడు రిక్షా వాడు. రోడ్డు పక్క ఓ గడియారం దుకాణంలో టైం చూసింది కౌసల్యాదేవి.

పదకొండు గంటలు!

పొద్దుటినించీ పచ్చి మంచినీళ్ళు ముట్టకపోయినా, ఏమీ తీసుకోవాలనిపించడం లేదు. ఆ స్థితిలో ఏ తల్లికి మాత్రం ఆకలి వేస్తుంది?"

# 3

శాంత్ మహల్ టాకీసు ముందు రిక్షా ఆగగానే, రిక్షా వాడికి డబ్బులిచ్చి ఆదరాబాదరా ఆవరణలోకి నడిచింది.

ఏదో ఇంగ్లీష్ పిక్చర్ మార్నింగ్ షో ఆడుతున్నట్టుం దక్కడ. పదకొండుంబావు అయింది గనక టిక్కెట్లివ్వడం ప్రారంభించేరు.

బుకింగ్ కిటికీల ముందు అప్పటికే జనం బారులుదీరి నిల్చునున్నారు. అందులో సగానికి పైగా నోట్ బుక్ లూ, పుస్తకాలూ పట్టుకుని, బెల్ బాటమ్, హిప్పీ జులపాలతో వున్న స్కూలు పిల్లలూ కాలేజీ యువకులే. ఇంట్లో చదువు కని బైలుదేరి ఇక్కడ తయారవుతారన్న మాట.

ఒక్కొక్క కిటికీని జాగ్రత్తగా పరిశీలిస్తోంది కౌసల్యాదేవి. రెండుమూడు కిటికీల్లో మగాళ్ళే టిక్కెట్లిస్తూ కనిపించేరు. చివరికి హైక్లాస్ బుకింగ్ విండోలో ఎవ్వరో స్త్రీ వున్నట్టు లీలగా కనిపించింది.

పవిత్రేనా? తన పవిత్రేనా? తెలుసుకోవాలన్న

ఆత్రంతో గబగబ అటు నడిచింది.

"చూడరోయ్! కాటికి కాళ్ళు జాపుకున్న ముసల్దాని కూడా ఇంగ్లీషు సినిమా కావాలట. అందుకే మనలాంటోళ్ళకి సరిగ్గా టికెట్లు దొరికి చావడం లేదు" అన్నాడో కుర్రాడు వెనకనించి.

కౌసల్యాదేవికి వళ్ళు మండిపోయింది. తను కాటికి కాళ్ళు జాపుకున్నదా? ఈ ముదనష్టపు సినిమా చూడ్డానికొచ్చిందా. కలికాలం! ఈ హిప్పీ వెధవలకి చిన్నా పెద్దా, మంచీ మర్యాదా వుంటేగా?

ఇంతలో మరొకడరిచేడు, "ఏవమ్మా గంటనించీ ఇక్కడ చస్తున్నాం ఎండలో, ఇప్పుడే రిక్షాదిగి అమెరికా రాకెట్ లా అట్లా దూసుకుపోతే, మా గతేంగాను?"

వాడి తప్పెటకి తాళం వేస్తున్నట్టు మిగతా హిప్పీలు గొల్లుమన్నారు.

"నేను సినిమా చూడ్డానికి రాలేదు నాయనా! ఆ కిటికీలో కూర్చున్న అమ్మాయితో ఓ క్షణం మాట్లాడిపోతాను" అంది కౌసల్యాదేవి అందర్నీ సంబోధిస్తూ సాధ్యమైనంత శాంతంగా.

"అలాగా! సరే కానివ్!" అంటూ అప్పుడే టికెట్ తీసుకోబోతున్న ఓ యువకుడు పక్కకి జరిగాడు. ఆ అవకాశం జారిపోతుందో అన్నట్టు వేగంగా కిటికీని సమీపించి, లోనికి తొంగిచూసింది కౌసల్యాదేవి.

ఆ అమ్మాయి పవిత్ర కాదు!

నిరాశతో కౌసల్యాదేవి నవనాడులూ కృంగిపోయేయి.

ఆ యువతికూడా కళ్ళెత్తి ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూసింది.

"పవిత్ర ఎప్పుడు వస్తుందమ్మా ఇక్కడికి?" అడిగింది కౌసల్యాదేవి.

"పవిత్రా?"

"ఔను! ఇక్కడ వుద్యోగం చేస్తోందిటగా? ఆమె డ్యూటీ ఎప్పుడు?" సరిగ్గా ఆదేసమయంలో సినిమా ప్రారంభం కాబోతున్నట్టు మొదటి బెల్ మోగింది. హాల్లో నిల్చున్న కుర్రాళ్ళంతా గోల జెయ్యసాగారు.

"చూడండీ! నేను చాలా బిజీగా వున్నాను. మీకే వైనా వివరాలు కావలిస్తే మేనేజర్ ఆఫీసుకెళ్ళి అడ గండి!" అందా యువతి తనపనిలో నిమగ్నమౌతూ. భరించలేని నిరాశతో కాళ్ళీడ్చుకుంటూ అక్కణ్నించి కదిలింది కౌసల్యాదేవి. ఆమెని చూడగానే ఏమిటన్నట్టు కళ్ళెగరేసేడు మేనేజర్.

"నా కూతురు పవిత్ర మీ దగ్గిర బుకింగ్ క్లర్క్‌గా పనిజేస్తోందని తెలిసింది. ఆమెకోసం వచ్చేను."

అతని కనుబొమలు ముడివడ్డాయి. "పవిత్రా?" అంటూ కాసేపు ఏదో జ్ఞాపకం జేసుకోడానికి ప్రయత్నించి_"ఆ అమ్మాయి మాదగ్గిర వుద్యోగం వదిలి చాలా రోజు లయిందే?" అన్నాడు ఆశ్చర్యంగా.

"చాలా రోజులైందా?" కౌసల్యాదేవి హతాశురా లయింది.

'ఔను! ఆ అమ్మాయి దాదాపు నెలరోజులు ఇక్కడ పనిజేసి వుంటుంది.

తరువాత...త...తనే వుద్యోగం మానుకుని వెళ్ళి పోయింది" అన్నాడు మేనేజర్ తడబడుతూ.

అతని తడబాటులో ఏదో అసహజత్వం, దొంగతనం ద్యోతకమౌతోంది. కౌసల్యాదేవిలో కోటి అనుమానాలు

పడగలెత్తేయి. పవిత్ర తనకు తానే వుద్యోగం మాను కుందా? లేక ఇక్కడి పరిస్థితులు మానుకోమని వత్తిడి తెచ్చేయా? అపురూప సౌందర్యవతి ఐన తనబిడ్డని వీడేదైనా చెయ్యడానికి ప్రయత్నించలేదు కదా!

"పవిత్ర దేనికి వుద్యోగం మానుకుంది? మానుకుని ఎక్కడికెళ్ళిందో దయచేసి చెప్పగలరా?" అంది జీవం లేని స్వరంతో.

"కాలేజీ చదువులు ముగించుకున్న యువతీ యువకులు, గవర్నమెంట్ జాబ్స్ దొరికేవరకూ తాత్కాలికంగా ఇటువంటి వుద్యోగాలు చేస్తుంటారు. ఎక్కడైనా వుద్యోగం తగిలితే వీటికి తిలోదకాలిచ్చి వెళ్ళిపోతారు.

ఇక పవిత్ర ఏ వుద్యోగం సంపాదించుకుందో, ఎక్కడి కెళ్ళిందో నేను చెప్పలేను గానీ ఆమె ఇక్కడ పనిలో జేరేటప్పుడు రాయించిన చిరునామా మాత్రం ఇవ్వగలను. కూర్చోండి" అన్నాడు మేనేజర్ కుర్చీ చూపిస్తూ.

కౌసల్యాదేవి అందుకోసమే ఎదురు చూస్తున్నట్టు కుర్చీలో కూలబడింది. కడుపులో ఏమీ లేక ఎక్కువసేపు నిల్చునే స్థితిలో లేదు మరి.

మేనేజరు బల్ల సొరుగులాగి రిజిస్టర్ తీసేడు. పేజీలు తిప్పి "చెబుతాను రాసుకోండి!" అన్నాడు.

కౌసల్యాదేవి తటపటాయించి "నా దగ్గర పెన్ను లేదు" అంది.

"ఓహ్, సారీ!" పేడ్ దగ్గరికి లాక్కున్నాడు మేనేజర్, చిరునామా రాసి కాగితం చింపి ఆమె ముందుంచేడు.

దాన్ని అందుకుని ఆత్రతగా చదువుకుంది కౌసల్యాదేవి.

మిస్ లలిత,

హౌస్ నెంబర్, 3-6-532/1,

హోర్డికార్ బాగ్, హిమాయత్ నగర్.

చీకట్లో చిరు దీపంలా ఈ మాత్రం ఆధారం దొరికింది చాలు, అనుకుంటూ మేనేజర్‌కి కృతజ్ఞతలు తెల్పుకుని ఇవతలికి వచ్చింది. వడివడిగా నడుస్తూ గేటును సమీపించింది.

సరిగ్గా అదే సమయంలో అదే గేటుగుండా లోనికి తిరుగుతూ ఎదురైన యువతిని చూడగానే కౌసల్యాదేవి కాళ్ళు స్తంభించేయి.

ఆమె పార్వతి! సుభద్రమ్మ స్కూల్లో కనిపించిన పార్వతి. కౌసల్యాదేవిని చూడగానే పార్వతి గబగబ ముందుకు వచ్చి "మీకోసమే పరిగెత్తుకొస్తున్నాను. నేనొచ్చేలోగా ఇక్కడ కనిపిస్తారో లేదో అనుకుంటూ ఆందోళన పడుతున్నాను" అంది.

# 4

కౌసల్యాదేవికేమీ అర్థం కాలేదు. "నా కోసమా? ఎందుకు? సుభద్ర పంపిందా?" అడిగింది ఆశ్చర్యంగా.

"నో.నో. ఆవిడకి తెలీకుండా వచ్చేను. మీకు కొన్ని ముఖ్య విషయాలు చెప్పాలి. ఆఫీసులో ఆవిడ మధ్యా, మీ మధ్యా జరిగిన సంభాషణంతా నేను బైటవుండి విన్నాను. వాస్తవం ఏమిటో మీకు తెలీనివ్వకుండా చాలా జాగ్రత్తపడ్డారు ఆవిడ. అప్పుడే అనుకున్నాను మీకన్నీ చెప్పి తీరాలని. అందుకే మీ వెనకే బైలుదేరి వచ్చాను" అంది పార్వతి వేగంగా.

కౌసల్యాదేవికంతా అయోమయంగా వుంది. సుభద్రమ్మ వాస్తవాన్ని తనముందు కప్పిపుచ్చిందా? ఏమిటి?

"ఇప్పటికే ఊహించని విధంగా ఎదురౌతున్న సంఘటనలతో నా మస్తిష్కం ఆలోచనా రహితమైపోయింది' త్వరగా చెప్పమ్మా ఏమిటో అది?" అంది ఆరాటంగా'

"ఇక్కడకాదు. రండి ఆ హోటల్లో కూర్చుందాం!' అంది పార్వతి, రోడ్డువైపు అడుగులు వేస్తూ.

తడబడే అడుగులతో ఆమెని అనుసరించింది కౌసల్యాదేవి.

రోడ్డుదాటి ఎదురుగావున్న ఉడిపి హోటల్లో ప్రవేశించారిద్దరు. కాఫీలవీ అయ్యేక పార్వతి ప్రారంభించింది. "మీరనుకున్నట్టు పవిత్ర ప్రేమలేఖ పట్టుబడిందనీ, సుభద్రమ్మ చీవాట్లు పెట్టిందనీ కాదు ఆ ఇల్లు విడిచింది. దాని తరవాత మరొక సంఘటన చాలా గంభీరమైన సంఘటన జరిగింది. ఆ సంఘటనవల్లే పవిత్ర మనసుతిరిగి ఆ ఇల్లు విడిచి వెళ్ళిపోవలసి వచ్చింది."

"ఏమిటది?" కౌసల్యాదేవి కంఠంలో కంపన.

"ప్రేమలేఖ పట్టుబడ్డ తరవాతా, సుభద్రమ్మతో ఘర్షణపడ్డ తరవాతకూడా పవిత్ర అక్కడే మామూలుగా వుంది. ప్రశాంతంగా పదీ పదిహేను రోజులు గడిచి వుంటాయి.

ఇంతలో ఒకరోజు సుభద్రమ్మ బంధువుల అబ్బాయి ఒకతను చుట్టపు చూపుగా వాళ్ళింటికి రావడం జరిగింది. అతను పవిత్రకంటే రెండు మూడేళ్లు పెద్దనుకుంటాను. చుట్టానికి బాగానే వుండేవాడు.

పవిత్ర అపురూప సౌందర్యం అతన్ని విపరీతంగా

ఆకర్షించింది. చేసుకుంటే ఆ అమ్మాయినే చేసుకుంటానని జలగలా పట్టుకున్నాడు సుభద్రమ్మని. ఆ అమ్మాయి ఎవ్వరో ముక్కూ మొహం తెలియనివాడికి ప్రేమలేఖలు రాస్తోందనీ, అటువంటి సంబంధం మనకొద్దనీ అతనికి నచ్చ జెప్పడానికి శతవిధాలా ప్రయత్నించింది సుభద్రమ్మ.

ఐనా అతను తన పుడుం పట్టువదల్లేదు. ప్రేమలేఖల తతంగం ప్రతిటీన్ ఏజ్ యువతీ యువకుల్లో జరిగేదేనని, తెలియని వయసుగనక ఏదో రాసి వుంటుందనీ, అదేమంత పట్టించుకోతగ్గ విషయంకాదనీ, పవిత్రకి తన అభీష్టం తెల్పి ఎలాగైనా ఒప్పించమనీ పోరేడు.

చేసేదిలేక, ఒకరోజు పవిత్రని అడిగేసింది సుభద్రమ్మ.

తన మనసులో మరొకరికి స్థానం ఇచ్చేననీ, చేసుకోననీ నిర్మొహమాటంగా చెప్పేసింది పవిత్ర. ఆ జవాబువిని ఆ యువకుడు అగ్గిమీది గుగ్గిలం అయ్యేడు. అతని అహం దెబ్బతింది. ద్వేషం రగులుకుంది.

ఒకరోజు సాయంత్రం సుభద్రమ్మ పనిమీద రిక్షాలో బైటికెళ్ళిందిట. పవిత్ర తన గదిలో చదువుకుంటోందిట. ఆమెమీద పెంచుకున్న పశువాంఛ తీర్చుకోడానికి అదే అదుననుకున్నాడతను. పవిత్ర గదిలోకెళ్ళి చెయ్యి పట్టి బలాత్కారించడానికి ప్రయత్నించేడుట.

పవిత్ర చిరుతలా అతనిమీద లంఘించి, రక్కి కొరికీ ఎలాగో తప్పించుకుని బైటపడిందట. తరవాత సుభద్రమ్మ వచ్చేక జరిగిన విషయం చెప్పిందిట ఆవిడకి.

ఆ అబ్బాయి అటువంటివాడు కాదనీ, ఇదంతా వట్టి బూటకమనీ తనమీద కక్షతో ఆ కుర్రాడిమీద అభాండాలు వేసి, నలుగుర్లో తనని నవ్వులపాలుజేసి కసితీర్చుకో

డానికి అల్లిన కట్టుకథని, ఎట్టి పరిస్థితిలోనూ తను దీన్ని నమ్మననీ తేల్చి చెప్పిందిట సుభద్రమ్మ.

దాంతో, పవిత్ర భద్రకాళిలా ఆమెమీద విరుచుకు పడింది. గుండెల్లో రగిలే లావాను మాటల రూపంలో ఆవిడమీద గుమ్మరించి, ఒక్క క్షణంకూడా అక్కడుండ కుండా అప్పప్పుడే తన సామానుతో అక్కణ్నించి బైట పడింది. ఇదీ అసలు కథ! ఈ విషయాలన్నీ నాకెలా తెలిశాయంటే, మర్నాడు కాకతాళీయంగా ఆబిడ్స్‌లో కనిపించింది, పవిత్ర స్వయంగా చెప్పింది ఇవన్నీ'' అంది పార్వతి.

భగవాన్! సుభద్రమ్మ ఎంత నాటకమాడింది తనతో. తప్పంతా పవిత్రదే అయినట్టూ, తన దోషం ఏమీ లేనట్టూ ఎంత కుటిలనీతి ప్రదర్శించింది. నమ్ముకున్న వాళ్ళని ఎందుకిలా నట్టేట్లో ముంచడానికి ప్రయత్నిస్తారు మనుషులు?

అప్పుడు గుర్తుకు వచ్చాయి కౌసల్యాదేవికి, తను వస్తుం డగా సుభద్రమ్మ అన్న చివరి మాటలు. 'అదృష్టవశాత్తూ పవిత్ర కనిపించి నా మీద అవీ ఇవీ కల్పించి చెబితే నమ్మబాక!' ఎంతటి కుటిలత్వం దాగివుంది ఆ మాటల్లో.

పవిత్ర గురించి ఇన్నాళ్ళూ పట్టించుకోకుండా ఆమె మానంగా దేనికుందో యిప్పుడర్థమౌతోంది. పార్వతి పని గట్టుకుని ఇంత దూరము వచ్చి అసలు సంగతి చెప్పకుంటే తనింకా అంధకారంలోనే ఉండేది కదా?

''నీ మేలు మరచిపోలేనమ్మా పార్వతీ!'' అంది కౌసల్యా దేవి చెమ్మగిల్లిన కళ్ళతో.

''ఈ విషయాలన్నీ మీకు తెలిసినట్టు సుభద్రమ్మకు అనుమానం రానివ్వకండి. ఎందుకంటే ఆవిడ వెంటనే

గ్రహిస్తుంది మీకివ్వన్నీ ఎవరు చెప్పివుంటారో. అప్పుడు నా ఉద్యోగం కాస్త ఊడే ప్రమాదముంది. ఇక్కడ పవిత్ర గురించి ఏమైనా తెలిసిందా?" అడిగింది పార్వతి.

కౌసల్యాదేవి తలూపి, మేనేజర్ రాసిచ్చిన కాగితం తీసి చూపెట్టింది.

పార్వతి ఆ చిరునామా చూసి "భగవంతుడి దయవల్ల పవిత్ర మీకు తప్పక దొరకవచ్చు. ఇక వెళదామా?" అంది లేస్తూ.

కౌసల్యాదేవి ఎంత ప్రయత్నించినా, బిల్ యివ్వనివ్వకుండా అడ్డుపడి తనే పే చేసింది పార్వతి. తరవాత సెలవు తీసుకుని రిక్షా ఎక్కి వెళ్ళిపోయింది.

రోడ్డుపక్క ఆగివున్న ఆటోవైపు అడుగులు వేసింది కౌసల్యాదేవి.

## 5

వాళ్ళనీ వీళ్ళనీ అడుగుతూ ఎట్టకేలకి ఆ ఇంటి ముందు ఆటో దిగింది.

ఇంటి తలుపు మూసివుంది. నయం, తాళం వేసిలేదు. మీటర్ చూడకుండానే డ్రైవర్ అడిగినంత అతని చేతిలో పెట్టి గబగబ ఇంటిని సమీపించింది.

గుండెలో ఏదో అనిర్వచనీయమైన దడ! దాహంతో నాలిక పిడచగట్టుకుపోయిన బాటసారికి అమృతభాండం దొరకబోతున్న ఆనందం అది.

మెల్లెక్క తలుపు తట్టింది.

"ఎవరూ?" వినిపించింది స్త్రీ కంఠం.

కౌసల్యాదేవికి ఏమనాలో క్షణం తోచలేదు. "నేను, పవిత్ర తల్లిని!" అంది చివరికి.

తలుపు వెంటనే తెరుచుకుంది. ఆ స్త్రీకి దాదాపు కౌసల్యాదేవి వయసే వుంటుంది.

"నేను, పవిత్ర తల్లిని, కౌసల్యాదేవిని!"

"నమస్తే! రండి, లోపలకు రండి," అందామె తలుపు కడ్డం తొలుగుతూ.

కౌసల్యాదేవి లోనికి నడిచింది.

ఆమె ఓ మూలవున్న చాప చుట్టి తీసుకువచ్చి కింద పరిచి, "కూర్చోండి!" అంది.

కౌసల్యాదేవి కూర్చుంది.

ఆమెకూడా ఎదురుగా కూర్చుంటూ "పవిత్రకీ, మీకూ చాలా పోలికలున్నాయి. చూడగానే గ్రహించేను" అంది.

కౌసల్యాదేవి నవ్వి, "రక్తసంబంధం కదా?" అంది.

"ఉండండి. స్టౌమీద కాసిన్ని టీనీళ్ళు పడేసి వస్తాను" అంటూ లేవబోయిందా స్త్రీ.

"వద్దు, వద్దు యిప్పుడే తాగి వచ్చేను. ఇంతకీ పవిత్ర ఇంట్లో వుందా?"

"అయ్యో పవిత్ర యిక్కణ్ణించి వెళ్ళిపోయి చాలా కాలమయిందే! మీకు తెలియదా?" అందావిడ మధ్యలోనే.

అంతవరకూ ఆడుతున్న ఊపిరి, ఒక్కసారి స్థంభించి పోయినట్టు తోచింది కౌసల్యాదేవికి.

అతి కష్టంమీద గుండె చిక్కబట్టుకుని "చాలా కాలం క్రితమే వెళ్ళిపోయిందా? ఎక్కడికి?" అంది నూతిలోంచి పలికినట్టు.

"ఎక్కడికో నాకూ సరిగ్గా జ్ఞాపకం లేదు. ఆఁ! ఏదో

గెస్టుహౌస్‌లో వున్నట్టు విన్నాను, ఉండండి" అంటూ ఇంట్లోకి తొంగి చూసి "రమేశ్! నాయనా రమేశ్!" అని పిలిచిందామె.

లోపలినించి ఎటువంటి జవాబు రాలేదు.

ఆవిడ కౌసల్యాదేవి వైపు తిరిగి "రమేశ్ నా కొడుకు. బి. కాం. చదువుతున్నాడు. వాడొక్కడే మగ నలుసు నాకు. లోపల స్నానం జేస్తున్నాడు. ఆ గెస్టుహౌస్ పేరేమిటో బహుశా వాడికి తెలిసివుంటుంది. బహుశా ఏమిటీ తప్పకుండా తెలిసివుంటుంది!" అంది.

అతను బైటకొచ్చేవరకూ ఓపిగ్గా కూర్చొనే సహనం నాలోలేదు. ఇకతలిసించే అడగండి, ఆ గెస్టుహౌస్ ఎక్కడుందో? నేను వెంటనే అక్కడికి బైలుదేరాలి. అనాలనుకుంది కౌసల్యాదేవి. కాని, సభ్యత నోటికి తాళం వేసింది.

"పవిత్ర కేవలం మూడు వారాలు ఉండివుంటుం దిక్కడ. నా కూతురు లలితా, పవిత్రా స్నేహితురాళ్ళుట. ఒక రోజు సాయంత్రం సామానులతో హఠాత్తుగా ఇక్కడికి వచ్చింది పవిత్ర.

తనువున్న చోట ఈ రోజు పెద్ద గొడవ జరిగిందనీ, ఇంకా తను అక్కడే వుంటే ఏమైనా జరగవచ్చనీ, కొన్నాళ్ళు మా ఇంట్లో తనకి రక్షణ కల్పించమనీ కోరితే కాదనలేక పోయేము. నేను భర్తృహీనను" అందామె పైటకొంగు తలమీదికి లాక్కుంటూ.

"నేనూ విధవనేనమ్మా! నాకు తెలుసు, భర్తృహీనుల జీవితాలు ఎంత దుర్భరంగా,ఎంత నిస్సారంగా ఉంటాయో. ఆపదలోవున్న నా కూతురికి రక్షణ ఇచ్చి ఆదుకున్న మీ

హృదయ వైశాల్యత ఎంతటిదో అంచనా వేసే అవసరం లేదు'' అంది కౌసల్యాదేవి కృతజ్ఞతగా.

"పవిత్ర బాల్యంలోనే మీ శ్రీవారు పోయేరని తెలిసింది. అందుకే మాకు ఆ అమ్మాయిపట్ల ఎక్కువ సానుభూతి వుండేది. ఏదో, నేనూ ఇద్దరు పిల్లల్ని రెండు కళ్ళుగా చూసుకుంటూ బ్రతుకీడుస్తున్నాను. మాటల్లో అసలు విషయమే చెప్పడం మర్చేను.

పవిత్ర యిక్కడికి వచ్చిన ఐదవరోజే, నా కూతురు లలితకి వరంగల్‌లో ఉద్యోగం వస్తే జాయినవడానికి వెళ్ళిపోయింది ఉద్యోగంలో. ఇహ ఇంట్లో నేనూ, పవిత్రా రమేశ్ ముగ్గురమే మిగిలిపోయాం!''

"పవిత్రవల్ల మీకెలాటి ఇబ్బందీ కలకలేదు కదా?'' అడిగింది కౌసల్యాదేవి.

ఆమె నిట్టూర్చి "ఇబ్బంది కలిగింది! కాని, అది పరాకాష్టనందుకోకముందే పవిత్ర ఇక్కణ్ణించి చల్లగా జారుకుంది...అప్పుడప్పుడూ ఇంట్లో ఏమీ తోచక నేను ఇరుగు పొరుగు ఇళ్ళకి పోతుండేదాన్ని. అటువంటి సమయాల్లో పవిత్రకీ, రమేశ్‌కీ మంచి ఏకాంతం లభించేది... ఇంకా రమేశ్‌కి పెళ్ళి కాలేదు...''

కౌసల్యాదేవి గుండె గతుక్కుమంది.

"అంటే...వాళ్ళ మధ్య...''

ఆమె తల విదిలించి "కాదు. కాదు. వ్యవహారం అంతవరకూ సాగలేదులెండి. ఐనా, వాళ్ళమధ్య ఏదో ఆకర్షణ పెరుగుతున్నట్టు నాకనుమానం వేసింది. రోజురోజుకూ ఆ ఆకర్షణ ఉధృతం అవుతున్నట్టు గమనించేను.

నా అనుమానాన్ని పవిత్ర పసిగట్టివుంటుంది. అందుకే,

నేను చెప్పకముందే, తనంతట తాను ఇక్కణ్ణించి వెళ్ళి పోయింది..." ఆమె మాట ఇంకా పూర్తి కాలేదు.

ఇంతలో, లోపల బాత్ రూం తలుపు తెరుచుకున్న చప్పుడయింది.

"రమేశ్! ఇలా రా నాయనా, పవిత్ర తల్లి ఆమె కోసం వెతుక్కుంటూ వచ్చేరు. ఆ గెస్ట్ హౌస్ చిరునామా ఏమిటో కాస్త చెప్పి వెళ్ళు" అందామె లోనికి తొంగి చూస్తూ.

అతను లోపలనించి సన్నగా ఏదో గొణిగేడు.

"సిగ్గుపడుతున్నట్టున్నాడు. కూర్చోండి వెళ్ళి కనుక్కుంటాను" అంటూ లేచి లోనికి వెళ్ళిందామె.

కాసేపు తల్లీకొడుకులు గుసగుసలు వినిపించసాగేయి.

పవిత్రవంటి యువతి ఆకర్షితురాలైన ఆ యువకుడు ఎంత అందగాడో ఒక్కసారి చూడాలన్న క్యూరియాసిటీ కలిగింది కౌసల్యాదేవికి.

మరుక్షణం ఆమె కోరిక తీరనే తీరింది. ఆ యువకుడు రెప్పపాటు ఇవతలికి తొంగి చూసి చటుక్కున లోనికెళ్ళి పోయేడు.

అతన్ని చూడగానే కౌసల్యాదేవి కళ్ళు ఆశ్చర్యంతో విప్పారేయి.

కారునలుపు, మొహంమీద స్ఫోటకం మచ్చలు, లావు పాటి పెదాలు, అస్తవ్యస్తంగా పడున్న గజం పొడవు హిప్పీ జులపాలు.

అంత దుఃఖంలోనూ కౌసల్యాదేవికి నవ్వాగలేదు.

ఈ నీగ్రో వెధవ పవిత్రని ఆకర్షించేడా? అంతా అబద్ధం! ఒంటరిగా, అందంగా అందుబాటులో ఉందికదా

అని వీడే ఏవో వెర్రివేషాలు వేసివుంటాడు. పవిత్ర గూబలు వాయించి వుంటుంది.

సుభద్రమ్మలాగే, ఈమె కూడా తన కొడుకు తప్పు కప్పిపుచ్చడానికి, దోషమంతా తన కూతురి మీదికి నెడుతోంది. అదే నిజమైతే, రమేశ్ ఏ తప్పూ చెయ్యని వాడైతే, తన ఎదుట పడకుండా ఆడంగిలా దేనికి మొహం చాటు చేసుకుంటున్నాడు?

భగవాన్! మనుషుల్లో ఇంతటి గరళాన్ని ఎందుకు నింపేవు?

ఇంతలో ఆమె లోపలినించి వచ్చి, చిన్న కాగితాన్ని కౌసల్యాదేవి కందించింది. దాన్ని ఆత్రుతగా అందుకుని చూసింది కౌసల్యాదేవి.

అన్నపూర్ణా గెస్ట్‌హౌస్, సీతాఫల్ మండీ!

లేచి, ఆమెకో నమస్కారం పెట్టి ఇవతలికి వచ్చింది.

# 6

పసుపురంగు రెండంతస్తుల భవనముందు ఆగింది ఆటో. కళ్ళజోడు సరిచేసుకుంటూ తలెత్తి సైన్‌బోర్డు చూసింది కౌసల్యాదేవి.

'అన్నపూర్ణా గెస్ట్‌హౌస్'

ఆటో వాడికి మీటర్ డబ్బులిచ్చి గబగబ లోనికి నడిచింది. నడవా పక్కనే ఉన్న ఓ గది గుమ్మానికి 'ఆఫీస్' అనే బోర్డు వేళాడుతోంది. స్ప్రింగ్ డోర్స్ మూసి వున్నాయి.

"లోపలికి రావచ్చా అండీ?"

"ఎస్. కమిన్!" స్త్రీ కంఠం వినిపించింది.

స్ప్రింగ్ డోర్స్ తోసుకుంటూ లోన అడుగుపెట్టింది కౌసల్యాదేవి.

ముప్పైఐదేళ్ళుంటాయి ఆమెకి. ఎర్రగా ఆకర్షణీయంగా వుంది. నిండైన శరీరం. ఖరీదైన పట్టుచీర. అందంగా వేసుకున్న జుత్తు ముడి. ఆమె కూర్చున్న తీరులో ఏదో ఠీవి, గాంభీర్యం ఒలుకుతున్నాయి.

కౌసల్యాదేవిని ఒకసారి నఖశిఖపర్యంతం పరీక్షగా చూసి—"చెప్పండి!" అంది.

"పవిత్ర అనే అమ్మాయికోసం వచ్చేను. మీ గెస్ట్ హౌస్‌లో ఉంటోందని తెలిసింది. నేనామె తల్లిని..."

"అలాగా! అందుకే మీ ముఖం ఎక్కడో చూసినట్లనిపించింది. పవిత్ర ఇక్కడినించి వెళ్ళిపోయి చాలారోజులయిందే? మీకు తెలియదా?" అందామె ఆశ్చర్యంగా.

కౌసల్యాదేవి నవనాడులూ కృంగిపోయేయి! నిల్చోలేక స్టూలుమీద చతికిలబడింది.

"ఇంకా నయం! తనంతట తనే వెళ్ళిపోయింది. లేకుంటే నేనే నోటీస్ ఇచ్చేదాన్ని ఇక్కణ్ణించి వెళ్ళిపొమ్మని!"

"ఎందుకు? పవిత్ర ఏం తప్పుచేసింది?"

"ఈ గెస్ట్ హౌస్‌లో దూర ప్రదేశాలనించి వచ్చి, ఇక్కడ ఉద్యోగాలు చేసుకుంటున్న ఒంటరి యువతులూ, ఉద్యోగం దృష్ట్యా భర్తొకచోటా, పిల్లలొకచోటా, తనొకచోటా అవస్థలు పడుతున్న స్త్రీలూ ఉంటారు.

వంట చేసుకోలేని వాళ్ళకి ఇక్కడ మెస్ సిస్టమ్ కూడా వుంది. నెలకి ఇంత చొప్పున డబ్బు తీసుకుని వాళ్ళకి వసతీ, భోజనం ఏర్పాట్లు చేస్తాం. స్వయంపాకం చేసుకోవాలనుకున్న వాళ్ళు గదుల్లోనే స్టవ్‌లమీద ఇంత ఉడకేసుకు తినిపోతారు.

ఎనిమిది నెలల క్రితం కాబోలు, అందరిలాగే పవిత్ర

డ చేరింది. చేరడానికి ఏవేవో కారణాలు చెప్పింది కి.

ఇక్కడున్న అమ్మాయిలనీ, స్త్రీలనీ చూసిపోడానికి ర్ఘతరపు బంధువులూ, మిత్రులూ, వస్తూపోతుంటారు. దులో ఆడవాళ్ళూ, మగవాళ్ళూ కూడా వుంటారు. ళ్ళు రావడానికీ, పోవడానికీ మేమేమీ ఆంక్షలు పెట్ట ము. కారణం, ఇక్కడ చేరేవాళ్ళంతా గౌరవనీయ టుంబాలకి చెందిన వాళ్ళు కనక!

పవిత్రని కలుసుకోడానికి రోజూ ఓ యువకుడు వస్తుండే ాడు. ఇద్దరూ గంటలతరబడి గదిలో కూర్చుని మాట్లాడు నేవారు. అతనెవ్వరు? నీకేమౌతాడు? ఎందుకు వస్తాడు? లాంటివేమీ నేనడగలేదు. ఆమెనే కాదు, మేమెవ్వరిన్నీ టువంటి తేలిక ప్రశ్నలు వెయ్యం. ఎందుకంటే, ఇక్క ుండేవారిమీద మాకు పూర్తిగా విశ్వాసం వుంటుంది.

ఒక్కోసారి పవిత్ర అతని వెంట వెళ్ళి చీకటిపడ్డాక, చాలా ఆలస్యంగా తిరిగి వచ్చేది. ఐనా, మేము పట్టించుకో లేదు. కానీ, కొద్ది రోజుల తరవాత ఒకరిద్దరు స్త్రీలు పవిత్రమీద నాకు కంప్లైంట్ ఇచ్చేరు.''

''ఏమని?'' అడిగింది కౌసల్యాదేవి దడదడలాడే గుండెతో.

''ఆ యువకుడు పవిత్రకోసం రావడమే కాదు, ఒకటి రెండు సార్లు రాత్రంతా ఆమె గదిలోనే గడిపేడుట. పవిత్ర క్యారెక్టర్ మీద తమకేదో అనుమానం ఉందనీ, అటువంటి అసభ్యకర సంఘటనలు ఇక్కడ జరగడానికి వీల్లేదనీ, దీనివల్ల గెస్ట్‌హౌస్ పరువు ప్రతిష్టలు దెబ్బతింటా యనీ ఆ కంప్లైంట్‌లోని సారాంశం!

దాంతో నేను పవిత్రని పిలిచి అడిగేను ఇది నిజమేనా అని. నిజమేననీ, తామిద్దరూ ప్రేమించుకున్నారనీ, త్వరలో పెళ్ళిజేసుకోబోతున్నారనీ, తానిక్కడుండటం మా కిష్టం లేకుంటే తక్షణం వెళ్ళిపోతాననీ నిర్మొహమాటంగా చెప్పి, అప్పటికప్పుడు మాకు రావలసిన డబ్బు బల్లమీద పడేసి, గది ఖాళీజేసి వెళ్ళిపోయింది..."

ప్రేమ మధురమైనదీ, తేనెకన్నా తియ్యనిదీ అంటారు. యవ్వనంలో తను ప్రేమ అటలంటే చాలా భయపడేది. ఏ ప్రేమలో హత్యలూ, ఖూనీలూ జరుగుతాయో, ఏ ప్రేమలో అపహరణలూ, మానభంగాలూ జరుగుతాయో, అందమైన మొహాలపై ఏసిడ్ చల్లి బ్రతుకంతా దుర్భరం జెయ్యబడుతుందో అటువంటి ప్రేమ మధురమైనదీ, తియ్యనిదీ ఎలా అవుతుంది?

ఆమె తిరిగి చెప్పసాగింది. "పవిత్ర జవాబు విని నాకు వళ్ళు మండిపోయిందంటే నమ్మండి. ఈనాటి యువతీ యువకులకి ఇదో జబ్బు. సరైన నిర్వచనం తెలియకపోయినా, 'ప్రేమ' అనే పదాన్ని అడ్డుపెట్టుకుని విచ్చలవిడిగా ప్రవర్తిస్తారు. ఇదేమిటని ఎవ్వరైనా నిలదీసి అడిగితే, ఏముంది_ ప్రేమించుకున్నాం, పెళ్ళిజేసుకోబోతున్నాం అని నోరు నొక్కేస్తారు. పెళ్ళే జేసుకోబోతున్నవారు ఆ తంతు జరక్కముందే ఈ విపరీత చేష్టలేమిటి?

ప్రేమా, ప్రేమా అని దేవిర్లాడుతూ, ఆ యువకుణ్ణి గుడ్డిగా నమ్ముకున్న మీ కూతురు ఇప్పుడెక్కడుందో తెలుసా?"

"ఎక్కడుంది?"

"జైల్లో!!"

అకస్మాత్తుగా ఆ భవనం కూలిపోతున్నట్టూ, ఆ శిథిలాల్లో తను కూరుకుపోతున్నట్టూ భ్రాంతి కలిగింది కౌసల్యాదేవికి భూమీ, ఆకాశమూ తలకిందులౌతున్నట్టు తోచింది క్షణం పాటు.

ఇవేమీ పట్టనట్టు ఆమె తన ధోరణిలో చెప్పుకు పోతోంది...''ఒకసారి సెషన్స్ కోర్టులో మావాళ్ళ తాలూకు కేసొకటి నడుస్తోంటే చూద్దామని వెళ్ళాను. అక్కడ కనిపించింది పవిత్ర, పోలీస్ కస్టడీలో! మామూలు పవిత్ర కాదు, ఏడు నెలల గర్భిణి!

అదే రోజు, పోలీసులు ఆమెని కోర్టులో హాజరు పరుస్తున్నారుట. అప్పుడు తెలిసింది అసలు కథ!

ఆ నీచుడు పవిత్రని నమ్మించి మోసం చేసేడు. అన్నీ దోచుకుని చివరికి ద్రోహం జేసేడు. ఫలితంగా పవిత్ర నెల తప్పింది. త్వరగా పెళ్ళిజేసుకుందామని అతని కాళ్ళ వేళ్ళా పడిందట. ఇప్పుడూ, అప్పుడూ అని దాటవేస్తూ కొన్నాళ్ళు ఆమెని తనదగ్గిరే వుంచుకున్నాడుట.

ఒక రోజు అతను ఇంట్లో లేని సమయంలో, అతని పేర వచ్చిన ఉత్తరాన్ని పవిత్ర చూడటం తటస్థించింది. అప్పుడు బైటపడింది అతని అసలు రంగు! బాల్యంలోనే ఆ యువకుడికి వివాహం జరిగిపోయిందిట.

ఊరికి వచ్చి, పిల్లని కాపరానికి తీసికెళ్ళమని అతని మేనమామ రాసిన ఉత్తరం అది. వాళ్ళు బాగా ఆస్తిపరులట. ఒక్కతే కూతురు. ఆ ఒక్క కూతుర్ని ఈ మహానుభావుడికిచ్చి చేసేరుట.

కన్నూ మిన్నూ గానక, ఆ నీచుణ్ణి గుడ్డిగా ఆరాధిస్తూ తను ఎంత మోసపోయిందో అప్పుడు తెలిసివచ్చింది

పవిత్రకి. పెళ్ళిచేసుకోమంటే ఇన్నాళ్ళూ అతను ఎందుకు దాటవేస్తున్నాడో అర్థమయింది.

ఇంటికి రాగానే నిలదీసి అడిగిందిట అతన్ని. మొదట తెల్లబోయినా తరవాత అన్నీ ఒప్పుకున్నాడుట. ఇప్పుడు తన గతేమిటని అడిగితే ఏముందీ - రహస్యంగా ఎబార్షన్ చేయించుకుని ఏమీ జరగనట్టు జీవి స్తేసరి అన్నాడట!

ఆడది మనసి స్త్రీహృదయాన్ని చిలికి అమృతాన్ని అందిస్తుంది. అదే అమృత హృదయంలో ద్వేషాగ్ని గనక రగిలిందంటే, మగవాడిపట్ల అది కాలకూట విషమే అవుతుంది.

సరిగ్గా అదే జరిగింది. ఆ రాత్రి ఇద్దరిమధ్యా పెద్ద ఘర్షణ జరిగింది. అతను ఉద్రేకంలో ఆమెమీద చెయ్యికూడా చేసుకుని, ఇంట్లోంచి బైటకిగెంటడానికి ప్రయత్నించేడుట. పరిసితి పరాకాష్టనందుకునే సరికి, పవిత్ర ఆ అవమానం భరించలేక ఒళ్ళు తెలీని ఉద్రేకంలో చేతికందిన ఇనపవస్తువుతో అతని తల పగలగొట్టిందిట.

ఇరుగూ పొరుగూ మూగేరు. అతన్ని హాస్పిటల్ చేర్చేరు. దెబ్బ తగలనిచోట తగిలి వుంటుంది. తెల్లవారేలోగా అంతిమ శ్వాస వదిలేడు. పోలీసులు పవిత్రని అరెస్టు చేసి కేసుపెట్టేరు. కేసు చాలా రోజులు నడిచింది''

ఆమె ఇంకా ఏమంటోందో కౌసల్యాదేవికి వినిపించడంలేదు.

కళ్ళల్లో చీకట్లు కమ్ముకొస్తాగేయి. తల గిరగిర తిరగసాగింది. చూస్తూ చూస్తూనే తల పక్కకి వాల్చి స్పృహ తప్పింది. ఆవిడ ఖంగారుగా లేచి ఆమెదగ్గరికి పరిగెత్తింది.

## 7

తిరిగి కళ్ళు తెరిచిన కౌసల్యాదేవి, తను మంచంమీద పడున్నట్టు గ్రహించింది. మంచం చుట్టూ అక్కడి ఆడ

వాళ్ళు నిల్చుని చూస్తున్నారు.

ఇప్పుడు కౌసల్యాదేవి గుండెమీద ఏదో రాయి పెట్టి నట్టు ఉంది. ఏమీ జరగనట్టేలేచి కూర్చోబోయింది.

"లేవకండి. కాసేపు అలాగే పడుకుని విశ్రాంతి తీసుకోండి." అంది ఆమె వారిస్తూ.

"ఇప్పుడు నాకేం ఫరవాలేదు. బాగానే వున్నాను. ఇంతకీ, ఇప్పుడు పవిత్ర ఎక్కడుంది?" అడిగింది లేచి కూర్చుంటూ.

"చెబుతాను. మీరు పూర్తిగా ఎక్సైట్ మెంట్ కి గురి అవుతున్నారు. తట్టుకోవాలి. ఇది జీవితం. అనుకోనివెన్నో జరుగుతూ పోతుంటాయి" అంటూ అక్కడ నిల్చున్న వాళ్ళను వెళ్ళిపొమ్మన్నట్టు సైగజేసి నెమ్మదిగా చెప్ప సాగింది ఆమె.

"నాకు బాగా తెలిసిన అమ్మాయి గనుక, ఆ కేసు ఎలా ముగుస్తుందో కనుక్కోవాలన్న జిజ్ఞాస ఉండేది నాకు. ఓ లాయర్ ద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకునే దాన్ని... కేసు ఇంకా ముగియకముందే, జడ్జి తీర్పు చెప్పక ముందే, జైలు ఆస్పత్రిలో పవిత్ర ప్రసవించిందిట..."

"పిల్లా? పిల్లాడా?"

"ఆడపిల్ల!"

"పవిత్ర ఎలా వుంది?"

"నెలలు నిండిన కాన్పు! చాలా కష్టంగా వచ్చిందిట. ఫోర్సెప్స్ వేసి పిల్లని బైటికి తీసేరుట...క్షమించండి... పవిత్ర ప్రసవంలో పోయింది..."

ఎంత ఆపుకుందామన్నా కౌసల్యాదేవికి దుఃఖం ఆగ లేదు. పసిపిల్లలా వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆమె ఓదారు

స్తున్నకొద్దీ ఆ దుఃఖం ఆగకపోగా, ఇంకా ఎక్కువయింది.

ఒక్కగానొక్క కూతురు. ఎన్ని ఆశలు పెట్టుకుంది దానిమీద. ఎన్ని కలలుగంది. అయ్యో తల్లీ, పాపిష్టి ప్రేమలో పడి దిక్కూ మొక్కూ లేక ఆరిపోయేవా? అంటూ ఆక్రోషించింది ఆ వృద్ధ హృదయం.

"మీరు వచ్చి, పవిత్రగురించి అడిగేసరికి, ఇవన్నీ చెప్పాలా వద్దా అని ముందు సందేహించేను. ఎలాగూ చెప్పక తప్పదు కదా అని చెప్పేసేను. పవిత్రేకాదు, పెద్దల కట్టుబాట్లనీ, నిర్ణయాలనీ ధిక్కరించి, గుడ్డిప్రేమలో పడి ఎంతోమంది యువతులు బంగారంలాటి జీవితాలని నేలపాలు చేసుకుంటున్నారు. అలాగని, ప్రేమ వివాహాలకి నేను వ్యతిరేకిని కాను..."

ఏడ్చి ఏడ్చి కాసేపటికి తెప్పరిల్లింది కౌసల్యాదేవి. పైటతో కళ్ళు తుడుచుకుని "పవిత్ర కన్న పాప ఇప్పు డెక్కడుంది?" అడిగింది.

"కేవలం వారం రోజుల క్రితం మాట ఇది...ఆ పాప జైలు ఆస్పత్రిలో, అధికార్ల ఆధీనంలో వుందో, మరెక్క డుందో చెప్పలేను. ఆడవాళ్ళ జైలుకెళ్ళి కనుక్కుంటే ఏమైనా తెలియవచ్చు!"

"నా బిడ్డ ఈ లోకంనించి నిష్క్రమించిందన్న సత్యాన్ని వినకముందే నా ప్రాణం పోవలసింది. భగవం తుడు ఆ దిక్కులేని పసికందును చూసుకోమని కాబోలు ఇంకా నాలో ఊపిరి ఆడిస్తున్నాడు. నన్నక్కడికి తీసికెళ్ళి అధికార్లతో మాట్లాడేందుకు సహాయపడతావా అమ్మా?" అంది కౌసల్యాదేవి దీనంగా.

ఆమె తలూపి "తప్పకుండా!" అంది ధైర్యం చెబుతో.

టాక్సీలో జైలుదేరేరు ఇద్దరూ.

ఆ బిడ్డని ఎవ్వరికి అప్పగిద్దామా వదుల్చుకుందామా అని ఆలోచిస్తున్న జైలు అధికార్లకి, వాళ్ళంతట వాళ్ళే వెదుక్కుంటూ రావడంతో పెద్ద భారం దిగిపోయినట్లు తోచింది. పవిత్ర చివరివరకూ తన వ్యక్తిగత వివరాలు చెప్పడానికి నిరాకరించిందిట.

జైలర్ వాళ్ళని వెంటబెట్టుకుని, జైలు ఆస్పత్రికి తీసికెళ్ళి లేడీ డాక్టర్‌కి పరిచయం చేసేడు.

నర్సు వాళ్ళని వార్డులో ఓమూల ఉన్న ఉయ్యాల దగ్గరికి తీసికెళ్ళి చూపించింది.

పిడికిళ్ళుమూసి, నిశ్చింతగా నిద్రిస్తోంది పసిబిడ్డ.

కౌసల్యాదేవి చేతులు ఆగలేదు. అప్రయత్నంగా పసిదాన్ని ఎత్తుకున్నాయి.

అంతా పవిత్ర పోలికే!

లిప్తపాటు కౌసల్యాదేవి కళ్ళల్లో ఒకనాటి తన ప్రసవ ఘడియలూ, ఆ ప్రసవంలో పుట్టిన పవిత్రా కదలాడేయి. కాళ్ళూ చేతులూ తన్నుకుంటూ పైటచాటున పాలిండ్ల కోసం అన్వేషిస్తూ ఎంత మారాంచేసేది చిట్టితల్లి. ఆ పవిత్ర ప్రతిరూపమేనా ఇది? ఏమిటీ మాయాజాలం?

రాతలూ కోతలా సంతకాలూ అవీ అయ్యేక పాపను కౌసల్యాదేవి కప్పగించేరు అధికార్లు. చల్లగాలి తగలకుండా పాప ఒంటినిండా బట్టకప్పుతూ హాస్పిటల్లోంచి బైటికి వచ్చింది.

అప్పుడే, ఆ పసిది కళ్ళు తెరిచి, కాళ్ళూ చేతులూ తన్నుకుంటూ రెప్పవెయ్యకుండా ఆమెవైపు చూడసాగింది.

సజల నయనాలతో మెట్లు దిగసాగింది కౌసల్యాదేవి.

—: ఐ పో యిం ది :—

# యమకూపం?

శశిభూషణ్

చీకటి పడింది.

ఆదెమ్మ ఇంట్లో కోలాహలం పెరుగుతూంది క్షణ క్షణానికీ. క్రింద భాగంలోని గదుల్లో గాజులు గలగలలు, పకపకలు ఆగిఆగి విన్పిస్తున్నాయి. ఆదెమ్మ హడావుడిగా తిరుగుతోంది.

వీధిలో ఊరకుక్క అటూయిటూ పరుగులు తీస్తూ కర్ణకఠోరంగా మొరుగుతూంది.

చీకట్లు బాగా ముసురుకున్నాయి.

ఆదెమ్మ ఇంటిముందు ఓ సైకిల్ రిక్షా ఆగింది. దానిలోంచి లాల్చీ, పైజామా ధరించిన యువకుడు క్రిందకు దిగాడు. అతని చేతివ్రేళ్ళ మధ్య చార్మినార్ సిగరెట్ పొగలు

గవ్వుతోంది. మీసాలు, గడ్డం లేవు. సున్నగా గీసు కున్నాడు. జుట్టు భుజాలమీద పడుతోంది. భారీ విగ్రహం చూడటానికి కళాకారునిలా కన్పిస్తున్నాడు.

ఊరుపక్క మొరుగుతూ రిక్షావైపు వచ్చింది. రిక్షాకి కాస్త దూరంగా నిల్చుని, కాసేపు మొరిగి, వెనుదిరిగింది. క్షణాలమీద దాని ఆకారం చీకట్లో అదృశ్యమైంది.

ఆ వీధి పేరు గాలి గోపురం వీధి. కాని, వీధిలో ఎక్కడా గుడిగాని, గోపురంకాని కన్పించవు. ఆ పేరు ఎప్పుడు ఎలా వచ్చిందో ఆ ఊర్లో ఎవ్వరికీ తెలియదు.

రిక్షానుండి దిగిన కళాకారుడు రిక్షావాలాకి చిల్లర యిచ్చి, ఆదెమ్మ ఇంట్లోకి ప్రవేశించాడు బిడియపడ కుండా.

ఆదెమ్మ ఇంటికొచ్చే మగవాళ్ళందరూ అంతే! ఏమాత్రం బెదురులేకుండా అత్తవారింట్లోకి వెళ్తున్నట్టే వెళ్తారు.

"రండి బాబూ...రండి...క్రొత్త ముఖంలా వుందే? మందేవూరు బాబూ? ఇటువైపు ఎప్పుడైనా వచ్చారా?" కళాకారుణ్ణి వాల్లోనే కల్సుకుని, స్వాగతం పలికి, మంచి చెడ్డలు విచారించటం ప్రారంభించింది ఆదెమ్మ.

అతను చిన్నగా నవ్వాడు. సిగరెట్ క్రిందపడేసి కాలితో తొక్కి ఆర్పేశాడు. "నాది ఈ ఊరు కాదండి. ఈ జిల్లాకూడా కాదు. కోర్టుపనిమీద వచ్చాను. ఆ పని అయిపోయింది. రేపు ఊరెళ్ళాలి! అందుకని..." మళ్ళీ నవ్వాడు.

ఆదెమ్మకూడా అతని నవ్వులో పాలుపంచుకుంది. "సంతోషం నాయనా! రాత్రంతా ఇక్కడ వుంటావా?"

"ఇక్కడ నాకిష్టం లేదండీ! ట్రావెలర్స్ బంగ్లాలో గది తీసుకున్నాను..."

అతని మాటలు పూర్తి కాకమునుపే సర్వం తెలిసిన యోగినిలా గంభీరంగా తల పంకించింది ఆదెమ్మ. "అగదిలో కెళ్ళి కూర్చో బాబూ!" చేత్తో ఓ గదివైపు చూపించింది.

కళాకారుడు ఆదెమ్మ చూపించిన గదిలోకి నడిచాడు. పట్టెమంచం పరమఛండాలంగా వుంది. అయినా అతను అసహ్యించుకోలేదు. ఆ మంచంమీదే కూర్చున్నాడు.

కళాకారుడు చాలా విషయాలకు అతీతుడు.

గుమ్మంలో అడుగుల చప్పుడైంది. చవకరకం సెంటు వాసన, గాజులు గలగలలు ... అతను గుమ్మంవైపు చూశాడు.

ఆదెమ్మ లోనికొచ్చింది.

'డర్టీబిచ్...దీనికి కూడా సెంటు కావల్సివచ్చింది' అతను గొణుక్కున్నాడు.

అరగంటకోసారి సెంటు రాసుకుంటుంది ఆదెమ్మ. లేకుంటే ఆమె మనసు మనసులో వుండదు.

కళాకారుడు బలవంతంగా నవ్వి ఆదెమ్మ ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు.

"మరేం లేదు బాబూ...తమకు తెలియంది ఏముంది? వస్తువుల రేట్లన్నీ పెరిగిపోయాయి. జాకెట్ ముక్క కావాలన్నా పది రూపాయలు పొయ్యాల్సి వస్తోంది... అందుకని..."

"మీరూ రేట్లు పెంచారా?"

"అంతే బాబూ!" అనవసరంగా నవ్వింది ఆదెమ్మ.

విసుక్కున్నాడు కళాకారుడు. "నైట్ బుక్కింగ్ కి ఎంత ఇవ్వాలో చెప్పు."

"తమకు తెలియనిది ఏముంది బాబూ! అరవై రూపాయలు..."

వందరూపాయల నోటు ఆదెమ్మ కిచ్చాడతను. "రసగుల్లాలా వుండాలి!"

"నావద్ద రసగుల్లాలు లేవు బాబూ! అన్నీ లడ్డూలే!" నవ్వుతూ నోటును బాడీలో దోపుకుంది ఆదెమ్మ. "తమ పేరేమిటి బాబూ?"

"రామ్మూర్తి."

గదిలోంచి వెళ్ళిపోయింది ఆదెమ్మ.

## 2

గాలిగోపురం వీధిలోకి ఆదెమ్మ ఇంట్లోనే ఓ గది అది.

గది గోడలు అనేక రకాల రంగుల మరకలతో కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నాయ్. నేలమీద కార్పెట్ లేదు. అంగుళం మందంతో దుమ్ము పేరుకుపోయి, కార్పెట్ అవసరం లేకుండా చేస్తోంది. మూడుకాళ్ళ టేబిల్ ఒక మూలగావుంది. దానిముందు విరిగిపోవటానికి తయారుగా వున్న కుర్చీ.

ఒక ప్రక్కగా కృతయుగానికి చెందిన పట్టె మంచం వుంది. ఆ మంచంమీద త్రేతాయుగానికి సంబంధించిన పరుపు, దానిమీద ద్వాపరయుగానికి చెందిన తలగడ వున్నాయ్.

మంచంమీద కలియుగానికి చెందిన సీత బాధ పడుతోంది. ఆమెను బాధపెడుతున్న వ్యక్తికూడా కలియుగానికి సంబంధించినవాడే. ఆదెమ్మ తమ్ముడు. పేరు ధనపతి.

భర్తలేని ఆదెమ్మ నిండు ముత్తయిదువులా జీవిస్తోంది.

ఆ ఇంటికి సర్వాధికారిణి ఆమే! బయటి వ్యవహారాలు ఆమె తమ్ముడు ధనపతి చూస్తుంటాడు.

ధనపతి బ్రాంది తాగివున్నాడని తెలిస్తే...అటువంటి సమయాల్లో తమ్ముణ్ని ఎక్కువగా మాట్లాడించదు ఆదెమ్మ.

గంటక్రితం ఓ ఇంగ్లీష్ చిత్రం చూసి ఇంటికొచ్చాడు ధనపతి. మేట్నీ చూస్తున్నప్పుడే అనుకున్నాడతను... ఇంటికి వెళ్ళిన వెంటనే సీతని బాధపెట్టి, తను సుఖపడాలని.

మేట్నీనుంచి వస్తూ దారిలో XXX రమ్ ఒక బాటిల్ పుచ్చుకున్నాడు. అక్కడే ఇంకో రెండు పెగ్గులు బ్రాంది పోసుకున్నాడు గొంతులో. ఇంటికొచ్చి, కడుపులోని ఖాళీని కాపుసారాతో నింపుకుని, సీత గదిలోకి ప్రవేశించాడు.

ధనపతిని చూసిన ప్రతిసారీ పెద్దపులిని చూసినట్టుగా వణికిపోతుంటుంది సీత. అతనంటే ఎంత భయమో అంతే అసహ్యంకూడా వుందామెకు. అయినా; ఏనాడూ అతన్ని తిరస్కరించలేదు. తిరస్కరిస్తే బెల్టు దెబ్బలతో వీపు అట్టలు లేచిపోతుంది.

ఒకటి రెండుసార్లు బెల్టు దెబ్బలు తినివున్నది సీత—ధనపతిని తిరస్కరించి. చాలా తొందరగా ఆమెకు బెల్టు దెబ్బలు తినటంకంటే ధనపతిని భరించటమే సులభమని అరమైంది.

"సీతా! నా దృష్టిలో నువ్వు మాత్రమే ఆడదానివి" గదిలోంచి వెళ్ళడానికి సిద్ధమవుతున్నాడు ధనపతి. అతని ముఖంలోంచి అలసట, తృప్తి కల్సిపోయి బయటికి తొంగి చూస్తున్నాయ్.

"సీతా!" తిరిగి పిలిచాడు సిగరెట్ వెలిగించుకుని.

"ఊఁ!" నీరసంగా మూలిగింది సీత. మంచంమీద వెల్లకిలా పడివుందామె. ఒంటిమీద దుస్తులు లేవు. కురులు ముఖంమీద కదులుతున్నాయ్. బొట్టు చెమటతో కల్సి ముక్కుమీదకు కారుతోంది. బుగ్గలనిండా గాట్లు! పెదవులు నెమ్మదిగా ఒణుకుతున్నాయ్.

సీత అవతారాన్ని చూసిన ధనపతి తృప్తిగా నవ్వుకున్నాడు. "డార్లింగ్! రెస్ట్ తీసుకో!"

ముఖంమీద కదులుతున్న వెంట్రుకల్ని చేత్తో వెనక్కినెట్టుకుంది సీత. ధనపతి గుమ్మం దాటేవరకు వూరుకుని, ఆటు తర్వాత నేలమీద వుమ్మేసింది. లేచికూర్చునే ఓపిక లేనట్టు ప్రక్కకు ఒత్తిగిలి పడుకుంటూ కళ్ళు మూసుకుంది.

బిగ్గరగా ఏడవాలనిపిస్తోందామెకు. అయినా ఏడవలేదు. అప్పటికే చాలాసార్లు ఏడ్చివున్నది. ఆఖరు కన్నీరు బొట్టును కూడా రాల్చేసిందెప్పుడో. ఇహమీదట ఏడిస్తే కళ్ళలోంచి వేడినీళ్లు కాకుండా నెత్తురు కారుతుందేమోనని ఆమె భయం!

"సీతా...ఏయ్ సీతా... చచ్చావా? బ్రతికే వున్నావా?" అరుస్తూ లోనికొచ్చింది ఆదెమ్మ.

లేనిశక్తి తెచ్చుకుని మంచందిగి నిల్చుంది సీత.

"ఏమిటే ఈ అవతారం?" ఆశ్చర్యం ప్రదర్శించింది ఆదెమ్మ.

"మీ తమ్ముడు..." నీళ్ళు నమిలింది సీత.

"సర్లే! వెళ్ళి త్వరగా స్నానం చేసి తగలడు. మంచి బేరం వచ్చింది. చప్పున వెళ్ళిరా!"

నిట్టూర్చి గదిలోంచి వెలుపలికొచ్చి, బాత్రూంవైపు

వెళ్ళింది సీత—తన్ను ఆడదానిగా పుట్టించిన భగవంతుణ్ణి కసిదీరా తిట్టుకుంటూ.

## 3

కిటికీవద్ద నిల్చుని చీకట్లోకి చూస్తోంది సీత. ట్రావెలర్స్ బంగ్లా చుట్టూ కాటుకలాంటి చీకటి పేరుకొనుంది. దూరంగా స్మశానం!

సీత ట్రావెలర్స్ బంగ్లాలోకి అడుగు పెట్టడం ఇది మొదటిసారి కాదు. ఆ బంగ్లాలో ఎన్ని గదులున్నాయో ఆమెకు బాగా తెలుసు. బంగ్లాకు దూరంగా స్మశానం వుందని కూడా తెల్సు ఆమెకు. కొన్నేళ్ళుగా భయంకర మైన ఊబిలో కూరుకుపోయి జీవచ్ఛవంలా బ్రతుకుతోం దామె. ఆమెకు తెలియనిది ఒక్కటే.

ఈ ఊబిలోంచి ఎలా బయట పడటం?

ఆ ప్రశ్న కొన్నేళ్ళుగా బాధిస్తోంది సీతని. సమాధానం చిక్కని ప్రశ్న...భయంకరమైన ప్రశ్న.

ఆదెమ్మ ఇంట్లోంచి పారిపోవటానికి సీతకి ఇంతవరకు అవకాశం రాలేదు. అవకాశం వచ్చినప్పుడు పారిపోవాలని ప్రయత్నించలేదు సీత. ఆమె తెల్చుకుంటే ఆదెమ్మ ఇంటిని ఆదెమ్మను వదిలి పారిపోవటం పెద్ద సమస్యకాదు. ఎక్కడికి పారిపోవాలి? పారిపోయి ఏం చేయాలి? తిరిగి యిదే బ్రతుకు మరొకచోట బ్రతకటం కంటే ఆదెమ్మ కొంప లోనే పడివుండటం నయం కాదా?

అన్నీ సమస్యలే సీతకు. మనుషుల మీద ఆమెకు నమ్మకంపోయి చాలా రోజులైంది. ఇప్పుడిప్పుడే దేవుడి మీదకూడా నమ్మకం పోతోందామెకు.

"సీతా!"

యంత్రంలా వెనుదిరిగింది సీత.

ఎదురుగా మంచంమీద రామ్మూర్తి కూర్చునున్నాడు. హోటల్ నుంచి వాచ్‌మన్ తీసుకొచ్చిన కారియర్ ఒక ప్రక్కగా నున్న బల్లమీదుంది.

"ఆకలి వెయ్యటం లేదా?" రామ్మూర్తి అడిగాడు.

"మీరు భోంచెయ్యండి."

"నీ సంగతి?"

"వద్దు."

"సీతా! నా పేరు రామ్మూర్తి" అన్నాడతను సిగరెట్ తీసి వెలిగించుకుంటూ.

సీత పేలవంగా నవ్వి, మంచంమీద అతని ప్రక్కనే కూర్చుంది.

"మీ పేరు నేనడగలేదు. రేపు నే నెవరైనదీ మీకు గుర్తుండదు. మీరూ నాకంతే! ఉదయం ఐదింటివరకు మనం దంపతులం ... ఆత్మీయులం ... స్నేహితులం..." మళ్ళీ నవ్విందామె. "మొదట భోంచెయ్యండి మీరు."

"నిన్ను వదలి నేనెలా భోంచెయ్యగలను సీతా?"

వినకూడని మాటలు విన్నట్టు ముఖం చిట్లించింది సీత.

రామ్మూర్తి తుదకు సీత చేతినైనా ముట్టుకోలేదు. "సీతా! నువ్వు అడగక పోయినా నా వివరాలు నీకు చెప్పటం నా విధి. నా పేరు నీకు యిదివరకే చెప్పాను. ఇహ పోతే నా వృత్తి. క్రైం రచయితను. పెద్దలు వదిలి వెళ్ళిన ఆస్తి బోలెడు వుండటంతో; సంపాదించాల్సిన అవసరం లేకపోవటంతో కాలం గడపటానికి రచనలు చేస్తున్నాను. ఆ విధంగా కూడా కొంత డబ్బు చేరుతూనే వుంది. నా స్నేహితులందరూ నన్ను 'విచిత్రమైన వ్యక్తి' అంటుంటారు.

అది పూర్తిగా అబద్ధం కాదేమో!

నా చేష్టలు ఒక్కోసారి నాకే విచిత్రంగా తోస్తాయి. సమాజంలోని కుళ్ళునంతా ఒక్కసారిగా కడిగెయ్యా లన్నంత ఆవేశం నాలోవుంది. కాని, అది ఒక్కడివల్ల అయ్యే పనికాదు.

సీతా! నీవలన నాకెటువంటి అనుభవమూ అవసరంలేదు. నీకిష్టమైతే నేనడిగే కొన్ని ప్రశ్నలకు సమాధానాలివ్వు చాలు...'' క్రొత్త సిగరెట్ వెలిగించుకున్నాడు రామ్మూర్తి.

వింతవ్యక్తి తనకు జీవితంలో మొట్టమొదటిసారిగా తారసిల్లాడని అర్థమౌతోంది సీతకు.

''ఏం సీతా? నా ప్రశ్నలకు బదులిస్తావా?''

రామ్మూర్తి కంఠం తిరిగి విన్పించేసరికి ఈ లోకంలోకి వచ్చింది సీత.

''అడగండి'' అంది — ఇంకేమనాలో తెలియక.

''నీకు ఈ జీవితం బావుందా?''

''విషం తాగిన మనిషిని 'బాగుందా?' అని ప్రశ్నిస్తే ఏం సమాధానం చెప్పగలడు?''

''నా ప్రశ్నకు నీ ప్రశ్నే సమాధానమా?''

అవునన్నట్లు తలూపిందామె.

''నువ్వు ఈ ఊబిలో ఎలా ఇరుక్కున్నావ్? అభ్యంతరం లేకపోతే నీ కథ క్లుప్తంగా విన్పించు సీతా!''

రామ్మూర్తిని చూడటం అదే మొదటిసారి అయినా; అతని రచనలు బోలెడు చదివివున్నది సీత. ప్రముఖ కెం నవలా రచయితగా రామ్మూర్తికి ఆంధ్రదేశమంతటా మంచి పేరుంది.

కథా వస్తువును ఎన్నుకోవడం దగ్గర్నుంచి నవల ముగింపు వరకు తన ప్రత్యేకతను ప్రదర్శిస్తుంటాడు రామ్మూర్తి. కల్పితాలు అతను వ్రాసింది బహు తక్కువ. యధార్థ గాథల్ని ఎక్కువగా నవలలుగా మలుస్తుంటాడు. అతను మంచి రచయితగా పదిమంది చేత గుర్తింపబడటానికి ఇదికూడా ఒక కారణం అయివుండాలి!

"మూర్తిగారూ! మీరచనలు చాలా చదివాను నేను" మంచం మీద మరికాస్త జరిగి కూర్చుంది సీత. "మీతో పరిచయం ఈ విధంగా కలుగుతుందని నేనెప్పుడూ వూహించనైనా లేదు..." మాటలు ఆపేసి తల దించుకుందామె.

"నా కథ మీరు వినలేరు మూర్తిగారూ! నా కథే కాదు...నావంటి వారందరి కథలూ ఒకే విధంగా వుంటాయి. ఇంకా చెప్పాలంటే ఆడవాళ్ళ కథలన్నీ ఒకేవిధంగా వుంటాయి."

"అంటే?" రామ్మూర్తి నొసలు ముడతలు పడింది.

తలెత్తింది సీత. "ఏముందీ? మనుషుల్ని దేవుడు ఆడిస్తుంటే ఆడవాళ్ళని మగవాళ్ళు ఆడిస్తూ ఆనందిస్తున్నారు. అంతే! ఈ విషయంలో స్త్రీలందరూ ఇంచుమించు ఒకే విధమైన బాధని ఎదుర్కొంటున్నారు."

"ఈ భూమ్మీద సుఖంగా వున్న ఆడవాళ్ళే లేరనా నీ వుద్దేశ్యం?"

"ఎంతమంది ఆడవాళ్ళు సుఖంగా వున్నారో చెప్పలేను గాని, సుఖంగా వున్నట్టు నటించే స్త్రీల గురించి మాత్రం చెప్పగలను. అలాంటివాళ్లు మనకు ఎక్కడ చూసినా కన్పిస్తారు."

"నీ మాటల్లో పూర్తిగా కాకపోయినా ఎంతోకొంత నిజం లేకపోలేదు" సిగరెట్ బట్ ని గది మూలకు విసిరాడు రామ్మూర్తి. "నీ కథ వినటానికి ఇష్టపడుతున్నాను. సీతా!"

నిర్లక్ష్యంగా నవ్విందామె.

"మామూలే! ప్రేమించిన వాడి మాటలు నమ్మి, కన్న తల్లిదండ్రుల్ని వదిలి గడప దాటాను. అతని మోజు తీర్చుకున్నాడు. అలాంటి వాళ్ళందరూ చెప్పకుండా పారిపోయే విధంగా కాకుండా ఇతను ఆఖరున నా కొక ఉపకారం చేసి వెళ్ళాడు. ఎన్నటికీ మరువలేని మహోపకారం... మోజు తీర్చుకుని తనదారిన తాను వెళ్ళలేక; నన్నొక వేశ్యా గృహంలో అమ్మేసి వెళ్ళిపోయాడు... వెయ్యి రూపాయలకు. అప్పటినుంచీ మార్పులేని యాంత్రిక జీవితం జీవిస్తున్నాను."

"ఈ దేశంలో ఒక స్త్రీ ఖరీదు వెయ్యిరూపాయ లేనా?" అస్పష్టంగా గొణిగాడు రామ్మూర్తి.

"మూర్తిగారూ! ఒక రచయితగా మీరు బాధ పడొచ్చు! కాని, అది నా కిష్టంలేదు. దయచేసి నేను చెప్పింది మర్చిపొండి..." కళ్ళు వర్షించటానికి సిద్ధపడే సరికి చటుక్కున తల తిప్పేసుకుంది సీత.

రామ్మూర్తి ఒక నిశ్చయానికి వచ్చిన వాడిలా తల పంకించాడు. "సీతా! నువ్వు రేపటినుంచి క్రొత్త జీవితం ప్రారంభించబోతున్నావ్!"

"మీరు...ఏమిటి మీరంటున్నది?"

"గాబరా చెందకు" మందహాసం చేశాడు రామ్మూర్తి. "నిన్ను వివాహం చేసుకుంటానని నేను చెప్పటంలేదు.

నాకు పెళ్ళి అయివున్నది. ఆమె పేరు జానకి. ఇంకా పిల్లాజల్లా కలగలేదు. సీతా! భగవంతుడు నాకు అన్నీ ఇచ్చాడు గాని, ఎందుకో మనశ్శాంతిని ఇవ్వలేదు. ఆ లోటు నీద్వారా తీర్చుకోవాలనుకుంటున్నాను. నా కోరిక కోరికగానే మిగిలిపోయేలా చెయ్యొద్దు, చెల్లాయ్."

ఏం మాట్లాడాలో తోచలేదు సీతకి: "మూర్తిగారూ! మీరు...మీరు ఎటువంటి నిశ్చయానికి వచ్చారో..."

"చెబుతాను వినమ్మా!" బుగ్గలమీదకు జారబోయిన కన్నీళ్ళను తుడిచేసుకున్నాడు రామ్మూర్తి. "తిరిగి నిన్ను ఆ దెమ్మ ఇంటికి పంపలేను. రేపటినుంచి నువ్వు నా కజిన్ సిస్టర్‌గా ఈ సమాజానికి పరిచయం చెయ్యబడతావు."

సీత కళ్ళలోంచి జలజల రాలాయి కన్నీళ్ళు. అవి ఆనందబాష్పాలని ఆమెకే తెలియదు.

"మూర్తిగారూ...అన్నయ్యా! ఈ చరిత్రహీనురాలి మీద మీకెందుకింత శ్రద్ధ?" వణికే కంఠంతో అడిగింది!

"శ్రద్ధకాదమ్మా! బాధ్యత..." రామ్మూర్తి నెమ్మదిగా చెప్పుకుపోతున్నాడు. "ఆ దెమ్మ ఇంట్లో నిన్ను చూసేవరకు నేను అందరిలాంటి మగ వెధవనే!

నిన్ను చూడగానే నా గుండె పగిలింది.

సీతా! కథల్లోలాగే నిత్య జీవితంలో సైతం ఒకొక్క-సారి విచిత్రమైన సంఘటనలు ఎదురవుతుంటాయి. అందుకు నిదర్శనం మన కలయికే!

ప్రియుని వెంట లేచిపోయి, చివరికి బజారు మనిషిగా మారిన నా చెల్లెలు...నిన్ను చూస్తుంటే దాన్ని చూస్తున్నట్టే వుందమ్మా! ముఖ కవళికల్లో మీ ఇద్దరికీ పెద్దగా తేడాలేదు. అసలు ఎటువంటి తేడాలేదనే చెప్పొచ్చు!

మనిషిని పోలిన మనుషులు వుంటారని ఇప్పుడు నమ్ము తున్నానమ్మా!''

రామ్మూర్తి హృదయాంతరాళాల్లో అగ్నిపర్వతాలు ప్రేలుతుంటాయని వూహించుకుంది సీత. ''మీ చెల్లెలు... ఆమె పేరేమిటి?'' అడగకూడదనుకుంటూనే అడిగింది.

''సీత.''

నెత్తిన పిడుగు పడ్డట్లు క్షణకాలం చలించిపోయింది సీత. నెమ్మదిగా తెప్పరిల్లి నిర్లిప్తంగా నవ్వింది. ''సీత ఇప్పుడు...''

''స్వర్గంలో వుందమ్మా!'' ముఖంమీద ఏర్పడిన స్వేదం తుడుచుకున్నాడు రామ్మూర్తి. ''నీలాగే అదీ వంచించ బడింది. వాడొక రోగ్. ముస్లిమ్. మతాంతర వివాహం కావటంతో సీతని అతనికిచ్చి పెళ్ళి చేయలేకపోయాను.

నా నిర్ణయం తెలిసిన రాత్రే సీత-అతనివెంట లేచి పోయింది. ఆటుతర్వాత నేను అనుభవించిన క్షోభ... ఆ బాధ శత్రువుకి కూడా వద్దమ్మా!

రెండేళ్ళ తర్వాత సీత ఆచూకీ తెల్సింది. రాజమండ్రి లోని ఒక వేశ్యా గృహంలో సీత వుందని తెల్సి వెళ్ళాను. నేను విన్నది నిజమే. ఆ ఇంట్లో సీత కన్పించింది. కాని...'' ఆగాడు-బరువుగా వూపిరి పీల్చి వదిలాడు-నాలుకతో పెద వులు తడుపుకున్నాడు.

''కాని?'' దడదడలాడే గుండెలతో ప్రశ్నించింది సీత.

''నన్ను చూడగానే తృళ్ళిపడింది. నేను దగ్గరకు వెళ్ళేలోగా మేడమీదనుంచి క్రిందకు దూకేసింది. చేయి విరిగి తల పగిలిన సీతని...నా చెల్లెల్ని హాస్పిటల్ కి చేర్చాను. ప్రయోజనం లేకపోయింది. డాక్టర్ల శ్రమకి

ఫలితం లేకుండాపోయింది, సీతని ఇంటికి తీసుకురావాలని వెళ్ళి దాని శవాన్ని తెచ్చుకున్నాను."

వెక్కి వెక్కి ఏడుస్తోంది సీత. దుఃఖాన్ని చాలా సేపట్నుంచి బలవంతంగా ఆపుకోవటంతో వెక్కిళ్లు తన్నుకొచ్చాయ్ ఒక్కసారిగా.

"ఏడవకు సీతా!" ఆమె బుగ్గలు, కళ్ళు తుడిచాడు రామ్మూర్తి. "మనిషి జీవితం విచిత్రమైనది. లేకుంటే నువ్వు నాకు పరిచయం అయివుండేదానివి కాదు. ఇప్పుడు చెప్పమ్మా! నాతో కల్సి భోంచెయ్యవూ?"

గబగబ పైటతో కళ్ళు తుడుచుకుంది సీత. "భోంచేస్తాను. ఇకామీదట నువ్వు ఏం చెప్పినా చేస్తానన్నయ్యా!" అంది చిన్నపిల్లలా.

"వెరీగుడ్! నేను చెప్పిందంతా మర్చిపో! నీ గత జీవితాన్నికూడా" స్వయంగా తనే ఇద్దరికీ వడ్డించాడు రామ్మూర్తి.

ఆ రోజు కడుపునిండా తినగల్గింది సీత.

"చెల్లాయ్! ఉదయం ఐదింటికి ఇక్కడికి ఆదెమ్మ తమ్ముడు ధనపతి వస్తానన్నాడు. ఆ రాస్కెల్ రాక మునుపే మనం వెళ్ళాలి! పడుకొని నిద్రపో...ఇదిగో ఈ పాలు తాగేసి పడుకో" ఫ్లాస్కులోని పాలు రెండు గ్లాసుల్లో పోసి, ఒక గ్లాసు సీతకిచ్చాడు రామ్మూర్తి.

గాల్లో తేలిపోతున్నంత హుషారుగా వుంది సీతకి. నులివెచ్చని పాలు గటగట తాగేసింది.

వాచ్‌మేన్‌ని పిలిచి, ఖాళీ ప్లేట్లు, కారియర్, గ్లాసులు ఇచ్చి పంపేశాడు రామ్మూర్తి. పంపేస్తూ అతని చేతిలో ఐదు రూపాయల నోటు పడేశాడు.

పక్క మీద వాలిన సీతని నిద్రాదేవి చాలా తొందరగా కరుణించింది ఆవేళ.

## 4

గోడగడియారం ఎక్కడో "ఠంగ్...ఠంగ్..." మంటూ వరుసగా గంటలు కొడుతోంది. ఆ శబ్దం నిద్రిస్తున్న సీత చెవుల్ని సోకింది.

కళ్ళు తెరవబోయి మానేసింది సీత. కనురెప్పలమీద ఏదో బరువు వున్నట్టుగా అన్పిస్తోంది. తలమీద ఎవరో సుత్తులతో బాదుతున్నట్టుగా బాధ!

కళ్ళు మూసుకుని అలాగే కాసేపు పడుకుని వుండిపోయింది సీత. ఏదో నీరసం ఆమెను క్రుంగదీస్తోంది.

ఏమిటి...ఏమైంది తనకు? కళ్ళు మూసుకునే ఆలోచిస్తోందామె. ధనపతి... అవును... ఇపుడు గుర్తొస్తోంది. చీకటి పడుతుండగా ధనపతి వచ్చాడు తన గదికి. తాగుబోతు వెధవ! ఆ రాస్కెల్ నిర్వాకమే ఇదంతా! అందుకే ఒళ్ళంతా పచ్చిపుండులా అన్పిస్తోంది. టైం ఎంత అయ్యిందో...? ఇలాగే పడుకునివుంటే ఆదెమ్మ వచ్చి చూస్తే...?

హఠాత్తుగా రామ్మూర్తి గుర్తొచ్చాడు సీతకి. మరికొన్ని సంఘటనలుకూడా గుర్తొచ్చాయి. రామ్మూర్తి...అన్నయ్య ఇంకా నిద్రపోతున్నాడా? చటుక్కున లేచి కూర్చుందామె. వెంటనే ఆశ్చర్యపోయింది. అది ట్రావెలర్స్ బంగ్లాలోని గదికాదు.

ఇంకా నీరసంగానే వుండటంతో మంచం దిగే ప్రయత్నం చెయ్యలేదు సీత. గదిలోని ఫర్నీచర్ని, గోడల్ని మార్చి మార్చి చూసింది కాసేపు. తను వున్నది ట్రావెలర్స్

బంగ్లాలో కాదని ఆమెకు అర్థమైపోయింది చాలా తొందరగా.

ట్రావెలర్స్ బంగ్లాలోని ప్రతిగదిలోనూ సీలింగ్ ఫాన్ వుంది. ఈ గదికి అటువంటిదేం లేదు. చివరికి కిటికీకూడా లేదు. ఉన్న ఒకే ఒక్క ద్వారాన్ని చెక్క తలుపు మూసేసింది. ఆ తలుపుకి పావలా, పదిపైసలు వగైరా నాణేల్ని గుర్తుకు తెప్పిస్తూ కొన్ని కన్నాలున్నాయ్.

తలుపుకి ఆ విధంగా కన్నాలు ఎటువంటి కొంపల్లో వుంటాయో సీతకి తెల్సు.

మంచం దిగబోయింది సీత_అదిరే గుండెల్ని అదుపులో పెట్టుకుంటూ. ఇంతలో తలుపు తెర్చుకుంది. నాలుగు పదులు దాటిన ప్రౌఢ లోనికొచ్చింది.

సీత మంచం దిగే ప్రయత్నం విరమించుకుని, లోనికొచ్చిన ప్రౌఢని చూసింది. ఆదెమ్మకు ఈ ప్రౌఢకు అట్టే తేడాలేదు.

"అమ్మాయ్! లేచి స్నానం చెయ్. పది గంటలు కావస్తోంది" ప్రౌఢ సీతని పట్టిపట్టి చూస్తూ చెప్పింది.

"నేను... నేనెక్కడున్నాను?" నీరసంగా అడిగింది సీత.

"నా ఇంట్లో."

"మీరు ... మీరెవరు? రామ్మూర్తి అమ్మగారా?" ఎటువంటి సమాధానం వినవలసి వస్తుందోనని భయపడుతూనే వుంది సీత.

"రామ్మూర్తి ఎవడు?" ప్రౌఢ ముఖం చిట్లించింది. "నిన్ను తీసుకొచ్చి నాకమ్మేసి వెళ్ళిన వెధవ నీతో ఆ విధంగా చెప్పుకున్నాడేమో! వాడి పేరు అదికాదమ్మాయ్! వరహాల్రావ్."

తను మరొకసారి మోసపోయినట్టు అర్థమైంది సీతకి. భూకంపం వస్తే బావుండు నన్పించింది ఆమెకు. తన గుండెలు ఆగిపోయినా చాలనుకుంది.

కాని, ఆమె అనుకున్నవేవీ జరగలేదు.

"అతను వరహాల్రావు కాదు... రామ్మూర్తిగారు" అరిచింది, అతను వరహాల్రావే అయివుంటాడని మనసు చెబుతున్నా.

"చూడమ్మాయ్...నీ పేరేమిటి? సీత అని చెప్పాడా వెధవ అదేనా నీ పేరు?"

అప్రయత్నంగా తలూపింది సీత అవునన్నట్లు.

"ఈ నెల్లూరులో వరహాల్రావ్ తీసుకొచ్చే నాసిరకం ముండల్ని కొంటున్నది ఈ రాఘవమ్మ ఒక్కతే. నువ్వు ఓపిగ్గా బేరాలు చేస్తావని, అదీ యిదీ చెప్పి ఎనిమిదివందలు తీసుకెళ్ళాడు. బాకీ ఎంత తొందరగా తీరుస్తావో చూస్తాను. రామ్మూర్తి ... సింగినాదం అంటూ కబుర్లు చెపుతూ కూర్చోవద్దు! లేచి స్నానం చెయ్! పగలు పాతిక బేరాలైనా చెయ్యకుంటే బాకీ ఆర్నెల్లకుకూడా తీర్చలేవు..." కెనేడియన్ ఇంజన్‌లా అరిచి, వచ్చినంత వేగంగా నిష్క్రమించింది రాఘవమ్మ.

రామ్మూర్తి... వరహాల్రావ్... నెత్తి బాదుకుంది సీత. చాలా ఆలస్యంగా తెల్సిందామెకు ... జాకెట్ లోపల వక్షోజాల మధ్య ఏదో వస్తువు వుందని.

ఏడుపు మాని ఆ వస్తువు తీసి చూసింది. ఏదో వుత్తరం గబగబ చదువుకుంది.

"సీతా,

నా పేరు రామ్మూర్తి కాదు వరహాల్రావ్. రామ్మూర్తి

అనే క్రైం రచయిత వున్నమాట నిజమే! అతని రచన లంటే నాకూ ఇష్టమే! కాని, నేను అతను కాదు. ఆదెమ్మ కంపెనీ వుంటున్న ఊర్లోని ట్రావెలర్స్ బంగ్లాలో నీతో నేను ఒక్క మాట అయినా నిజం చెప్పలేదు. నా వృత్తి ఏమిటో ఇప్పటికి నీకు అర్థమైవుంటుంది.

సీత అనే చెల్లెలు నాకు లేదు.

నన్ను క్షమించు సీతా! ఈ విధంగా బ్రతకటం తప్ప మరొక పని నాకు తెలియదు. ట్రావెలర్స్ బంగ్లాలో నువ్వు తాగిన పాలలో మత్తుమందు కలపబడిందని నీకు తెలియదు. నేను వూహించిన దానికంటే తొందరగా నువ్వు స్పృహకోల్పోయావు.

నువ్వు నా చెల్లెలని, సడెన్‌గా ఆరోగ్యం తిరగబెట్టిందని టాక్సీ డ్రైవర్‌కి చెప్పి, ఎలాగో నిన్ను నెల్లూర్ చేర్చాను.

ఆంధ్రదేశం నలుమూలలా వుంటున్న వేశ్యా గృహాలతో నాకు సంబంధాలు వున్నాయ్. నిన్ను నెల్లూర్‌లోని రాఘవమ్మ కంపెనీలో అమ్మేసి వెళ్తున్నాను. ఈ కంపెనీ ఓనర్ రాఘవమ్మే! మంచి మనిషి కాదు. డబ్బును తప్ప మరి దేన్నీ ప్రేమించదు.

గుట్టుగా రాఘవమ్మ చెప్పినట్టు విని, తొందరగా బాకీ తీర్చెయ్ సీతా! జీవితంలో మళ్ళీ మనం కల్సుకోకపోవచ్చు! కల్సుకోవాలని నేను కోరుకోవటమూ లేదు. నన్ను క్షమించవల్సిందిగా మరొకసారి కోరుకుంటున్నాను చెల్లాయ్.

—వరహాలరావ్"

ఉత్తరాన్ని అవతల పారేసి, గదిలోంచి బయటికి

నడిచింది సీత. ఇప్పుడు ఏడవటం లేదామె. ఏడ్చి ప్రయోజనం లేదని ఆమెకు తెల్సు. అది అనుభవం నేర్పిన పాఠం.

మెయిన్ హాల్లో తనవంటి యువతులే నలుగురైదుగురు కన్పించారు. ఎవరినీ పలకరించలేదు సీత. తలొంచుకుని పెరటి వైపు వెళ్ళింది—చన్నీళ్ళ స్నానం చెయ్యటానికి.

## 5

ఆ రోజు రాత్రి భోజనాల దగ్గర సీతని జులేకా అనే అమ్మాయి పలకరించింది. "నీ పేరేమిటి అక్కయ్యా?"

"సీత."

"నా పేరు జులేకా."

బదులు చెప్పలేదు సీత. అన్నం సహించకపోవడంతో తింటున్నట్టు నటిస్తోంది.

జులేకా తిరిగి మాట్లాడింది. "ఈ కొంప ఓనర్ రాఘవమ్మ లేదూ...అదొక సైతాన్."

ఈసారికూడా మాట్లాడలేదు సీత.

"అక్కయ్యా! నేను ఈ రాత్రే ఇక్కణ్ణించి పారిపోవాలనుకుంటున్నాను" గుసగుసలాడింది జులేకా.

"పారిపోతావా? రాఘవమ్మకి తెలిస్తే?" ఇహ వూరుకో లేకపోయింది సీత.

"తాట వలిపిస్తుంది..." నవ్వింది జులేకా.

భోజనాలు పూర్తయ్యాయి. ఆ రోజు కంచాలు తియ్యటం, వంటగది ఊడవటం జులేకావంతు. అమ్మాయిలందరూ భోజనాలు ముగించి లేచి వెళ్ళాక జులేకా తన డ్యూటీ ప్రారంభించింది.

ఆ రాత్రి రాఘవమ్మకి వందరూపాయలు సంపాదించి

పెట్టింది సీత. బాగా అలసిపోయి, తెల్లవారు ఝామున నిద్రపడింది. ఇంతలో జులేఖా గదిలోకొచ్చింది— "అక్కయ్యా! మనం త్వరగా వెళ్ళిపోవాలి!" అంటూ.

"ఎక్కడికి?" మంచం మీద లేచి కూర్చుంది సీత, ఆవులిస్తూ.

"ముందు ఈ కొంపలోంచి బయటికి. మిగిలిన వివరాలు తర్వాత చెప్తాను. లే... లే..."

"రాఘవమ్మ..."

"నల్లమందు మత్తులో నిద్రపోతోంది. ఈ కొంపకి కాపలా వుండే రౌడీరంగడు నేనిచ్చిన పాలు తాగి పడి పోయాడు. ఆపాలల్లో నిద్రమాత్రలు కలిపాన్లే పది."

జులేఖా ధైర్యానికి విస్తుపోయింది సీత.

ఇద్దరూ గదిలోంచి బయటపడ్డారు. అమ్మాయిలు సైతం ఎవరి గదుల్లో వారు నిద్రపోతుండటంతో స్మశానాన్ని గుర్తుకు తెప్పిస్తోంది రాఘవమ్మ ఇల్లు.

జులేఖా వెనుకే పెరటి దారిగుండా రాఘవమ్మ ఇంట్లోంచి బయటికి పరుగెత్తింది సీత. పావుగంటలో వాళ్ళిద్దరూ రైల్వేస్టేషన్ చేరుకునేశారు— కట్టుబట్టలతో.

# 6

ఉదయం ఐదున్నర ప్రాంతంలో గూడూరులోని ఒక పెంకుటిల్లు ముందు రిక్షా దిగారు...జులేఖా, సీత.

రిక్షావాలాకి చిల్లర జులేఖా యిచ్చింది.

ఖాళీ రిక్షా వెనుదిరిగి వెళ్ళిపోయింది.

"ఇదే మా ఇల్లు అక్కయ్యా!" సీత చేయి పట్టుకుని పెంకుటింట్లోకి తీసుకెళ్ళింది జులేఖా.

రెండు గదులు కలిగిన పెంకుటిల్లు అది. ముందు గదిలో

యిద్దరు అమ్మాయిలు చాపలమీద పడి గాఢంగా నిద్ర పోతున్నారు. బహుశా వాళ్ళిద్దరూ జులేకా చెల్లెళ్ళు అయి వుంటారని వూహించింది సీత. వెనుక గదిలో వయసు మళ్ళిన స్త్రీలిద్దరు నులక మంచాలపై పడుకొని గురక పెడుతున్నారు.

ఆ కొంపలో ఎక్కడగాని మహమ్మదీయ సంస్కృతి అనేది కన్పించటం లేదు. చివరికి గోడలకుకూడా హిందూ దేవతల కేలండర్లు వ్రేలాడుతున్నాయ్.

సీతని పెరట్లోకి తీసుకొచ్చింది జులేకా.

పెరట్లో బావి, ఎండిపోయిన మల్లెపందిరి, ఒక ప్రక్కగా బాత్రూం, మరుగుదొడ్డి వున్నాయి.

"అక్కయ్యా! స్నానం చెయ్. నేను వెళ్ళి టిఫిన్ ఏర్పాట్లు చేస్తాను..."

"మీ నాన్నగారు కన్పించరేం?" జులేకా మాటలకు అడ్డుపడింది సీత.

ఎవ్వరూ నవ్వలేనంత విచిత్రంగా నవ్వింది జులేకా. "నాకు తల్లికాని, తండ్రి లేడు, అక్కయ్యా! ఎక్కడైనా బ్రతికివున్నాడో, లేడో మా అమ్మకే తెలియదు..." కొన్ని క్షణాలు వూరుకుని, సీత చేతులు పట్టుకుందామె.

"అక్కయ్యా! నీవు నన్ను క్షమించాలి!" అంది అమాయకంగా.

"ఎందుకు? నువ్వు ఏం తప్పు చేశావని?" జులేకాని అమాయకురాలిగా వూహించుకుంది సీత.

"నా పేరు జులేకా కాదు. చంచల."

ఆశ్చర్యపోలేదు సీత. వ్యభిచార కొంపలు మారే అమ్మాయిలు ఊరికే పేరు మార్చుకుంటూవుంటారని ఆమె విని వున్నది.

"నీ పేరు చంచల అయితే నాతో జులేకా అని చెప్పావ్. అదేనా నీవు చేసిన తప్పు? అందుకేనా క్షమించ మంటున్నావ్?" నవ్వుతూ అడిగింది సీత.

"కాదు. నిన్ను రాఘవమ్మ కంపెనీలోంచి మోసం చేసి తీసుకొచ్చాను. ఈ ఇల్లుకూడా రాఘవమ్మ కంపెనీ లాంటిదే."

అదిరిపడింది సీత.

# 7

వారం రోజులు గిర్రున తిరిగాయ్.

చంచల తల్లి పేరు పాపమ్మ అని, తను ఆ కొంపలో అడుగు పెట్టిన రోజే తెల్సుకుంది సీత. మిగిలిన యిద్దరు అమ్మాయిలు కూడా తనవంటి చరిత్రహీనురాళ్ళే. అమ్మాయిలు తక్కువ కావడంతో బేరాలు సరిగా రావడం లేదని, తల్లిని ఒప్పించి, నెల్లూర్‌లోని రాఘవమ్మ కంపెనీలో చేరింది చంచల. కనీసం ఇద్దరినైనా అకర్షించి మోసగించి తీసుకురావాలని చంచల ప్లాన్.

ఆమె అనుకున్నట్టు జరగలేదు.

సీత ఒక్కతే అమాయకురాలిగా కన్పించింది చంచలకి. వెంటనే విసిరింది వల. చాలా సులభంగా ఆ వలలో చిక్కుకుంది సీత.

ఈ వివరాలన్నీ చంచల ద్వారానే తెలిశాయి సీతకి. ఆమెకు తెలియని విషయం ఒక్కటే.

పాపమ్మ వెంట వుంటున్న ప్రౌఢ ఎవరు?

"సీతా!" అంటూ పెరట్లోకి ప్రవేశించింది పాపమ్మ...

ఆ సమయంలో సీత మల్లెపందిరి క్రింద చాప పరచుకుని నిద్రకుపక్రమిస్తోంది. పాపమ్మ కంఠం విన్పించిన

వెంటనే ఆమె నిద్ర సహం ఎగిరిపోయింది. పాపమ్మ ఆకారం కన్పించిన మరుక్షణంలో మిగిలింది కూడా పారిపోయింది.

"ఏమిటత్తయ్యా?" అంది భయపడుతూ.

చంచల తప్ప మిగిలిన అమ్మాయిలందరూ అలాగే పిలుస్తారు పాపమ్మని. పిలవాలి! లేకుంటే పాపమ్మ తను సార్థక నామధేయురాలని నిరూపించటానికి సిద్ధపడుతుంది.

"చంచల మిగిలిన యిద్దరినీ తీసుకుని మార్నింగ్ షో ఆట...దాని పిండాకుడు... వెళ్ళింది! బేరాలు వస్తే నువ్వే చూడాలి తల్లీ! నిద్రపోతే ఎలా?"

"అలాగే! ఎవరైనా వస్తే లేపు. కళ్ళలో ఇసుక వున్నట్లు ఒకటే మంటగా వుందత్తయ్యా! కాసేపు నిద్రపోతాను..."

"ఒక్కరోజు నిద్ర మానేస్తే కొంప మునగదులే. బేరాలు మానితే తిండిలేక చస్తాం," పాపమ్మ స్వరం మారిపోయింది.

సీతనిద్ర మరోక దేశం చేరుకుంది.

చాపచుట్టి, అవతల పడేసింది సీత. కిక్కురు మనకుండా బావివైపు కదిలింది స్నానానికి.

ఆ సాయంత్రం ముస్తాబు చేసుకుంటున్న చంచల్ని అడిగింది సీత ఉండబట్టలేక, "చంచలా! మన ఇంట్లో వుంటున్న రత్తాలు ఎవరు?"

"మా పెద్దమ్మ" అని చంచల చకచకం లిప్‌స్టిక్ రాసుకోవటంలో మునిగింది.

ఆ రాత్రి బేరాలు చెయ్యలేకపోయింది సీత. నిద్రలేమి

నీరసం అధికం కావటంతో మన్నుతిన్న పాములా పెరట్లో చాప పరుచుకుని పడుకుంది.

రాత్రి ఎనిమిది గంటలు కాకమునుపే పాపమ్మ ఇంట్లో హడావుడి మొదలైంది. రకరకాల మొగవాళ్ళు వచ్చి వెళ్తున్నారు. అరుపులు, నవ్వులు, కేకలు, కీచులాటలు... అవన్నీ వింటున్న సీతకి సన్నగా తలనొప్పి మొదలైంది. క్షణాలమీద దాని వుధృత పెరిగింది.

"అమ్మాయ్..." అంటూ వచ్చింది పాపమ్మ. "అయ్యయ్యో! ఇదేమిటే... ఈ వేళప్పుడు పక్క మీదకు చేరావు?" పడుకునున్న సీతని చూస్తూ అరుపులు మొదలు పెట్టింది.

"నేను నిద్రపోవాలత్తయ్యా! లేకుంటే చచ్చి పోతాను."

"వెధవ కబుర్లు చెప్పక! తిండి లేకుంటే చస్తారుగాని, నిద్రకి మొహం వాచిపోయిన వాళ్ళను నే నెరుగను. లే... అవతల బేరాలు ఎదురుచూస్తున్నాయ్!"

"నీకు దండం పెడతానత్తయ్యా! నన్ను విసిగించ కుండా వెళ్ళు..."

కాసేపు సీతని చూస్తూ నిలబడింది పాపమ్మ. "వెధవ ముండా! దొంగ వేషాలు వేస్తున్నావ్, లేచి బేరాలు చూస్తావా, లేదా?"

"రాను...రాను...రాను...నన్ను చంపినా సరే!" స్వరం పెంచింది సీత.

గిర్రున వెనుదిరిగి వెళ్ళిపోయింది పాపమ్మ. నిమిషం కూడా గడవక మునుపే రత్తాలు వచ్చింది పెరట్లోకి.

ముడుచుకుని పడుకొనున్న సీతకి తన తొడ ఎందుకో

మండుతున్నట్టుగా అనుమానం కలిగింది. చటుక్కున కళ్ళు తెర్చి చూసేసరికి ఆమెకు అపరకాళిలా దర్శనమిచ్చింది రత్తాలు.

"దొంగ ముండా! మహారాణిలా వచ్చి ఇక్కడ పడుకుంటే అక్కడ బేరాలు ఎవరు చూస్తారే...మీ అమ్మా?" సీత ఎడమ తొడమీద చర్మాన్ని చీరపైనే మెలిపెడుతూ బూతులు విసురుతోంది రత్తాలు.

"నేను... నేను నిద్రపోవాలి!" అరిచింది సీత రత్తాలు చేతిని వెనక్కి నెట్టెయ్యాలని చూస్తూ.

"ఛెళ్..." మంటూ సీత చెంప మీద ఓ దెబ్బ వేసింది రత్తాలు. "నిద్రపోతే కంచంలోకి కూడు ఎలా వస్తుందే? లేస్తావా, లేదా?"

రత్తాలు నరరూప రాక్షసి అని అర్థమైపోయింది సీతకి. చేసేది లేక లేచి వెళ్ళింది—లోలోపలే కుళ్ళి కుళ్ళి ఏడుస్తూ.

# 8

మూడు నెలలు కాలగర్భంలో కలిశాయి.

ఈ మూడు నెలల్లో పాపమ్మ ఇంట్లోంచి ఒక్కసారైనా బయటికి వెళ్ళలేదు సీత.

ఎప్పుడైనా సినిమాకు వెళ్ళాలనిపించినా, బలవంతంగా ఆ కోరికను చంపుకుంటూ వస్తోంది సీత. ప్రపంచమంటే మనుష్యులంటేనే అసహ్యం వేస్తోందామెకు. దానికి తోడు నిరంతరం ఆమెకు ఎస్కార్ట్ గార్డ్‌లా మెలుగుతోంది రత్తాలు.

పారిపోయే ప్రయత్నం కాదుకదా, చివరికి అటువంటి యోచనైనా చెయ్యటం లేదు సీత. అటువంటి ప్రయత్నం

చేసి వారం రోజుల క్రితం పట్టుబడిపోయిన ఒక అమ్మాయిని రత్తాలు ఏ విధంగా సన్మానించిందో ఇప్పటికీ గుర్తుంది సీతకి.

ఇంకా ఆ పిల్లకి ఒంటిపూట భోజనమే పెడుతోంది రత్తాలు. పట్టుబడిన రోజు ఆ పిల్లని నగ్నంగా చేసి, చేతులు రెండూ వెనక్కి విరిచి పాపమ్మ, చంచల పట్టుకున్నారు. ఎటువంటి బాధ కలిగినా అరవటానికి వీల్లేకుండా ఆ పిల్ల నోట్లో గుడ్డలు కుక్కింది రత్తాలు. అటు తర్వాత ప్రారంభించిందామె చిత్రహింస.

తల వెంట్రుకలు పది—ఇరవై ఒక్కసారిగా పట్టుకుని లాగటం, చన్మొనల్ని మెలిదిప్పటం, తొడలమీద కత్తి గాట్లు పెట్టి ఉప్పునీళ్ళు చల్లటం, సన్న సూదులు వేడిచేసి కడుపుమీద వాత వెయ్యటం. ఆ వేళ ఆ ఘోరాన్ని చూళ్ళేక కళ్ళు తిరిగి పడిపోయింది సీత.

ఒకందుకు మాత్రం సీత సంతోషించిందనే చెప్పొచ్చు. పారిపోవటానికి ప్రయత్నించి ఆదెమ్మ ఇంట్లో పట్టుబడిన అమ్మాయిల్ని ఆదెమ్మ తమ్ముడు ధనపతి ఇంతకంటే క్రూరంగా హింసించేవాడు.

ధనపతికంటే రత్తాలే నయం.

# 9

"వెయ్యిరూపాయలు తీసుకో అత్తయ్యా!"

"వీలుకాదు అల్లుడూ! ఆ పిల్లని నేను రెండువేలు పోసి కొన్నాను."

"ఏ ఊరు పిట్టేమిటి?"

"గుడివాడ. బందరు లడ్డూలా వుంటుంది. ఒక్క రాత్రిలో ఏభై బేరాలయినా చెయ్యగలదనుకో!"

"మావద్ద కెవరైనా వచ్చినపుడు మేమూ ఇలాగే

వున్నవి లేనివి చెబుతూంటాం. ఇహ నీ సంగతి నాకు తెలియందని ఏముంది? మూడు పదులు దాటిన ముండని కూడా ఇలాగే చెప్పి అమ్మాలని చూస్తావ్."

"అదేం మాట? నా సంగతి నీకు తెలియదా, అల్లుడూ?"

"తెల్సుగనుకనే వెతుక్కుంటూ వచ్చాను."

తర్వాత ఎటువంటి మాటలూ విన్పించలేదు పెరట్లో ముఖం కడుక్కుంటున్న సీతకి. ఒక గొంతు పాపమ్మదని తెలుస్తూనేవుంది. ఇంకొకటి మగగొంతు. ఆ కంఠం తనెక్కడో విన్నట్టు అన్పిస్తోంది. ఎవరై వుండొచ్చు? వరహాలావా?

గబగబ ముఖం కడుక్కుని పైటతో తుడుచుకుంది సీత. పాపమ్మ ఎవరినో అమ్మెయ్యాలని చూస్తోంది. పది రోజులుగా నళిని అనే అమ్మాయి బేరాలు సరిగ్గా చెయ్యకుండా గొడవచేస్తోంది. నళినిని అమ్మెయ్యాలని చూస్తున్నదేమో! పాపం నళిని...సీత హృదయం బరువెక్కింది. కళ్ళు తుడుచుకుని వంట గదిలోకి వచ్చింది. ముందు గది లోంచి తిరిగి విన్పించిందా మగకంఠం.

"ఇదిగో—ఎనిమిది వందలు. మిగిలిన డబ్బు ఊరెళ్ళి మణియార్డరు ద్వారా పంపుతాను."

"వెధవ కబుర్లు చెపుతావ్. ఆ రెండువందలూ ఏట్లో వేసినట్టే లెక్క."

"లేదత్తయ్యా! మొగుడు చచ్చిన ముండవి. నీ డబ్బు నాకెందుకు చెప్పు?"

"ఒరేయ్...నా మొగుడు బ్రతికే వున్నాడు."

"ఎక్కడున్నాడేమిటి?"

"అదే తెలియటం లేదు. ఎక్కడున్నా బతికే

వుంటాడు.''

చంచలతో పాటు మిగిలిన ఇద్దరు అమ్మాయిలు, రత్తాలు వంటగదిలో కూర్చుని టిఫిన్ ఆరగిస్తున్నారు.

''ఏమిటే అలా నిలబడిపోయావ్? అలా కూర్చో'' అంది రత్తాలు సీతని ఎగాదిగా చూస్తూ.

రత్తాలును గురించి పట్టించుకోలేదు సీత.

ముందుగదిలో పాపమ్మతో బేరాలు సాగిస్తున్న వెధవ ఎవడు?

వరహాలరావ్ అయివుంటాడా?

ఆ వెధవ అయితే తను వెళ్ళి కన్పించాలి! తన ముఖం కన్పించగానే వాడు ఎలా ఫీలవుతాడో చూడాలి!

టిఫిన్ సంగతి మర్చిపోయి విసురుగా ముందు గదిలోకి వచ్చింది సీత.

''అదిగో...వస్తోంది చూడు...ఆ పిల్లే! ఎలా వుంది అల్లుడూ...?'' అంటోంది పాపమ్మ.

ఆ మాటలు విన్న సీతకి అమ్మేయ్యబడుతున్నది తనే అని క్లియర్‌గా అర్థమైంది. అయినా బాధ పడ్డేదామె. వెళ్ళబోతున్న చోటనైనా కాస్త సుఖం వుంటుందేమోననే ఆశ!

తన్ను కొనుగోలు చేయడానికి వచ్చివున్న వ్యక్తిని చూసింది సీత.

అంతే, సీత కళ్ళు తిరిగాయ్. నిలబడలేక మెలికలు తిరుగుతూ నేలకొరిగిపోయింది. ఆమెకు బాహ్యస్మృతి పోయింది.

సీతని కొనుక్కోవటానికి వచ్చివున్న వ్యక్తి వరహాలరావ్ కాదు. ఆమె మేనమామ... ధనపతి!

—: ఐ పో యిం ది :—

# శని దేవతలు!!

సుజనశ్రీ

ఇనుప గేటుని తోసుకుంటూ లోపలికి ప్రవేశించింది సరళ. ఆ భవనం మొదటి చూపులోనే ఆమెను ఆకట్టుకుంది. బహుశా దాని యజమాని లక్షలకు అధికారి అయివుండాలి. లేకపోతే ఇద్దరు నర్సుల్ని ఇంటికి పిలుచుకోగలుగుతాడా?

ఈపాటికి మరో నర్స్ కోమలి వచ్చేసి ఉండాలి అనుకుంది సరళ.

ఆ భవనం యజమాని పరాత్పరరావుకి ఫామిలీ డాక్టరు శేఖరం. అతడే మిషన్ హాస్పిటల్‌కి ఫోన్ చేశాడు, ఒక రోగికి సపర్యలు చేసేందుకు ఇద్దరు నర్సుల్ని పంపమని. అందుకయ్యే ఖర్చులో కొంత భాగం అడ్వాన్సుగానే చెల్లించేశాడు మిషన్ హాస్పిటల్ అధికారులకు.

హాల్లో సరళకు కోమల కనిపించింది. కోమలి తనకన్న కొద్దిక్షణాల ముందే వచ్చి వుండాలి. ఇంకా ఆమె లగేజీ అక్కడే వుంది. ఎదురుగా పనిమనిషి సుబ్బులు నిలబడి వుంది.

"సుబ్బులూ! ఆయనగారి కెలా వుంది?" కోమలి ఆత్రతగా అడుగుతోంది.

అయితే ఎదురుగా వున్న సుబ్బులు కోమలివంక కొరకొరా చూస్తోంది.

"నువ్వా? మళ్ళా ఏ ముఖం పెట్టుకుని ఇక్కడకు వచ్చావ్?" అని ఉరిమినట్టుగా అడుగుతోంది.

వాళ్ళ సంభాషణలోని ఆంతర్యం సరళకేమాత్రం అర్థం కాలేదు.

"ఏమిటి నీ వాగుడు! నేనెవరనుకున్నావ్! రోగికి సపర్యలు చేయడానికి వచ్చిన నర్స్‌ని. ఏ గదిలో ఉన్నారు ఆయన!" పులిలా గర్జించింది కోమలి.

మెట్లమీదనుంచి పిల్లిపిల్ల వచ్చింది. అది కోమలిని చూస్తూనే పరుగెత్తుకుంటూ వచ్చింది. కోమలి దాన్ని ఆప్యాయంగా నిమిరింది.

"చూశావా? ఆఖరికి ఇదిగూడ నన్ను మరిచిపోలేదు" అంది కోమలి.

సుబ్బులు అసూయగా చూసింది.

అంటే కోమలికీ ఈ ఇంటికీ ఇంతకుపూర్వమే ఏదో అనుబంధం వుందన్నమాట, అనుకుంది సరళ.

పిల్లిని సోఫాలో దించి కోమలి మేడమెట్లెక్కింది. ఆ భవనం ఆమెకు చిరపరిచితమల్లే వుంది చకచక నడిచి పైకి వెళ్ళింది.

ఆమె వెళ్ళిన వంకే చూస్తూండిపోయింది సుబ్బులు. మధ్య మధ్యలో "ఔరా!" అని బుగ్గలు నొక్కుకుంటోంది.

"చూడమ్మా! ఈ ఇంట్లో లక్ష్మణరావనే ఆయనకు అస్వస్థగా ఉందటగదా! ఆయనను ఇరవయ్ నాలుగు గంటలూ కనిపెట్టుకుని ఉండగలందులకు మా డాక్టర్ శేఖరంగారే మమ్మల్ని రప్పించారు. అందుకే మేంవచ్చాం. మా సామాన్లు మా గదిలోకి చేర్పిస్తే..." సరళ మాట పూర్తికాకముందే సుబ్బులు సూట్ కేసుల్ని ఎత్తుకుంది.

మేడ మెట్లెక్కుతూ "భగవంతుడా! ఇక ఈ ఇంటిని రక్షించటం నీ తరంగూడా కాదు. ఉన్న మేళాలు చాలక ఆ మహాతల్లిగూడ సమయానికే ఊడిపడింది" అని వాపోయింది సుబ్బులు.

## 2

విశాలమైన హాలులాంటి పెద్ద గదిలో రోగి బెడ్ మీద పడుకుని వున్నాడు. మగతలో వున్నాడేమో, కళ్ళుమూసుకుని వున్నాడు.

కోమలి బెడ్ మీదకువంగి అతడి ముఖంలోకి చూస్తోంది. అతడి నుదుటిమీద చెయ్యివేసి చూసింది.

"అతడికి విశ్రాంతి అవసరం!" సరళతో బాటుగా ప్రవేశించిన సుబ్బులు వారించింది.

బెడ్ మీదున్న వ్యక్తి ముఖం తెల్లగా పాలిపోయి వుంది. బహుశా చాలా వీక్ గా వున్నాడనే చెప్పవచ్చు.

"చావు బ్రతుకుల్లో వున్నాడు!" స్వగతంలా పెద్దగానే పలికింది కోమలి.

"భగవంతుడా! ఆయనేం చేయకు!" పైకప్పు కేసి

నమస్కారం చేస్తూ మొత్తుకుంది సుబ్బులు.

"నేనుండగా ఆయనజోలికి యముడ్ని రానిస్తానా? అన్నట్టు పేషెంట్ ఛార్ట్ ఎక్కడ?" కోమలి బెడ్ చుట్టూ తిరిగి ఛార్ట్‌ని వెతికి తీసుకుంది.

సరళ అతడ్ని నిశితంగా చూసింది. పేషెంట్ నిద్ర పోతున్నాడు. కానీ అది సహజమైన నిద్రకాదు. మత్తు మందు ఇవ్వబడింది అతడికి.

"సుబ్బులూ! అయిన్నెవరు కాల్చారు?" కోమలి, సుబ్బులువంక తిరిగి అడిగింది.

"అదేమో నాకూ తెలియదమ్మా! ఆయన తోటలో తిరుగుతూండగా ఎవరో ఆయన్ని కాల్చారట! అంతకన్న నాకేం తెలీదు."

"అతడ్ని లోపలకు చేర్చిందెవరట?"

"వంటమనిషి రోశయ్య, వివేకానంద, మధుమూర్తి! రోశయ్య నీకు తెలిసుండాలి. మిగతా ఇద్దర్నీ నీవెరగవులే! వివేకానంద అనే ఆయన లక్ష్మణరావు క్లాస్‌మేట్ అట! మధుమూర్తి మాధురిదేవిగారి తమ్ముడు."

"సరే! పరామర్శలు తరువాత! ముందు మనం డ్రెస్ మార్చుకునివస్తే పోలా! సుబ్బులూ! కాస్త కాఫీ ఏమన్నా ఉందా?" సరళ నీరసంగా చూసింది.

సుబ్బులు మూతి విరుస్తూ క్రిందకు వెళ్ళిపోయింది.

"ఆయన్ని కనిపెట్టుకుని ఉండు. నేను డ్రెస్ మార్చుకుని వచ్చాక, నీవు వెళ్ళువుగాని!" కోమలి వెళ్ళిపోయింది సరళను అక్కడే వుంచి.

సరళ టేబుల్ దగ్గరకు వెళ్ళి అక్కడున్న మందుల్ని గమనిస్తోంది.

గదిలోకి మరో అందాల బొమ్మ ప్రవేశించింది. అయిదడుగుల ఎత్తు, పొట్టిగా వున్నా, వంపుసొంపులు మాత్రం గ్రీక్ శిల్పసుందరిని గుర్తుకు తెస్తోంది.

మిసమిసలాడే ఛాయ, గుండ్రటి కళ్ళు, చక్కగా అమరిన ముక్కు, అందమైన ముఖం, మంచి శరీర సౌష్టవం, ఒంటినిండా నగలు, సినిమా స్టార్‌ని తలదన్నేలాగుంది ఆమె.

"ఎవరమ్మాయ్ నువ్వు? ఓ! డాక్టర్ కబురుపెట్టిన నర్స్‌వా నువ్వు!" ఆమె అడిగింది సరళవంక చూస్తూ, పేషెంట్‌ని సమీపిస్తూ.

"అవునండీ! నా పేరు సరళాదేవి! పేషెంట్‌కి ఇంకా మగత వదల్లేదు. ఆయన్ని డిస్టర్బ్ చెయ్యకండి!"

ఆ యువతి గర్వంగా చూసింది, ఒక నౌకరు తనను శాసిస్తుందా అన్నట్టు.

అంతలో నర్స్ యూనిఫారంలో కోమలి ప్రవేశించింది.

ఆత్రుతగా వచ్చిన కోమలి గుమ్మంలోనే ఆగిపోయింది. బెడ్ దగ్గరున్న నూతన యువతివంకే చూస్తూ అవాక్కై నిలిచింది.

ఆ యువతి కోమలివంక నిర్విణ్ణురాలై చూసింది. ఆగర్భ శత్రువుల్లా ఒకరినొకరు చూసుకున్నారు ఒక్క క్షణం.

ఆ యువతి గొంతు సవరించుకుంది. "నువ్వా కోమలి! మళ్ళీ ఈ ఇంటి గుమ్మం తొక్కటానికి నీకెన్ని గుండెలు?"

"మాధురీ..." కోమలి ఏదో చెప్పబోయింది కానీ ఆ తర్వాత ఆమె కంఠం పూడిపోయింది.

"ఆఖరికి ఈ రూపంలో అవతరించావన్నమాట! ఎంతటి నెరజాణవు కాకపోతే ఇంత సాహసానికి ఒడిగడతావ్?"

"అదేం లేదండీ! ఇక్కడకు వచ్చేవరకూ మాకు పూర్తి వివరాలే తెలీవు. ఎక్కడకు పోతున్నదీగూడ తెలియజేయ లేదు. తీరా కారు ఈ బంగళా ముందు ఆగేవరకు మా గమ్యం ఎక్కడకో మాకే తెలీదండి!" సరళ సర్ది చెప్ప బోయింది.

"సరే! నీ స్థానం ఏమిటో తెలుసుకుని మసలుకో! వెనుక టిలా వగలాడి వేషాలు కుదరవు. ఈ దఫా నేనున్నాను ఈ బంగళాకు సర్వాధికారిణిని!" మాధురి అహం ఒలక బోస్తూ వయ్యారంగా అంది.

"నీవు ఈ ఇంటికి సర్వాధికారిణివి ఎలా అయ్యావ్? లక్ష్మణరావు మళ్ళి పెళ్ళిచేసుకోలేదే?" కోమలి మొండిగా ప్రశ్నించింది.

"లక్ష్మణరావు మళ్ళి పెళ్ళిచేసుకోని మాట వాస్తవమే! కానీ నన్ను పరాత్పరరావుగారే పెళ్ళాడారు! నేను ఇప్పుడు లక్ష్మణరావుకి సవతి తల్లిని. కనుక నే లక్ష్మణ రావుని నీనుంచి రక్షించుకునే బాధ్యత నాపై వుంది."

"అంటే డబ్బుకోసం ముసలాయన్ని పెళ్ళాడావా?"

"అదంతా నా ఇష్టం! ఇదిగో నీకు ఆఖరుసారిగా చెబు తున్నాను. లక్ష్మణరావు నీ ముఖం చూడడు. పరాత్పర రావుగారు నిన్నిక్కడ ఒక్క క్షణం ఉండనివ్వడు. కనుక నిన్ను బలవంతంగా మా నౌకర్లు గెంటేయక ముందే నీవిక్కడనుంచి వెళ్ళిపోవటం నీకే మంచిది."

"ఆయన్ని రక్షించుకునే భారం నామీద వుంది. ఈ బాధ్యతనుంచి నన్ను ఎవరూ వేరుచెయ్యలేరు" కోమలి మొండిగానే జవాబిచ్చింది.

"ఆయన! ఇంకా నీకు 'ఆయనె'లా అవుతాడు? కోర్టులో

మీకు విడాకులివ్వబడ్డాక! నీవు ఈ ఇంటిలో ప్రవేశించి తండ్రీ కొడుకులమధ్య ఎలాంటి అఘాతాన్ని సృష్టించావో అప్పుడే మరిచావా? లక్ష్మణరావు బంగారు భవితవ్యాన్ని చేతులారా పాడుచేశావు నీ స్వార్థంకోసం! నీ కపట ప్రేమతో డబ్బుకోసం, ఐశ్వర్యంకోసం ఆడిన నాటకాల్ని ఈ ఇల్లు మరువదు ఎన్నటికీ!''

కోమలి ముఖం లజ్జతో, అవమానంతో తెల్లబడింది. కళ్ళు మాత్రం కోపాన్ని వెలిగ్రక్కుతున్నాయ్.

వాళ్ళిద్దరూ కలబడి యుద్ధం చేస్తారేమో అనిపించింది సరళకు.

''కోమలి! మన లగేజీలోంచి మందుల్ని తీసుకువద్దాం రా!'' అంటూ కోమలిని తమ గదికి లాక్కుపోయింది సరళ.

''మధ్యాహ్నం మూడు గంటలకు మళ్ళీ రైలువుంది. నీ తిరుగు ప్రయాణానికి అన్నీ సిద్ధం చేసుకో!'' వెనుక నుంచి మాధురి అరుస్తోంది.

ఇద్దరూ తమకు కేటాయించబడిన పెద్ద గదిలోకి వచ్చారు. తమ లగేజిని ఊడదీసి, అన్నిటినీ అలమారుల్లో సర్దారు.

## 3

''అయితే ఈ ఇంటికీ నీకూ లోగడే అనుబంధం వున్నదన్నమాట!'' అంది సరళ కోమలిని చూస్తూ.

''అవును! నేనూ, లక్ష్మణరావూ ప్రేమించుకున్నాం. రహస్యంగా పెళ్ళి చేసుకున్నాం. లక్ష్మణరావు తండ్రి పరాత్పరరావు కీ సంగతి నచ్చలేదు. మాధురిని తన కొడుక్కు చేసుకోవాలనుకున్నాడు. అందుకు విరుద్ధంగా

కొడుకు చేసిన పనికి అతగాడికి కోపం వచ్చింది.

"లక్ష్మణరావుకి అమెరికాలో ఏదో ట్రెయినింగ్ కి వెళ్ళే అవకాశం వచ్చింది. అతడు లేనప్పుడు నాపైన అభాండాలు వేస్తూ ఉత్తరాలు రాశారు. దాంతో లక్ష్మణ రావు ఇండియాకు తిరిగి వస్తూనే, నా ముఖమైనా చూడ కుండా విడాకులిచ్చేశాడు.

"ఈ లోపలే, మాధురి పరాత్పరరావుని వలలో వేసు కుని, అతడ్నే పెళ్ళాడింది. లక్షల ఆస్తికి అధికారిణి అయింది. మగడు ముసిలాడయితేనేం డబ్బు వచ్చింది" కోమలి తన గత చరిత్రను వివరించింది.

"అంటే, మళ్ళీ నీ భర్తను నీవు చేరుకోవాలనే ఉద్దే శ్యంతో వచ్చావన్న మాట! కానీ, ఇది వరకు పరాత్పర రావు మాత్రమే నీకు అడ్డంకి! వాయువుకి అగ్నిలా, ఆయనకు ఇప్పుడు మాధురి గూడ తోడయింది. ఒకవేళ నీ భర్త నిన్ను నిరాకరిస్తేనో?"

"అది నా దురదృష్టం అనుకుని ఈ యింటినుంచి శాశ్వతంగా దూరంగా వెళ్ళిపోతాను. ఇంతకీ ఆయనకు నాపై ఎలాంటి అభిప్రాయం వుందో తెలుసుకోవాలి గదా!" కోమలి నిరాశగా అంది.

సరళ థర్మామీటరూ మరికొన్ని మందులూ తీసుకుని లక్ష్మణరావు గదిలోకి నడిచింది.

సరళ కుర్చీలాక్కొని లక్ష్మణరావు బెడ్ కి దగ్గరగా కూర్చుంది. పేషెంట్ ని కనిపెట్టుకుని వుండే బాధ్యతను స్వీకరించింది.

మరో పావుగంట గడిచింది. ఇద్దరు వ్యక్తులు ఆ గది లోకి ప్రవేశించారు.

అందులో ఒకరు డాక్టరు డ్రెస్‌లో వున్నారు. అతడే డాక్టర్ శేఖరం అయివుండాలి అనుకుంది సరళ. పొడుగ్గా, సన్నగా వున్నాడు. నుదుటిమీద ముడతలూ, కళ్ళక్రింద గుంటలూ అతడు నడివయసు దాటినవాడని చెప్పకనే చెబుతున్నాయ్.

రెండో వ్యక్తి పోలీసు అధికారి. సబ్ ఇన్స్పెక్టర్. కోరమీసాలూ, ఎర్రగా యూనిఫారంలో హుందాగా వున్నాడు.

సరళ లేచి నిల్చుంది. డాక్టర్ శేఖరం ఆమెవంక చూసి, పేషెంట్ మీదకు దృష్టి మరల్చుకున్నాడు.

"నేను చెప్పాను కదూ? అతడిపై ఎవరూ హత్యా ప్రయత్నం చెయ్యలేదు. పొరపాటున తుపాకి పేలింది. అతడు గాయపడ్డాడు. అంతే!" చిన్న స్వరంలో ఇన్స్పెక్టర్‌కి నచ్చచెప్పేయత్నంలో వున్నాడు డాక్టర్.

కానీ పోలీసులకు అనుమానాలెక్కువ. డాక్టర్ మాటల్ని సబ్ ఇన్స్పెక్టర్ నమ్మినట్టుగా కనిపించలేదు.

"ఏదీ ఆ తుపాకీని, బుల్లెట్‌ని చూపించండి!" అన్నాడు అధికారస్వరంలో.

"అది అసాధ్యం!" జేబులోంచి హ్యాండ్ కర్చీఫ్ తీసి నుదుటి మీద చెమటను తుడుచుకుంటూ అన్నాడు డాక్టర్ శేఖరం. "ఆపరేషన్ చేసి బుల్లెట్ తీశాను. కాని, అది ఎక్కడో పోయింది. తుపాకి గూడా మాయమయింది. ఇది ఎలా జరిగిందో మాకే అంతు పట్టటంలేదు."

"అలాగేం?" అన్నాడు ఇన్స్పెక్టర్ పొడిగా. "ఈ ప్రమాదం నిన్న రాత్రి జరిగిందా?"

"అవునండీ! ఆ సమయంలో ఈ ఇంట్లో వంటవాడు

కోశయ్యా వంటగది సర్దుతున్నాడు. నౌకరు కన్నయ్యా వివేకానంద, మధుమూర్తి వాళ్లోవున్నారు. తుపాకీ ప్రేలుడు విని బయటకు పరుగెత్తారు. అక్కడ తోటలో లక్ష్మణరావు గాయంతో పడివున్నాడు. అందరూ సాయం పట్టి అతడ్ని లోపలకు చేర్చి నాకు కబురు చేశారు. నేను వచ్చిన వెంటనే ఆపరేషన్ చేసి బుల్లెట్‌ను తీశాను. వెను వెంటనే మీకు రిపోర్టిచ్చాను."

"సరే! ఇంట్లో అందర్నీ నేను ప్రశ్నించి తెలును కుంటాను. ఒకరిపై ఒకరికి ద్వేషాలు ఏవైనా ఉన్నాయా, ఈ ఇంటిలోని సభ్యుల్లో?" ఇన్స్పెక్టర్ టోపీ తీసి చేత్తో తల నిమురుకుంటూ అడిగాడు.

"మీ రెవర్నీ ప్రశ్నించే అవసరం వుండదు. ఎందుకంటే అందరూ నమ్మకమైన వారే!" డాక్టర్ శేఖరం తొందర పడ్డాడు.

"ఆ విషయం మాకు నమ్మకం కుదరాలి గదా!" అంటూ ఇన్స్పెక్టర్ బయటకు నడిచాడు.

## 4

"నర్స్!" ఎక్కడో నూతిలోంచి వచ్చినట్టుగా హీన స్వరంలో పిలుపు వినవచ్చింది.

నర్స్ సరళ బెడ్ దగ్గరకు వెళ్ళింది. బెడ్ మీద పేషెంట్ లక్ష్మణరావు కళ్ళు తెరిచాడు. అతడు చాలా నీరసంగా వున్నాడు. అతికష్టం మీద, బలాన్నంతా కూడగట్టుకుని మాట్లాడడానికి ప్రయత్నిస్తున్నాడు.

"నర్స్! కోమల అంటున్నారేమిటి?"

"మీరు మాట్లాడగూడదు. కోమల అనే మరో నర్స్ నాతోగూడా వచ్చింది."

"ఆమెను పిలవండి! నాకు స్పృహ తప్పేలోపల ఒక్కసారి ఆమెను కళ్ళారా చూడనివ్వండి!" బ్రతిమాలు తున్నట్టుగా అన్నాడు.

అంతలోనే కోమలి డ్రెస్ వేసుకుని ఆ గదిలోకి వచ్చింది. ఎన్నో యుగాల వియోగానంతరం కలుసుకున్న ప్రేమికుల్లా ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకున్నారు. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు లక్ష్మణరావు.

"వచ్చావా కోమలీ! జన్మలో మళ్ళీ నిన్ను చూస్తాననుకోలేదు. మా నాన్న, మాధురి ఆడిన నాటకంలో నిన్ను నేను కోల్పోయాను."

కోమలి పెదవులు వణికినయ్. "అంటే...అంటే మీకింకా నాపైన దయ వున్నదన్నమాట!"

లక్ష్మణరావు మళ్ళీ తెలివి తప్పిపోయాడు. కళ్ళు మూతలు పడగా, తల ప్రక్కకు వాల్చివేశాడు.

కోమలి ఆతృతగా "ఏమండీ!" అంటూ అతడ్ని కదిలించింది.

సరళ కలుగజేసుకుంది. "కోమలి! మీ భార్యాభర్తల అనురాగంలో నీ డ్యూటీని మర్చిపోతున్నావ్.

అతడు ప్రస్తుతం మృత్యుదేవత ఒడిలో చెలగాటమాడ బడుతున్నాడు. అతడ్ని ముందు దక్కించుకోవాలి."

ఇంజెక్షన్ సిరెంజిలోకి మందు ఎక్కించి, లక్ష్మణ రావుకు ఇంజెక్షన్ ఇచ్చింది సరళ.

కోమలి అతడి దగ్గరే కూర్చుంది, అతడి ముఖంలోకే చూస్తూ.

నౌకరు కన్నయ్య గది వాకిట్లో ప్రత్యక్షమయ్యాడు. "పెద్దయ్యగారు నిన్ను రమ్మంటున్నారు" అన్నాడు సరళ వంక చూస్తూ.

సరళ, కోమలి యిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసు కున్నారు. "ఆయన దగ్గర నేను వుంటాన్లే! నువ్వు వెళ్ళిరా!" అంది కోమలి.

సరళ, నౌకరు కన్నయ్య వెనుకే నడిచింది.

మరో పెద్దగదిలో నాలుగు ప్రక్కలా సోఫాలూ, మధ్యలో టీపాయ్ వున్నాయ్, ఒకవైపు సోఫాలో పరాత్పరరావు కూర్చుని వున్నాడు. వాడిచూపులూ, తెల్లని గుబురు మీసాలూ, సిల్కు లాల్చీ, మెడలో బంగారు గొలుసుకు వ్రేలాడుతున్న పులిగోరు మనిషి హుందాగానూ, భీకరంగానూ వున్నాడు.

"నా కొడుకు జీవితాన్ని పాడు చేసిన యువతి మళ్ళీ నర్సురూపంలో ప్రవేశించిందని మాధురి చెప్పింది. ఆమె ఈ ఇంట్లో మరొక్క క్షణం గూడా వుండటానికి వీల్లేదు. ఆమె స్థానే మరో నర్స్ వచ్చేదాకా, నీవే పేషెంట్ ని కనిబెట్టివుండాలి. నీవు భోజనానికి దానికీ వెళ్ళినప్పుడు మరెవరన్నా చూస్తారులే!"

తన మాటే వేదం అన్నట్టుగా అతడు చెప్పుకు పోతున్నాడు.

"క్షమించాలి! ఆమె గూడా నాతోబాటు వుంటుంది" అంది సరళ నిదానంగా.

పరాత్పరరావు ఈ హఠాత్పరిణామానికి కొంతఆశ్చర్య పోయాడు.

"ఏమంటున్నావ్?" మేఘ గర్జనలా వచ్చింది ప్రశ్న.

"కోమలిని పంపేందుకు వీలులేదు. ఆమె నాతోటే వుంటుంది. ఇక పేషెంట్ ని ఇరవయ్ నాల్గంటలూ కని బెట్టుకుని వుండాలంటే, ఇద్దరు నర్సులు తప్పనిసరి!"

"నీకు కావలసింది మరో నర్స్! అంతే! రేపీపాటికి ఇంకో నర్స్‌ని రప్పిస్తాం!"

"చూడండి! మీ కొడుకు బ్రతకాలని గనుక వుంటే కోమలి ఇక్కడ వుండడం అవసరం!" సరళ మాటలు అతడి మనసుకు నాటుకున్నాయ్.

"డాక్టరు ప్రాణాపాయం లేదన్నాడే?"

"ప్రాణం పోయేవరకూ డాక్టర్లు అలాగే చెబుతుంటారు. ఇంకా ఇరవయ్‌నాలుగు గంటలు గడిస్తే కానీ ఏ సంగతీ నిర్ధారించి చెప్పలేం. అదీగాక అతడికి తెలివి వచ్చిన కొద్ది క్షణాల్లో కోమలిని చూసి గుర్తించటం జరిగింది."

పరాత్పరరావు ముఖంలో రంగులు మారాయ్.

అతడు కన్నయ్యను కేక వేశాడు. కన్నయ్య వచ్చాడు. "వెళ్ళి కోమలిని పిలుచుకురా!" అన్నాడు.

సరళ అక్కన్నుంచి కదలబోయింది.

"నువ్వు ఇక్కడే వుండు!" అన్నాడు పరాత్పరరావు.

కొద్ది క్షణాల్లోనో కోమలి వచ్చింది.

ఆమెవంక తినేసేలా చూశాడు. "మళ్ళీ ఏముఖం పెట్టుకు వచ్చావ్?"

"కేవలం నర్సుగా, ఒక పేషెంట్‌కి సేవ చేసేందుకే వచ్చాను."

"కాదు. ఈ నెపంతో మళ్ళీ వాడ్ని వలలో వేసుకోవాలని వచ్చావ్. కానీ, నీ ఆటలు సాగనివ్వం. నీవు ఎంత త్వరగా ఈ యింటినుంచి వెళ్ళిపోతే అంత మంచిది."

"నేను కేవలం నర్స్‌గా వచ్చాను. మీ కుమారుడంటే మీకు ఎంత మమకారమో నాకూ భర్త అంటే అంతటి

అనురాగం ఉంటుందనే విషయాన్ని మరిచారు. అదే మరొక స్త్రీ అయితే, మీరు నాకు చేసిన ద్రోహానికి మిమ్మల్ని నిలువునా హత్య చేసివుండేది" కోమలి కంఠం జీరబోయింది. కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయ్. పెదాలు వణుకుతున్నాయ్. ఆవేశంతో రొమ్ములు ఎగసి పడు తున్నాయ్.

చివాలున వెనుదిరిగి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

పరాత్పరరావు అవాక్కై ఆమె వైపే చూస్తుండి పోయాడు.

ఒక్క క్షణం తర్వాత సరళ గూడా అక్కడ్నుంచి కదిలింది. మేడమెట్లెక్కుతూండగా మరో వ్యక్తి తార సిల్లాడు.

ఆ వ్యక్తి ఎర్రగా వున్నాడు. పిల్లి కళ్ళు, అందమైన ముఖం ఎటువంటి వారినైనా ఆకర్షించేలా వున్నాడు.

"చూడు నర్స్! లక్ష్మణరావుకు ప్రాణాపాయం లేదు గదా!" అని అడిగాడు. అతని మాటలు వీణ మీటినట్లు శ్రావ్యంగావున్నయ్.

సరళ ఒక్క క్షణం తనను తాను సంబాళించుకుంది.

"ప్రాణాపాయం లేదనే అనుకుంటున్నాను."

"అతడికి తెలివి వచ్చినప్పుడు ఎవరు కాల్చిందీ చెప్పాడా! బహుశా అతడికి తప్పక తెలిసేవుండాలి."

"లేదు. ఏమీ చెప్పలేదు."

# 5

సరళ పేషెంట్ రూంలోకి వచ్చింది. కోమలి బెడ్ కి ప్రక్కనే కుర్చీలో కూర్చుంది. అరచేతుల్లో ముఖం పెట్టుకుని తన భర్తవంకే, చట్టం ప్రకారం మాజీ భర్తవంకే చూస్తున్నది.

"రాత్రి పదీ, పదకొండు గంటలకు నన్ను లేవు. నీవు నిద్రపోదువుగాని నేను కనిపెట్టుకుని వున్నప్పుడు. ఈ లోపల నేను భోజనం చేసి నిద్రపోయిలేస్తాను." కోమలికి చెప్పి సరళ తన రూమ్‌కి బయలుదేరింది.

భోజనం పూర్తికానిచ్చి బెడ్ మీద వాలింది సరళ. కోమలి స్థితిని తల్చుకుంటూంటే, జాలీ, సానుభూతీ కలుగుతోంది. ఆమె జీవితంలో చెర్లాటమాడుకున్న ఈ ఇంటిలోని వ్యక్తుల్ని చూస్తుంటే సరళకు కోపం వస్తున్నది. నిద్ర రావటంలేదు. కిటికీలోంచి చూస్తుంటే నక్షత్రాల వెలుగులో తోట కనుపిస్తోంది.

అంతలో ఎవరో మనిషి తోటలోకి రావటం గమనించింది.

సరళ ఆ వ్యక్తి ఎవరో కళ్ళు మూసుకునైనా చెప్పగలదు. ఆ వ్యక్తి కోమలి. ఆమె చెట్లపాదల్లో దేనికోసమో వెదుకుతున్నది.

సరళ ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసుకుని చీకట్లోకి చూసింది. కొద్దిసేపట్లో ఆ ఆకారం వెళ్ళిపోయింది.

సరళకు కోమలిపైగూడ అనుమానం కలిగింది. ఈ ఇంట్లోకి తిరిగి ప్రవేశించిన కోమలి మనసులో ఏదో దురభిప్రాయం వుందనుకుంది.

బెడ్ మీదకు వాలింది ఆలోచనల్లో. కంటిమీద కునుకు పడుతూండంగా, ఎవరో స్త్రీ పెద్దగా అరవటం విన్పించింది.

బెడ్ మీదనుంచి ఒక్క ఎగురుతో లేచింది సరళ. ఆ కంఠం కోమలిదే అనుకుంది.

తలుపుతీసి ఆ ఆక్రందన వచ్చినవేపు పరుగెత్తింది.

పరాత్పరరావు గది తలుపు తీసి వుంది. లోపల పెద్ద లైటు వెలుగుతోంది.

సరళ గడపలో అడుగుపెట్టింది. నేలమీద పరాత్పర రావు పడిపోయి వున్నాడు. అతడి రెండు చేతులు అతడి ఛాతికి అదిమిపట్టినయ్. గుండెపోటు భరించలేక తన్నుకు లాడినవాడిలా కనుపించాడు.

అతడి ప్రక్కనే కోమలి నిలబడి ఉంది. ఆమె చేతిలో ఇంజెక్షన్ సిరెంజి ఉంది.

"సరళా! నేనాయన్ని చేతులారా చంపాను!" బావురు మంది కోమలి, సరళను చూస్తూనే.

అంతలో మిగతా గదుల్లో వ్యక్తులు మేల్కొన్నట్టుగా అలజడి వినిపించింది. మనుష్యులు పరిగెత్తుకు వస్తున్నట్టు అడుగుల సవ్వడి వినవస్తోంది.

బహుశా కోమలి చేసిన ఆక్రందనకు వారంతా మేల్కొని వుండాలి.

"అతడ్ని చంపాలని కాదు. అతడికి సాయంచెయ్య బోయాను. కానీ అతడు తక్షణమే మరణించాడు..." ఆమె ఇంకా ఏదో చెప్పబోతోంది.

ఆ సమయంలో ప్రతి సెకనూ అతి విలువైనదని గ్రహించింది సరళ. ఆలోచనలకు, వాదాలకూ తావులేదు. కోమలి చేతిలోని సిరెంజిని లాక్కొని, తన జేబులో దాచేసింది.

మనుష్యులు చేరువలోకి వచ్చినట్టు పాదాల అలికిడి దగ్గిరౌతున్నది.

"ఏం భయం లేదు. వెంటనే డాక్టర్ని పిలిపిద్దాం!" అందరికీ వినిపించేలా అంది సరళ, కోమలి మాటల్ని కవర్ చేస్తూ.

# 6

ముందుగా గదిలోకి వచ్చిన వ్యక్తి వివేకానంద. అతడి వెనుకే కన్నయ్య, మాధురీ వచ్చారు.

"ఏం జరిగింది?" వివేకానంద ఆత్రుతగా అడిగాడు' పరాత్పరరావు చెయ్యి పట్టుకుని చూశాడు. "ప్రాణం పోయిందనుకుంటాను!. హార్ట్ఎటాక్ వచ్చి వుంటుందా?" అన్నాడు మళ్ళీ.

"హార్ట్ ఎటాక్కే అయి వుంటుంది." సరళ బదులు చెప్పింది. "త్వరగా డాక్టర్ గార్ని పిలిపించండి!"

"ఈ ఇంటికి శనిలా దాపురించావు కదే! హరి దేవుడా? నా మొగుడ్నెత్తుకు పోయావు గదరా!" మాధురి శోకాలు పెట్టసాగింది.

"కోమలీ! నీవు వెళ్ళి డాక్టర్ గార్ని పిల్చుకురాత్వరగా!' కోమలిని అక్కడ్నుంచి పంపేయటం మంచిదనుకుంది సరళ.

కోమలి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది.

మరికొద్ది నిముషాల గడిచేక సరళగూడ అక్కడ్నుంచి వచ్చేసింది. "ఏదీ డాక్టరుగారు ఇంకా రాలేదేం? నేనన్నా వెళ్ళి పిలిచి వస్తాను" అంటూ.

కారిడర్లోంచి పోతూ, లక్ష్మణరావు రూమ్లోకి చూసింది. అతడి గది తలుపు బార్లా తెరచి వుంది. బెడ్ మీద లక్ష్మణరావు లేడు. బెడ్ ఖాళీగా వుంది.

పేషెంట్ ఏమయాడా అని కారిడార్లోనే నిల్చుని అటూ యిటూ చూసింది. కారిడార్ చివర మెట్లున్నయ్. అక్కడ చీకట్లో ఎవరో ఉన్నట్టుగా తోచింది. ఆత్రుతగా అక్కడకు పరుగెత్తింది సరళ. లైటు స్విచ్ నొక్కాలన్న

ఆలోచనగూడ రాలేదు ఆమెకు ఆదుర్దాలో.

మెట్లదగ్గర లక్ష్మణరావు పడిపోయి వున్నాడు. అతడ్ని లేవదీయటానికి యత్నిస్తోంది కోమలి.

"కోమలీ! ఏమయింది?"

"అదే నాకూ తెలీదు. డాక్టరుకోసం వస్తూంటే, ఈ గదిలో బెడ్ ఖాళీగా వుంది. ఆయనకోసం వెతుక్కుంటూ వచ్చాను. ఇక్కడ నేలమీద పడి వున్నాడు ఆయన."

సరళ కారిడర్‌లో స్విచ్ నొక్కింది. లైటు వెలిగింది. పడిపోయిన లక్ష్మణరావు తలపై పెద్ద బొప్పి వుంది. ఎవరో అతడ్ని తలపై బాది వుండాలి వెనుకనుంచి. అతడు ఆ దెబ్బకు స్పృహతప్పి పడిపోయాడు.

సరళ, కోమలి కలిసి అతడ్ని పైకెత్తారు. నెమ్మదిగా తీసుకువచ్చి బెడ్‌మీద పడుకోబెట్టారు.

కోమలి అతడి తలపై బొప్పికి మందురాచింది. సరళ లక్ష్మణరావుకి స్మెల్లింగ్ సాల్ట్ వాసన చూపింది.

లక్ష్మణరావుకి తెలివి వచ్చింది. "మా నాన్న గదిలో అరుపు విని నాకు ఆదుర్దా వేసింది. ఎలాగో లేచి నడుస్తున్నాను. వెనుకనుంచి ఎవరో తలపై కొట్టారు. నేను పడిపోయాను."

కారిడర్‌లో అడుగుల చప్పుడు వినవచ్చింది. సరళా, కోమలీ అటుగా చూశారు.

డాక్టర్ శేఖరం పెద్ద పెద్ద అంగలతో వెళ్తున్నాడు. సరళ గూడా అతడి వెనుకనే వెళ్ళింది.

పరాత్పరరావు నాడినీ, గుండెనూ పరీక్షించాడు డాక్టర్.

"ప్చ్! ప్రాణం పోయింది. హార్ట్ ఎటాక్ గనుక వసే

వేసుకునేందుకు బిళ్ళలూ, మరో ఇంజెక్షన్ సిరెంజీ రెడీగా అతడి డ్రాయర్లోనే, అందుబాటులో వుంటాయే!'' డాక్టర్ అనుమానంగా చూశాడు.

''అవును! కానీ మందు వేసుకునే వ్యవధిగూడ లేదేమో పాపం!'' వివేకానంద సానుభూతి చూపాడు.

డాక్టర్ వంగి చూశాడు పరాత్పరరావు చేతిని. ముంచేతి దగ్గర ఇంజెక్షన్ చేసినట్టుగా, ఇప్పుడిప్పుడే చెరిగిపోతున్న సన్నని గుర్తు కనుపించింది.

అతడికి అనుమానం వచ్చినవాడిలా డ్రాయరు తెరిచి చూశాడు. డ్రాయర్లో టాబ్లెట్స్ లేవు. ఇంజెక్షన్ బాటిల్, సిరెంజిగూడ మాయమయినై.

''ఇది ఎవరో కావాలని చేసిన పనే! అతడికి అందుబాటులో ఉన్న మందుల్ని మాయంచేశారు. ఆ తర్వాత ఆయనకు ఉద్రేకం తెప్పించి వుంటారు! అంటే చేతులారా ఆయన్ని హత్యచేసినదానిక్రిందే లెక్క!'' డాక్టర్ శేఖరం పిచ్చిగా అరిచాడు.

''మనందరం వీలైనంత త్వరగానే వచ్చాం. ఇంతలోనే మన కళ్ళుగప్పి హంతకుడెలా మాయమవుతాడు?'' వివేకానంద ప్రశ్నించాడు.

అతడి ప్రశ్నకు అందరూ తలూపారు.

అంతలో అక్కడికి పోలీస్ ఇన్స్పెక్టర్, మరో నలుగురు కానిస్టేబుల్స్ వచ్చారు.

''ఈ ఇంట్లో హత్య జరిగిందని ఎవరో మాకు ఫోన్ చేశారు కొద్దిక్షణాల క్రితం!'' అన్నాడు ఇన్స్పెక్టర్ అక్కడున్న అందర్నీ ఉద్దేశించి.

అందరూ ఒక్కక్షణం నివ్వెరపోయారు. పరాత్పర

రావు మరణవార్త ఇంకా ఈ ఇంట్లోనే అందరికీ తెలియదు. అటువంటిది అప్పుడే ఈ విషయం పోలీసులదాకా ఎలా వెళ్ళింది? ఎవరు ఫోన్ చేసి వుంటారు ఇంతలోనే?

"ఏదో పొరబాటు జరిగింది. మీరన్నా చెప్పండి!" మాధురి తొట్రుపాటుతో అంది డాక్టర్ వంక చూస్తూ.

"అవునవునండీ! ఈయనకు నేను ఫామిలీ డాక్టర్ని. ఈయనకు తరచూ గుండెపోటు రావడంకద్దు. బహుశా ఈదఫా ఎక్కువ మోతాదులో సీరియస్ గుండెపోటు రావడంతో అతడు మరణించాడు. అంతేకానీ ఇది హత్య మాత్రం కాదు సార్!" డాక్టర్ శేఖరం అన్నాడు.

"అవచ్చు! కానీ మాకు అలా ఎందుకు ఫోన్ చేశారు?"

"డాక్టర్ గారు చెప్పేది నిజమేనండీ! మావారు హత్య చేయబడలేదు. గుండెపోటువల్లనే మరణించారు. బహుశా మీకు వచ్చిన ఫోన్ కాల్ మరెవరింట్లో గురించేమో" అంది మాధురి.

"అట్లా పొరబాటు జరిగేందుకు వీలులేదు. ఫోన్ కాల్ రిసీవ్ చేసుకుంది నేను! ఎవరో స్త్రీ కంఠం! ఇదే ఇంటి నంబరు ఇచ్చింది."

ఆపైన ఎవరూ మాట్లాడేందుకు సాహసించలేదు.

"ప్రమాదం జరిగాక ముందుగా చూసిందెవరు?" అందరివంకా చూస్తూ అడిగాడు ఇన్స్పెక్టర్.

"నేనండీ!" సరళ ముందుకు వచ్చింది. "జబ్బుగావున్న లక్ష్మణరావుకి పరిచర్యలు చేసేందుకు నేనూ, మరో నర్స్ కోమలీ నిన్ననే వచ్చాం!"

"లోగడ లక్ష్మణరావుని ప్రేమించి పెళ్ళాడి, మళ్ళీ విడాకులిచ్చిన కోమలే గదూ?"

సరళ మనస్సు చివుక్కుమంది. ఈ కోమలి సమాచారం క్షుణ్ణంగా తెలుసుకునే వచ్చాడన్నమాట ఇన్స్పెక్టర్. సాక్ష్యాలనుబట్టి చూస్తే కోమలిపై ఈ హత్యానేరం పడేలాగుంది. ఆమెను సరళ రక్షిద్దామని ఎంత తాపత్రయ పడుతున్నదో, సాక్ష్యాలు అంతగా కోమలికి వ్యతిరేకంగా ఉన్నయ్.

"ఆ గొడవకూ, ఈ మరణానికీ ఏం సంబంధంలేదండీ!" డాక్టర్ శేఖరం గుర్రుగా అన్నాడు ఇన్స్పెక్టర్ వంక చూస్తూ.

"పరాత్పరరావు చనిపోంగానే ముందు చూసిం దెవరు?" ఇన్స్పెక్టర్ అడిగాడు.

"నేనేనండీ! నేనతడ్ని సమీపించేసరికే అతడి ప్రాణం పోయింది. కోమలి నాకన్న ఒక్క అడుగు ముందువచ్చింది నా తర్వాత వివేకానంద వచ్చారు."

"కొద్ది రోజుల క్రితం కొడుకుని కాల్చారెవరో! ఈ రోజున తండ్రి మరణించాడు. ఈ రెండు సంఘటనలకూ సంబంధం వుండి తీరాలి. అంతకు ముందు తండ్రీ కొడుకులు ఘర్షణపడ్డారు గదా?" ఇన్స్పెక్టర్ డాక్టర్ని ప్రశ్నించాడు.

"తండ్రీకొడుకుల మధ్య విభేదాలు అనేకం వుండవచ్చు. కానీ ఆ విభేదాలు ఒకరినొకరు చంపుకునేటంతటివి కాదు!"

"కొడుకు తండ్రిపై కసి తీర్చుకోటానికి నిర్ణయించుకున్నాడు. తనను తానే కాల్చుకుని మంచమెక్కాడు. స్వస్థత లేనివాడిలా నటిస్తూ, అదను చూసి తండ్రిప్రాణం తీశాడు..."

"ఇన్స్పెక్టర్ ఇది మరీ దారుణం! మీ ఆరోపణ సమంజసమైంది కాదు!" అన్నాడు డాక్టర్ శేఖరం.

"లక్ష్మణరావు ఈ హత్య చేయలేదనటానికి ఎలిబీ వుంది. అతడ్ని అనుక్షణం అంటిపెట్టుకుని నేనో, కోమలో కాచుకునివున్నాం," అంది సరళ.

ఇన్స్పెక్టర్ ఆమెవంక కొరకొర చూశాడు.

"సరే! మా విచారణ ముగిసేవరకూ, ఎవరూ ఈ ఇంటి ఆవరణదాటి పోరాదు. మృతదేహాన్ని శవపరీక్షకు పంపండి డాక్టర్ శేఖర్! మీరుగూడ పరీక్ష చేసేటప్పుడు దగ్గరుండండి."

ఆ బంగళాకు గట్టి పోలీసు బందోబస్తు ఏర్పాటు చేయబడింది.

# 7

సరళ, లక్ష్మణరావు బెడ్ దగ్గరకు వచ్చింది.

లక్ష్మణరావు అడుగుల చప్పుడు విని కళ్ళు తెరిచాడు.

"నర్స్! ఏం జరిగింది?" అనడిగాడు.

"మీరు ఏ వార్తనూ సహించలేరు. మాట్లాడకుండా పడుకోండి!"

"నాకు తెలుసు నర్స్! ఏదో అనర్థం సంభవించిందని! నా తండ్రేనా చనిపోయింది?"

సరళకు ఇక తప్పనిసరి అయింది. పరాత్పరరావు మరణ వార్తను చెప్పింది. ఆ మరణాన్ని ఎవరో హత్యగా పోలీసులకు ఫోన్ చేశారని, విచారణ జరుగుతోందని తెలిసింది.

లక్ష్మణరావు కళ్ళు మూసుకున్నాడు గట్టిగా. అతడి మనసు బాధపడుతోందని గ్రహించింది సరళ. అతడికి మత్తు ఇంజెక్షన్ ఇచ్చింది విశ్రాంతి కోసం.

కోమలి రాగానే సరళ డ్యూటీ దిగింది. మరో గదిలోకి వెళ్తూ ఆగింది. ఆతృతగా వెనక్కు పరిగెత్తు వచ్చింది.

"ఏమయింది?" కోమలి అడిగింది.

"నీనుంచి లాక్కున్న సిరంజిని నా జేబులో పెట్టుకున్నానా? అంతలో పోలీసులు వచ్చారని తెలిసి, ఈ గది ప్రక్కనే కిటికీలోవున్న పాత గోతాల బొత్తిలో సిరంజిని దాచాను. అది మన దగ్గరవుంటే పోలీసులు వెదికి తీసుకుంటారేమో అని అలా చేశాను. పోలీసులు వెళ్ళాక దాన్ని తిరిగి తీసుకోవచ్చు గదా అనుకున్నాను. తీరా ఇప్పుడక్కడ చూస్తే సిరంజి మాయమయింది" సరళ తన ఆతృతను వెళ్ళబెట్టింది.

అది గనుక శత్రువు చేతిలో బడితే, దానిమీద కోమలి వేలిముద్రలు స్పష్టంగా వుంటయ్ గనుక, దాన్ని పోలీసులకు ఇవ్వకుండా ఊరుకోడు. ఆ తర్వాత కోమలి ఉరికంబమెక్కటమో, లేక యావజ్జీవ కారాగార శిక్ష పొందటమో జరిగి తీరుతుంది.

"అసలు నీవు లక్ష్మణరావుని కనిబెట్టుకుని కూర్చోవలసిన దానివి పరాత్పరరావు గదిలోకి ఎందుకు వెళ్ళినట్టు?" నిలదీసి అడిగింది.

ఆ ప్రశ్నకు కోమలి తొట్రుపడ్డది. "మరేం లేదు నా భర్తకు నయమయేదాక నన్ను వుంచమని ప్రాధేయపడటానికి వెళ్ళాను. మాట్లాడుతూండగానే ఆయనకు గుండె పోటు వచ్చింది. డ్రాయర్లో సిరెంజీ, ఇంజెక్షన్ బాటిల్ తెచ్చి ఇంజెక్షనివ్వమని బ్రతిమిలాడాడు పరాత్పరరావు తమ మధ్య ఎన్ని విభేదాలున్నా కసి తీర్చుకోను అది సమయం కాదన్నాడు. దాంతో నాకు జాలేసింది.

డ్రాయరు తెరిచి ఇంజెక్షన్ యిచ్చాను ఆయనకు. మందు అతడి శరీరంలోకి ఎక్కుతూండగానే అతని ప్రాణం పోయింది,'' కోమలి నేలచూపులు చూస్తూ చెప్పింది.

ఆమె పూర్తిగా నిజం చెప్పటంలేదనిపించింది సరళకు.

# 8

మర్నాడుదయానికి మళ్ళీ ఇన్స్పెక్టర్ వచ్చాడు. పాలిపోయిన ముఖంతో డాక్టర్ శేఖరంగూడ అతడి వెంటనే వచ్చాడు.

"పరాత్పరరావుగారికి ఎవరో పాయిజన్ ఇంజెక్షన్ యిచ్చారు. బహుశా హంతకుడుకి బాగా తెలిసివుండాలి. ఆయనకు గుండెపోటు వచ్చినప్పుడు ఇంజెక్షన్ తీసుకుంటూ వుంటాడని! ఆ ఇంజెక్షన్ మందుసీసాలో విషాన్ని ఎక్కించి సీసాని మామూలు స్థానంలో వుంచాడు.

"పరాత్పరరావుకి గుండెపోటు రాగానే, అలవాటు ప్రకారం ఇంజెక్షన్ పుచ్చుకున్నాడు. లేదా ఎవరైనా ఆయనకు ఇంజెక్షన్ యిచ్చివుంటారు. కనుక ఈ కారణాల వల్ల పరాత్పరరావు ప్రమాదవశాత్తు మరణించలేదనీ, ఎవరో అతన్ని హత్య చేశారనీ రూఢి అవుతోంది.

"అయితే ఈ ఇంజెక్షన్ని ఎవరు చేశారూ అనేది మొదటి ప్రశ్న! కోమలీ, సరళా! మీ ఇద్దరిలో ఎవరైనా చేశారా?"

"లేదండీ!" ఇద్దరూ ఏక కంఠంతో చెప్పారు.

"మిస్టర్ వివేకానంద్! నర్సుల వెనకాల నీవు వచ్చావ్ కదూ? నీవు ప్రవేశించినపుడు వాళ్ళచేతిలో ఇంజెక్షన్ సిరెంజ్ వుందా?" అక్కడే వున్న వివేకానందని ప్రశ్నించాడు ఇన్స్పెక్టర్.

సరళ, కోమలి ఊపిరి బిగబట్టారు, వివేకానంద్ ఏం చెబుతాడో అని!

"లేదండీ! వారి చేతుల్లో ఇంజెక్షన్ సిరెంజ్ లేదు" బల్లగుద్దినట్టుగా చెప్పాడు వివేకానంద్.

"అయ్యా! ఇన్స్పెక్టర్ గారూ! మమ్మల్నందర్నీ మీ ప్రశ్నలతో విసిగించకండి. ఈ యింటి పరువుప్రతిష్టలు కాపాడండి! పరాత్పరరావుని హత్య చేసేందుకు మోటివ్ ఒక్క కోమలికే వుంది. నలుగురికే వినబడేలా ఆయన్ను హత్య చేస్తానంది నిన్న," భద్రకాళిలా అరిచింది మాధురి.

అక్కడున్నవారంతా నిశ్చేష్టులయారు.

"ఏమంటావ్ కోమలి! పైగా నీ గది సోదాలో నీ బ్యాగ్‌లో రివాల్వర్ దొరికింది. రాత్రిపూట రివాల్వర్‌తో పరాత్పరరావు గదిలోకి వెళ్ళావ్. అతడ్ని బెదిరించి నీ వెనుకటి స్థానాన్ని సంపాదించుకోవాలని యత్నించావ్. ఆ రకంగా పరాత్పరరావులో ఉద్రేకాన్ని కలిగించావ్.

ఉద్రేకంలో ఆయనకు గుండెపోటు వచ్చింది. అంతకు ముందే సిద్ధం చేసుకునివున్న పాయిజన్‌ని ఆయనకు సేవ చేసే దానిలా నటిస్తూ, ఇంజెక్షన్ యిచ్చావ్. ఆ మందు సీసా ఇంజెక్షన్ సిరెంజీగూడా దొరికితే, నిన్ను కటకటాల్లోకి తోయిస్తాను."

మౌనంగా వింటున్న నౌకరు కన్నయ్య కలుగజేసుకున్నాడు.

"అవునండీ! అయ్యగారి గదిలోకి ఈమె వెళ్ళటం నేను చూశాను. ఇద్దరూ పెద్దగా ఘర్షణపడ్డారు. పెద్దోళ్ళ తగవుల్లో నాకెందునాలే అని నేను మెట్లుదిగి వచ్చేశాను. ఇంత ఘోరం జరుగుతుందని వూహిస్తే, ఆమెను అప్పుడే

తన్ని తగిలేసేవాడ్ని. పెద్దయ్యగారన్నా దక్కేవారు!" కన్నయ్య చెప్పటం ముగించి చిర్రున చీదేశాడు, సన్నగా ఏడుస్తూ.

"మిస్ కోమలీ! పరాత్పరరావుగారి రివాల్వర్ నీ గది లోకి ఎలా వచ్చింది? దీనికి నీ సంజాయిషీ ఏమిటి?" ఇన్స్పెక్టర్ కోమలివంక చూస్తూ అడిగాడు.

మాధురి కళ్ళు విజయగర్వంతో మెరుస్తున్నాయ్.

"లక్ష్మణరావుని ఎవరో కాల్చారు. ఆ రివాల్వర్ దొరక లేదని డాక్టరుగారు చెప్పారు. బహుశా అగంతకుడు ఆయన్ని కాల్చి, కంగారులో రివాల్వర్ని ఆ దరిదాపుల్లోనే పారేసి వుండాలని ఊహించాను. నిన్న రాత్రి ప్రొద్దు పోయాక తోటలోకి వెళ్ళి వెదికాను. రివాల్వర్ ఒక పొదలో దొరికింది. అది పరాత్పరరావుగారిదే! ఆయన రివాల్వర్తోనే ఆయన కొడుకుని కాల్చారు. అంటే అగంతకుడు ఆ ఇంట్లో వ్యక్తే అయివుండాలని ఊహించాను ఆ విషయమే చెబుదామని వెళ్ళాను. అంతలో ఈఘోరం జరిగింది."

"నిన్ను చూడంగానే ఆయన కోపంతో అరిచి వుంటాడు. నీవూ రెట్టించివుంటావ్! దాంతో ఆయనకు గుండెపోటు వచ్చింది."

"నేనేం రెట్టించలేదు. నా భర్తకు స్వస్థత చిక్కే దాకా నన్ను ఈ యింట్లో వుండనివ్వమని బ్రతిమలాడాను అంతే!"

"ఇన్స్పెక్టర్ గారూ! ఆమెను వెంటనే అరెస్టు చేయండి! లేకపోతే అందరి కళ్ళు గప్పి పారిపోగల నెర జాణ అది!" అంది మాధురి ఈసడింపుగా.

"మా బాధ్యతల్ని ఒకళ్ళు గుర్తుచేయవలసిన పనిలేదు!" ఇన్స్పెక్టర్ కోపంగా మాధురివంక చూశాడు.

"ఇల్లంతా గాలించండి! ఇంజెక్షన్ బాటిల్, సిరెంజీ దొరికితే ఈ నాటకానికి తెర దిగుతుంది" కానిస్టేబుల్స్ని పురమాయించాడు ఇన్స్పెక్టర్.

"అయ్యా! ఇన్స్పెక్టర్ గారూ! దయచేసి లక్ష్మణరావు దగ్గిర గట్టి బందోబస్తు ఏర్పాటు చేయండి! ఆ హంతకు డెవరో ఆయన కే హాని తలపెట్టకుండా!" డాక్టర్ శేఖరం కలుగజేసుకున్నాడు.

లక్ష్మణరావు గదిలో కోమలి, సరళ మాత్రం వుండేం దుకు అనుమతించబడింది. గది బయట పోలీసు కాపలా ఏర్పాటు చేయబడింది.

# 9

లక్ష్మణరావుకి ఏవో మందులు కావల్సివుంది. డాక్టర్ శేఖరం సిటీకి వెళ్ళాడు, పరాత్పరరావు లాయరునుంచి వీలునామాను తెచ్చేందుకు.

మందుకోసం సరళ వెళ్ళవలసివచ్చింది. పోలీసుల అను మతి తీసుకుని బయులుదేరింది.

రోడ్డమ్మట కొంత దూరం నడిచాక, వెనుకనుంచి కారు వచ్చి ఆగింది. వివేకానంద కారుని నడుపుతున్నాడు.

"నేనూ టౌన్లోకే వెళ్తుంట! కారులో ఎక్కు!" అన్నాడు. సరళ కారులో ఎక్కి కూర్చుంది.

మందుల షాపు ముందు కారు ఆగింది. ఇద్దరూ షాపు లోకి వెళ్ళారు. సరళ మందుల్ని తీసుకుంది.

తర్వాత కారు ఒక హోటల్ ముందు ఆగింది. ఇద్దరూ లోపలకు వెళ్ళారు.

"ఇంతకీ పరాత్పరరావుని హత్య చేసేందుకు మోటివ్

ఎవరికి వున్నదో అంతుపట్టలేదు. ఆయన వ్రాసిన వీలునామా లోని వివరాలు తెలిస్తే, ఈ కేసు కొంతవరకూ అంతుబట్ట వచ్చు" సరళ కూల్ డ్రింక్ త్రాగుతూ అంది.

"నీకు తెలీదల్లేవుంది. ఆయన విల్లులో వ్రాసిన విష యాలు నాకూ, డాక్టర్ శేఖరానికి ఎప్పుడో తెలుసు."

"అలాగా! ఎవరెవరికి ఏ మాత్రం వ్రాశారో?"

"డాక్టర్ శేఖరానికి యాభైవేలు. వాళ్ళిద్దరూ చిన్నప్పట్నించీ స్నేహితులట. మిసెస్ శేఖరమే మొన్న మొన్నటిదాకా ఆ ఇంటి యజమానురాలిలా ప్రవర్తించేది. పరాత్పరరావుతో అక్రమసంబంధం వున్నదనికూడా ఒక వదంతి. మాధురి వచ్చాక మిసెస్ శేఖరం ఆట కట్టిందట."

"ఆ తీపిమీద డాక్టర్ కి యాభైవేలు యిచ్చాడన్న మాట!"

"అవును. నౌకరు కన్నయ్యాకూ, కోశయ్యాకు చెరో మూడువేలు. లైబ్రరీ రూంలోని కాశ్మీరు తివాసీ మ్యూజి యంకి బహూకరించాడు. ఊళ్ళో ధర్మసత్రానికి కొంత మిగతా ఆస్తిని భార్య మాధురి, కొడుకు లక్ష్మణరావులకు చెరిసగం పంచాడు."

"అయితే ఆ యింట్లో అందరికీ కాస్తో కూస్తో ముట్ట చెప్పాడన్నమాట! కానీ మాధురి తమ్ముడు మధుమూర్తికేం యిచ్చినట్టు లేదే?"

"పరాత్పరరావు బ్యాంకు ఎకౌంట్ పరిశోధించగా తెలిసిన విషయం ఏమిటంటే, పదిహేను ఇరయ్ రోజుల వ్యవధిలో మధుమూర్తి పేర పెద్ద మొత్తంలో చెక్కు లిచ్చాడు. అంటే అందులో ఏదైనా బ్లాక్ మెయిల్ వ్యవ హారం వుందా అని పోలీసులు అనుమానిస్తున్నారు."

డ్రింక్స్ త్రాగడం పూర్తి చేసి యిద్దరూ బయలుదేరారు. మూడువంతులు దూరం రాగానే, కారు ఆగిపోయింది. బోనెట్ ఎత్తి పరీక్షించాడు వివేకానంద్. "కారు చెడిపోయింది. ఎలాగ? పోనీ నీ వొక్కదానివీ వెళ్ళగలవా?"

"అలాగే వెళ్తాను. నాకేం భయంలేదు" సరళ బ్యాగ్ చేతిలో పుచ్చుకుని బయలుదేరింది.

# 10

రోడ్డు మెలికలు మెలికలు తిరుగుతోంది. రోడ్డు కిరుప్రక్కలా చెట్లున్నాయ్. సూర్యుడు అప్పుడు అస్తమించాడు. చీకట్లు అలుముకుంటున్నయ్. అరగంట నడిచి బంగళాకు చేరువయింది సరళ.

దగ్గరగదా అని తను ఈ రోడ్డుదోవన పడింది. తీరా వచ్చేక గానీ తెలీలేదు. చీకటిలో నిర్జనమైన ప్రదేశంలో ఒంటరిగా స్త్రీ వెళ్ళటం ఎంత ప్రమాదకరమైనది అనుకుంది సరళ.

ఎక్కడో ఎండుటాకులమీద ఎవరో నడిచినట్టుగా అలికిడి అయింది.

సరళ నిలబడిపోయింది. "ఎవరది?" అని అరిచింది, మేకపోతు గాంభీర్యంతో. బదులు రాకపోవడంతో మళ్ళీ బయలుదేరింది.

చుట్టుప్రక్కల కలయ జూసుకుంటూ భయంతో బిక్కుబిక్కుమంటున్న సరళ కాళ్ళకు ఏదో అడ్డుతగిలింది. ఆమె తూలి క్రిందపడబోయింది. ఎలాగో తమాయించుకున్నది.

ఏదో మూటలాంటిది పడివుంది రోడ్డుకడ్డంగా. దాన్ని తడిమి చూసింది సరళ. చేతికి తడి తగిలింది. ఆ తడి ఆమెకు చిరపరిచితమైనదే, నర్స్ పనిలో. అది రక్తం!

సరళ ఆ మాటను తప్పాకుని పరుగుదీసింది. పది నిము షాల్లో బంగళా గేటుదగ్గరకు వచ్చిపడింది.

ముందు తోటలో తిరుగుతున్న పోలీసులకు చెప్పింది సరళ.

"డొంకదోవలో ఎవరిదో శవం పడివుంది."

"మైగాడ్! మరో హత్యా! ఇంతమంది పోలీసులు యిక్కడ వుండగానే!"

ఈ వార్త బంగళా అంతటా వ్యాపించిపోయింది. జనం డొంకరోడ్డుమీదకు పరుగులు తీసింది.

అపుడే కారులో వివేకానంద్ వచ్చాడు "ఏం జరిగింది? ఏమయింది? అనడిగాడు."

"ఏమిటి సరళా! నీ చేతులకు రక్తం ఏమిటి?" అడిగింది మాధురి.

"ఆచీకట్లో అతడి శవం తగిలి పడబోయాను. నాచేయి అతడి శవం మీద ఆనింది!" సరళ బదులు చెప్పింది.

"ఛీ! ఛీ! ఈ నర్సులిద్దరూ వచ్చారు. స్వర్గధామం లాంటి ఈ బంగళాలో మృత్యువు విలయ తాండవం చేస్తున్నది. హత్యల మీద హత్యలు జరుగుతున్నయ్."

పోలీసులు వెళ్ళి శవాన్ని తెచ్చారు. అది డాక్టర్ శేఖరానిది. అతడ్ని చంపే అవసరం ఎవరికి కలిగివుండా లని అందరూ విస్తుపోయారు.

డాక్టర్ శేఖరం చాలా దారుణంగా హత్య చేయ బడ్డాడు. గొంతుదగ్గర నరాలు కత్తితో తెగకోయబడి, అతడు చనిపోయాడు. ఎంతటి కసిగల కసాయివాడయినా అంత దారుణంగా చంపడు.

# 11

ఆ మధ్యాహ్నం పోలీసు హెడ్‌క్వార్టర్స్ నుంచి ప్రత్యేకంగా మనిషి వచ్చాడు. రిజిస్టర్డ్ పార్సిల్ ఎవరో పంపారట పోలీస్ స్టేషన్‌కి. అందులో ఇంజెక్షన్ సిరంజీ, మందుసీసా వున్నయ్. ఆ రెండింటి మీద కోమలి చేతి వేలిముద్రలు వున్నట్టుగా పరీక్షలో తేలినయ్యట.

కోమలి పరాత్పరరావుకి విషాన్నిచ్చి చంపిందనే అభియోగంతో, ఆమెపై అరెస్టు వారెంటు ఇవ్వబడింది.

అయితే యిల్లంతా వెదికినా కోమలి కనుపించలేదు.

మరి కోమలి ఏమయినట్టు? సరళ ఆకులా వణికి పోయింది.

ఇన్స్పెక్టర్ చుట్టుపట్ల పోలీసు స్టేషన్‌కు మెస్సేజ్ పంపాడు, కోమలి కొరకై గాలించమని.

ఆలోచించిన కొద్దీ సరళకు భయంకర పరిణామాలే తోస్తున్నయ్. లక్ష్మణరావుని కాల్చిన హంతకుడు, పరాత్పరరావుని బలిగొన్న హంతకుడే ఆమెనూ అంతం చేశాడా? అందువల్ల అతడికి కలిగే లాభం ఏమిటి? తను చేసిన హత్యవల్ల కోమలి నేరస్థురాలిగా ఆరోపింపబడింది. కనుక కోమలి ఉరికంబం ఎక్కితే, హంతకుడు నిక్షేపంలా బ్రతికి బయటపడతాడు.

సరళ ఆలోచనల్లో పడి తనకు తెలియకుండానే బంగళా నుంచి చాలా దూరం నడిచివచ్చింది. బంగళాకు ఒక మూలగా చాల దూరంలో అదే ఆవరణలో గ్యారేజీ వుంది.

గ్యారేజీ తలుపులు దగ్గరగా వేసివున్నాయ్. తాళం వేసిలేదు. చప్పుడు కాకుండా తలుపు తెరుచుకుని లోపలకు వెళ్ళింది సరళ.

అదే సమయంలో గ్యారేజీ లోపలగా ఒక మూల తలుపు తెరుచుకుంది. సరళ పాతసామానుల వెనుక నక్కింది.

ఆ తలుపు గోడకున్నది కాదు. నేల మాళిగలోకి దారి తీసేది. అందులోనుంచి పనిమనిషి సుబ్బులు వచ్చింది. గ్యారేజీ తలుపు తెరుచుకుని బయటికి వెళ్ళిపోయింది. ఆమె చేతిలో స్టీలుగిన్నె వుంది.

బహుశా, లోపల ఎవరో బంధింపబడివుంటారు. వారికి ఆహారాన్ని తీసుకువెళ్ళేందుకు వచ్చింది సుబ్బులు.

సరళ నేలమాళిగ తలుపు తెరుచుకుని మెట్లు దిగి లోపలకు వెళ్ళింది. నేల అడుగున రహస్య మందిరం అది. అందులో మూడు గదులున్నాయ్. రెండు బెడ్ రూమ్‌లూ, ఒక డ్రాయింగ్ రూమ్.

ఆమె డ్రాయింగ్ రూమ్‌లో అడుగు పెట్టిందో, లేదో గ్యారేజీ తలుపు నెవరో తెరుస్తున్నట్టుగా అలికిడయింది. గోడవారగా వున్న కర్టెన్ల వెనుక నక్కింది సరళ. దొంగ చాటుగా నక్కి చూడసాగింది.

మరికొద్ది క్షణాల్లో మాధురి వచ్చింది అక్కడకు. ఆమె గదిలోకి వచ్చిన ఒక్క క్షణం తర్వాత ఆమె తీవ్రమైన కంఠం వినిపించింది.

"చాటుగా వచ్చావన్న మాట పొంచి పొంచి చూస్తూ!"

సరళ ప్రాణాలు పైనే పోయినయ్. తన రాకను మాధురి అప్పుడే పసిగట్టిందన్న మాట!

అంతలోనే మరో మగగొంతు వినిపించింది.

"నీ తమ్ముడ్నే కదూ? నీ రహస్యాలు ఎప్పటికప్పుడు

నేను తెలుసుకుంటూ ఉండాలి!'' కంఠం మాధురి తమ్ముడు మధుమూర్తిది.

''అందువల్ల నీకేం లాభం?''

''పరాత్పరరావు రహస్యాలు తెలుసుకున్నందుకే గదా నాకు నెలనెలా పెద్దమొత్తంలో డబ్బు అందింది!''

''అవునూ! పోలీసులు ఆ విషయం అడగలేదా?''

''అడిగారు. ఇంటి ఖర్చులకని డబ్బు వాడమని ఇచ్చాడని చెప్పాను. వాళ్ళు నా మాటలు నమ్మారు. అప్పుడు యింటి యజమానివి నీవే కదా? ఇక నీనుంచి నేను డబ్బు రాబట్టుకోవాలి నా ఖర్చులకు.''

''ఇంకా నా చేతికి తాళాలు రాలేదుగదరా?''

''అక్కా! నా దగ్గరకాదు నీవగలు. బ్యాంకి ఎకౌంట్ భార్యాభర్తల జాయింటు పేరిటవుంది. బావగారు లేరు గనుక దాన్ని నీవే ఆపరేట్ చెయ్యొచ్చు.''

''నీకు ఒక్క పైసా యివ్వను అరిచి చచ్చినా!''

''అప్పుడు నీవే జైలుపాలవుతావ్! ఆస్తి అంతా లక్ష్మణరావు పరం అవుతుంది. అందుకని నాకు రెండు లక్షలు పారేయ్. నా దోవన నేను పోతాను.''

''అసలు నేను ఎందుకివ్వాలి?''

''అక్కా నీవు నా రక్షణలో వున్నప్పుడే గదా, నిన్ను నేను లక్ష్మణరావుకి పరిచయం చేసింది? నీవు అతడ్ని పెళ్ళాడి, మన దారిద్ర్యాన్ని తొలగిస్తావని ఆశించాను. కాని లక్ష్మణరావు ఆ నర్సుని పెళ్ళాడాడు.

''ఏదో రకంగా ఈ బంగళాకి అధికారివి కావాలని నీవు పంతంపట్టి ముసిలాయన పరాత్పరరావునే పెళ్ళాడి కోటలో పాగా వేశావ్. అయినా నీకు లక్ష్మణరావుపై

ఆశ చావలేదు. అతడ్ని వలలో వేసుకోవాలని చూశావ్.

"తోటలో రాత్రిపూట అతడ్ని కలుసుకున్నావ్. ఈ విషయం పసిగట్టిన పరాత్పరరావు పిస్టల్ తెచ్చి పొద చాటున వుండి కాల్చాడు. ఈ ప్రమాదాన్ని ముందే ఊహించి, నీవు లక్ష్మణరావు చాటుకు తప్పించుకున్నావ్. రివాల్వర్ బుల్లెట్ లక్ష్మణరావు భుజంలో దిగబడింది."

"పోరా పోకిరి వెధవ! నీ కట్టుకథలు ఎవరు నమ్ముతారు?"

"నీవు అలా అంటావని నాకు తెలుసు. ఇంటికి కొత్తగా వచ్చిన వివేకానంద్ అందగాడు. యువకుడు, సుందరరూపి అతడ్ని మురిపించి నీ వాంఛల్ని తీర్చుకుంటున్నావ్ అతడిలో. మీ యిద్దరూ కలిసివున్నప్పుడు రహస్యంగా ఫోటోలు తీశాను కూడా!"

"అయితే నీకు రెండు లక్షలు యివ్వాల్సిందేనంటావ్?"

"పోనీ ముందు ఒక లక్షన్నా యివ్వు. మరో లక్ష తర్వాత ఇద్దువు!"

తర్వాత మాధురి, మధుమూర్తి ప్రక్క గదిలోకి వెళ్ళి వచ్చారు. ఆ తర్వాత ఇద్దరూ వెళ్ళిపోయారు.

వాళ్ళు వెళ్ళిపోయాక సరళ ప్రక్క గదిలోకి వెళ్ళింది. బెడ్ మీద కోమలి పడివుంది. ఆమె స్పృహలో లేదు.

మళ్ళీ ఎవరో వస్తున్న అలికిడి అయింది. సరళ ఒక మూల నక్కింది. ఆమె కూర్చున్నచోట టేబుల్ మీద రివాల్వర్ కనుపించింది, దాన్ని అందుకుని రెడీగా చేతులో పెట్టుకుని నిరీక్షించసాగింది.

మళ్ళీ సుబ్బులు వచ్చింది.

సరళ రివాల్వర్ గురి చూపుతూ పైకి లేచింది.

రివాల్వర్ చూస్తూనే సుబ్బులు గజ గజ వణికి పోయింది.

"నన్ను కాల్చద్దు! కావాలంటే నన్ను పోలీసులకు అప్పజెప్పు! దీనికంతకూ నాకూ బాధ్యతవుంది."

"ఇప్పటికయినా నీ నాటకాలు కట్టిపెట్టి నిజం చెప్పు. తిన్న యింటి వాసాలే లెక్క పెడతావా?"

"అవునమ్మా! నాదే పొరబాటు! మాధురి ఇచ్చిన డబ్బుకు కక్కుర్తి పడి ఆమె చెప్పినట్టు చేశాను. పోలీసులకు ఫోన్ చేసింది నేనే! వాళ్ళకు పార్సిల్లో మాధురి పంపమంటే ఇంజెక్షన్ సీసా, సిరెంజ్ నీ పంపింది నేనే."

. "అయితే పద! పోలీసులకు నిజాన్ని చెప్పి, నిర్దోషుల్ని రక్షించాలి! నడుముందు!" సరళ బెదిరించింది రివాల్వర్ ని ఊపుతూ.

సుబ్బులు ముందు నడుస్తున్నది. సరళ ఆమె వీపుకి రివాల్వర్ ని ఆనించి నడుస్తున్నది.

కోమలి గది తలుపులు దాటగానే, ఎదురుగా మాధురి నిప్పులు గ్రక్కుతూ నిలబడింది. ఆమె చేతిలో కత్తి తళ తళ మెరుస్తున్నది.

సుబ్బులు ఏడుస్తూ నిలబడింది.

"ఓ! నీ స్నేహితురాల్ని వెతుక్కుంటూ వచ్చావా నర్స్!"

"కోమలి నీకేంఅపకారంచేసింది?ఆమెపై పగబట్టావ్?"

"లక్ష్మణరావుని నాకు కాకుండా చేసింది. నాకు దక్కని వ్యక్తిని దానికిమాత్రం దక్కనిస్తానా?"

"మాధురీ! నీకు కావల్సింది ఐశ్వర్యం! పరాత్పరరావు మరణంతో దాన్ని సాధించావ్! ఇకనైనా నీ ఆవేశాన్ని శాంతింపజేయి!"

"అలా వీల్లేదు. కోమలి మాయమవటంతో పోలీసులు ఆమెను వెదకటంలో నిమగ్నులౌతారు. మాకు కొంత వ్యవధి వస్తుంది. ఈలోగా లక్ష్మణరావు హరీ అంటాడు. ఆస్తి అంతా నా వశం అవుతుంది. ఈ బంగళాని అమ్మేసి స్వేచ్ఛగా విహంగంలా వెళ్ళిపోతాను."

"నీవు పైకి అందగత్తెవే! కానీ లోపల నీవు పిశాచివి" అంటూ సరళ రివాల్వర్ ట్రిగ్గర్ ని నొక్కింది.

ఆ రివాల్వర్ లో బుల్లెట్స్ లేవని ఆమె గ్రహించలేదు. ట్రిగ్గర్ క్లిక్ మన్న శబ్దం తప్ప మరేం సంభవించలేదు.

మాధురి కత్తి పైకెత్తి ఆమెపై దూకింది. సరళ రివాల్వర్ ని వెనక్కి తిప్పి ఆమె తలపై కొట్టింది. ఆ దెబ్బ తప్పుకునేందుకు మాధురి క్రిందకు వంగింది.

సరళ కాలితో మాధురి కడుపులో తన్నింది. ఆమె దొర్లుతూ వెళ్ళి పడింది నేలమీద.

సరళ ఆమెమీద పడి, మాధురి చేతిలోని కత్తిని లాక్కుంది.

మాధురి బెదిరిపోయింది. అంతలో ఎవరో వచ్చిన అలికిడి అయింది. తలెత్తి చూసింది సరళ.

ఆ వచ్చింది వివేకానంద్. అతడి ముఖాన విషపునవ్వు, కళ్ళల్లో క్రౌర్యం తాండవమాడుతున్నయ్.

అతడి బలమైన చేతులు సరళను చుట్టేసినయ్. కుక్కపిల్లను విదిలించినట్టుగా విదిలించేసాడు ఆమెను.

మాధురి బుసలుకొడుతూ లేచింది. "చంపేసెయ్ పీడా విరగడవుతుంది" అంది.

అంతలోనే తలుపులు తోసుకుని బిలబిలమంటూ పోలీసులు లోపలకు జొరబడ్డారు.

"హాండ్సప్!" అన్నాడా ఇన్స్పెక్టర్.

వివేకానంద్, మాధురి చేతులకు బేడీలు వేశారు.

## 12

లక్ష్మణరావు బెడ్ మీద కూర్చుని వున్నాడు. అతడికి ఆసరాగా వుంది కోమలి.

హాల్లో ఇంకా మధుమూర్తి, నౌకర్లు, సరళ, పోలీసులూ వున్నారు. ఒకమూల బేడీలతో వివేకానంద్, మాధురి వున్నారు.

"నర్స్ కోమలి ఈ అనర్థాలకన్నింటికీ మూలం అని అనుకున్నాం ముందు. కానీ ఐశ్వర్యంకోసం, వైరెటీల కోసం అంగలార్చే మాధురి అసలు కారణం అని చివరకు తేలింది.

"లక్ష్మణరావుని పెళ్ళాడాలని ఆశించిన మాధురి, ఆ అవకాశం చేయిజారిపోయిందని తెలిసి, మరో ఎత్తు వేసింది. తన వయసూ, సొగసులతో ముసలి యజమాని పరాత్పర రావుని వలలో వేసుకుంది. అతడ్ని పెళ్ళాడి ఈ ఇంటికి అధికారిణి అయింది.

"అయితే ఆమె లక్ష్మణరావుని తన కోర్కె తీర్చమని వేధించసాగింది. లక్ష్మణరావు తప్పుకు తిరుగుతున్నాడు.

"పరాత్పరరావుకి మరో వ్యాపకం ఉంది. ఎమర్జన్సీ విధింపబడ్డాక, 'ఆనందమార్గ్' సంస్థ నిషేధింపబడింది. పరాత్పరరావు ఆ సంస్థలో రహస్య సభ్యుడు. అనేకసార్లు ఆ సంస్థకు పెద్ద మొత్తంలో విరాళాలిచ్చి వున్నాడు. ఎమర్జన్సీ వచ్చాక అతడు డబ్బు పంపటం మానేశాడు. అతడ్ని వ్యక్తిగతంగా కలుసుకునేందుకు వివేకానంద్ వచ్చాడు.

"అతడికి కొద్దిరోజులపాటు ఆతిథ్యం ఇవ్వటానికి ఒప్పు కున్నాడు పరాత్పరరావు. ఇంట్లో అందరికీ అతడు తన చిన్ననాటి స్నేహితుడని పరిచయంచేశాడు.

"చీకట్ని మార్చినంత తేలికగా ప్రియులను మార్చే స్వభావం గల మాధురి కన్ను వివేకానంద్‌పైన బడింది. సులువుగానే అతడ్ని తన వలలో వేసుకుంది. ఈ అక్రమ సంబంధం పరాత్పరరావు కంటబడింది. అతడిలో ప్రతీకార జ్వాలలు రేగినయ్.

ఆ రాత్రి వారిద్దరూ తోటలో కలుసుకుంటారని తెలిసి' రివాల్వర్‌తో అక్కడ పొంచి వున్నాడు. కానీ ఆ రోజు లక్ష్మణరావుకి నిద్రపట్టక తోటలో తిరుగుతున్నాడు. మాధురి వచ్చి అతడిపైనే తన వగలంతా ఒలకబోసింది. ప్రియ సంభాషణలు జరిపింది.

"చీకట్లో వివేకానంద్ బదులు లక్ష్మణరావు వున్నాడని గ్రహించని పరాత్పరరావు తన కొడుకునే కాల్చాడు. దాంతో వివేకానంద్ మేలుకున్నాడు. ఆ దెబ్బ తనపై వుద్దేశ్యింపబడిందని తెలుసుకున్నాడు.

పరాత్పరరావు తన కొడుక్కి ప్రమాదం కలగగానే తన మనసులోని రహస్యాన్ని డాక్టర్ శేఖరానికి మాత్రమే చెప్పాడు.

"వివేకానంద్ అసలు స్వరూపాన్ని బట్టబయలు చేసేందుకు వీలులేదు. వాడెటూ జైలులోకి పోవటానికి సిద్ధమే! అంతవరకూ వస్తే, వాడు పరాత్పరరావు ఆనంద్ మార్గ్ సంస్థలో సభ్యుడని చెప్పక మానడు. దాంతో మీసా క్రింద పరాత్పరరావు జైలుపాలవ వలసివస్తుంది. తమ వంశానికి తీరని మచ్చవస్తుంది. అందుకే మళ్ళీ తగిన అదను

కోసం వేచివున్నారు వివేకానంద్‌పై దెబ్బతీసేందుకు!

"అంతవరకూ పరిస్థితి విషమించేదాకా చేతులు ముడుచుకుని కూర్చునే వ్యక్తి కాదు వివేకానంద్. అతడి మనసు కంప్యూటర్‌లా పనిచేసింది. తనపై అనుమానం రాకుండా పరాత్పరరావుని వదిలించుకోవటానికి పెద్ద ప్లాన్ వేశాడు. దాంతో తనకు శత్రుపీడ తొలగిపోతుంది; అందం ఐశ్వర్యం గల మాధురి శాశ్వతంగా తనదవుతుంది.

"పరాత్పరరావుకి గుండెపోటు వస్తుందని తెలుసుకున్నాడు. అలా గుండెపోటు వచ్చినప్పుడల్లా ఇంజెక్షన్ వేసుకుంటాడు. ఆ ఇంజెక్షన్ సీసాలోకి పాయిజన్‌ని ఇంజెక్ట్ చేసి, దాన్ని యథాస్థానంలో వుంచేశాడు.

"అతడి అదృష్టంకొద్దీ, ఆ రాత్రే పరాత్పరరావుకి గుండెపోటు రావటం, అమాయకురాలైన కోమలి అతడికి ఇంజెక్షన్ ఇవ్వడం జరిగింది. పరాత్పరరావు మరణించాడు. ఎవరూ వివేకానంద్‌ని అనుమానించలేదు.

వివేకానంద్ అసలు స్వరూపం తెలిసిన మరో వ్యక్తి డాక్టర్ శేఖరం. చాటుగా వివేకానంద్‌ని కలిశాడు డాక్టర్. యజమాని మరణానికి నీవే కారణం అని ఆరోపించాడు. దాంతో వివేకానంద్ అతడ్ని దారుణంగా హత్య చేశాడు. ఆ టైములో ఎలిబీ సృష్టించుకోవటం కోసం కారులో టౌన్‌కి వెడుతూ, సరళనుగూడ తనతో తీసుకెళ్ళాడు.

"తిరిగి వచ్చేటప్పుడు కారు రిపేరని చెప్పి, సరళను దించేశాడు. ఆమె బంగళాకు అడ్డదారిన వెడుతుందని అతడికి తెలుసు. ఆ దోవలోనే డాక్టర్ శేఖరాన్ని అంత మొందించాడు వివేకానంద్.

"ఇక వివేకానంద్‌కీ, మాధురికీ అడ్డులేదు. ఈ స్థితిలో మాధురి మనసులో పురుగు తొలిచింది. లక్ష్మణరావు అడ్డు కూడ తొలగించమని వివేకానంద్‌ని కోరింది. ఆ తర్వాత ఆ ఆస్తినంతా అమ్మేసి క్యాష్ చేసుకుని, బొంబాయో, కలకత్తానో వెళ్ళి వివేకానంద్‌తో స్థిరపడాలనుకుంది.

"కానీ ఇంటినిండా పోలీసుబలగం వుంది. వాళ్ళను తాత్కాలికంగా మరలిస్తే, ఆ కొద్ది వ్యవధిలో లక్ష్మణరావుని కడతేర్చవచ్చు. అందుకే కోమలిని నేల మాళిగలో దాచేశారు. ఇందులో ఏదో మోసం వుందని మేము ఊహించాము. మాధురిని రహస్యంగా కనిపెడుతూ వచ్చాం.

"పాడుబడిన గ్యారేజీలోకి సుబ్బులూ, మాధురీ, వివేకానంద్ వెళ్ళటం చూశాం. మా అనుమానం నిజమయింది. అసలు హంతకుల్ని పట్టగలిగాం," ఇన్స్పెక్టర్ జరిగినదంతా వివరించాడు.

"మైగాడ్! ఇంకొక్క రోజు ఆగితే నేనూ హరీ అనేవాడ్నన్న మాట!" అన్నాడు లక్ష్మణరావు.

"అవును! పైకి అందంగా కనుపించే ఈ మాధురి' సాత్వికుడిలా అవుపించే వివేకానంద్ నివురు గప్పిన నిప్పులన్నమాట!" కోమలి అంది.

"కాదు!కాదు! మేకవన్నె పులులు! మాధురి మాయలో పడి, తమ సంస్థకు విరాళిచ్చిన దాతనే హత్యచేశాడు వివేకానంద్. ఐశ్వర్యంకోసం బరితెగించిన స్వేచ్ఛకోసం మాధురి ఇన్ని ఘోరాలకు తలపడింది" సరళ పలికింది, వారిద్దరి వంకా కోపంగా చూస్తూ.

"ఏమయితేనేం? భగవంతుడు ఇప్పటికైనా ఈ ఇంటికి పట్టిన శనిని వదిలించాడు. నా భర్తను నాకప్పగించాడు,"

అంది కోమలి కళ్ళు తుడుచుకుంటూ.

"అవును కోమలీ! ఇదంతా నీ చలవే! అదృష్టం బాగుండబట్టే పెద్ద ముప్పు తప్పింది. అన్నట్టు చట్టప్రకారం విడాకులు పొందాం కదూ మనం! ఇప్పుడు మనం ఒకరి కొకరు ఏమీ కాము! కనుక మళ్ళీ పెళ్ళి చేసుకుందాం! ఇన్స్పెక్టర్ గారూ! మా పెళ్ళికి మీరు తప్పకుండా రావాలి!" లక్ష్మణరావు నవ్వాడు.

"ష్యూర్! ష్యూర్! తప్పకుండా వస్తాను. ఈలోపల వీళ్ళ పెళ్ళి కానిస్తాను," అంటూ నేరస్థుల్ని వెంటబెట్టుకు వెళ్ళిపోయాడు ఇన్స్పెక్టర్.

"నేనూ వెళ్ళొస్తానే కోమలీ! మీ భార్యాభర్తలు చేరువ కావాలనే నా అభిమతం. అది నెరవేరింది. ఇక మీ మధ్యన నేనెందుకు?" అంది సరళ.

"అదేం వీల్లేదు. నా పెళ్ళిలో నీవు తోడిపెళ్ళికూతురివి. పెళ్ళయేదాకా నీ విక్కడ్నుంచి కదలటానికి వీల్లేదు," కోమలి ఆప్యాయంగా చూసింది.

ఆ మాటల్ని బలపరుస్తూ అక్కడున్నవారంతా కిలకిల నవ్వారు.

—: ఐపోయింది :—



[ఎనిమిదవ భాగము]

సరిగ్గా అప్పుడే శిలువ ఆకారంలోవున్న ఆ బోర్డు క్రింద ఓ పాకెట్ నా కళ్ళ నాకర్షించింది...

గబగబ ఆ పాకెట్ ని అందుకున్నాను...

అది విప్పాను.

పాలిథిన్ సంచి వున్నది లోపల.

నోటితో పైవైపు చించాను సంచిని.

ఒక సిగరెట్ పాకెట్, అగ్గిపెట్టె, ఒక రొట్టె నా చేతిలోకి వచ్చాయి.

తృప్తిగా, ఆనందంగా రొట్టెకేసి చూసి, దాన్ని పదిలంగా పాంటు జేబులో దాచాను.

పాకెట్ విప్పి ఓ సిగరెట్ పెదిమల మధ్య వుంచుకున్నాను.

అగ్గిపుల్ల గీసి వెల్గించాను. ఉషారుగా మొదటి దమ్ములాగాను.

ఎన్నో రోజుల 'గాప్' తర్వాత ముట్టించిన మొదటి సిగరెట్ యిచ్చే ఉత్తేజాన్ని వర్ణించడం కష్టం! అది స్మోకింగ్ హాబిట్ వున్నవారికే తెలుస్తుంది.

బుర్ర చురుగ్గా చకచగా పని చేస్తోంది.

తోడుకుపోయిన నరాలు ఒక్కసారి బలం పుంజుకున్నట్లనిపిస్తోంది...

ఇంతకూ...

ఆ బోర్డు అక్కడ ఎరేంజ్ చేసిందెవరు??

అందులోని ఆంతర్యవేఁమిటి?

వ్చ్...ఎంత ఆలోచించినా ఆ ప్రశ్నకు సమాధానం యిప్పుడే దొరకదని తెలుసు.

తినబోతూ రుచి అడగడమెందుకు?

ఈ విధంగా నచ్చచెప్పుకుని ఆ యారో గుర్తు మార్గాన ప్రయాణించసాగాను.

పది అడుగులైనా వెయ్యకముందే వెనకాల నేలదురుతున్నట్లు శబ్దం వినవచ్చింది. అదిరిపడి—

చివ్వున వెనక్కి తిరిగాను.

అంతే!

నా గుండె ఝల్లుమన్నాయ్!

కంగారులో రైఫిల్ వదిలేసి, చటుక్కున గెంతి, పైకొమ్మనందుకున్నాను. భూమి అదరగొడుతూ, ధూళి రేపుతూ ఖడ్గమృగం నా కాళ్ళక్రింద నుంచి పది అడుగులు ముందు పరిగెత్తింది.

క్షణంలో అపాయం తప్పిపోయింది.

కాకపోతే దాని ముట్టిమీద దృఢంగా, సూదిగావున్న కొమ్ము నా వెన్నముకను విరిచి పొట్టలోకి దూరివుండేది...

క్రిందికి దిగి రైఫిల్ అందుకున్నాను...

గురి తప్పిన అవమానంతో, క్రోధమధికమైన ఖడ్గమృగం అదో విధంగా అరుస్తూ మళ్ళీ వెనక్కి తిరిగింది నా వేపు. ఆలస్యం చేయలేదది.

నేలను తన్ని పైకిలేచి, నా వేపు రంకె వేస్తూ కదిలింది బరువుగా...

సేఫ్టీ కాచ్ లూజ్ చేసి, తుపాకీ పేల్చాను.

బుల్లెట్ వెలువడ్డం, అది నా మీదికి విరుచుకు పడడం ఒకేసారి జరిగాయ్.

ఖడ్గమృగం మూవ్‌మెంటును వూహించి శరవేగంతో, రబ్బరు బొమ్మలా దొర్లాను ప్రక్కకి.

గురితప్పి ఆ వేగంలో ఆగలేక, మరికొంత ముందుకు వెళ్ళి బరువుగా వెనక్కి తిరిగిందది. 'పార్ట్ ఎయిమ్ యిన్ కన్‌ఫ్యూషన్' కావడంవల్ల నా బుల్లెట్ మిస్ అయింది.

బుసలు కొడుతోంది క్రోధంతో ఖడ్గమృగం...

మల్లయోధుడు తొడలు చరిచి సవాలు చేసినట్లు, ఖడ్గమృగం మళ్ళీ దుమ్ము రేగేటట్లుగా వెనకాళ్ళతో నేలను తన్ని నా వేపు దూసుకు రాసాగింది...

నేను అలాగే ఓ చెట్టు మొదట్లో నిలబడిపోయేను దానికి సరిఅయిన లక్ష్యం అందిస్తూ.

తారాజువ్వలా నా మీదికి దూసుకు వచ్చింది ఖడ్గమృగం.

రెప్పపాటుకాలంలో చటుక్కున ప్రక్కకు తప్పుకున్నాను.

ఆ తప్పుకోవటంలో ఓ అరక్షణం ఆలస్యం అయితే నా ప్రాణాలు అనంత వాయువుల్లో లీనమైపోయేవి.

అంతే!

ఖడ్గమృగం ముఖానవున్న కొమ్ము చెట్టు మొదట్లో దిగబడింది.

బలంగా వెనక్కు లాక్కోసాగింది వికృతంగా అరుస్తూ అది.

కాని, కొమ్ము చెట్లో నాటుకుపోయి రావడంలేదు...

అంతే! రైఫిల్‌తో పిచ్చిగా ప్రేల్చాను...

బుల్లెట్లు అయిపోయాయని తెల్సాక దాని వేపు కంగారుగా చూసాను.

ఖడ్గమృగం తల ఛిన్నాభిన్నమైపోయింది.

అలసటగా సిగరెట్ వెల్గించి ముందుకి నడిచాను.

పిచ్చిపట్టుదలతో, మధ్యాహ్నందాకా నడిచేసరికి నా కాళ్ళు పీక్కుపోయాయి...

తొడలు పట్టేసినట్లయింది...

అలసటగా ఓ వృక్షఛాయలో కూర్చోబోయి ఉలిక్కిపడ్డాను.

రెండో బోర్డ్!!

అల్లంత దూరంలో ఎదురుగా కనబడింది.

నా నీరసం అంతా ఎగిరిపోయింది.

గబగబా పరిగెత్తాను దాని వేపు...

ఆయాసపడుతూ ఆ బోర్డుమీది అక్షరాన్ని గొణుక్కుంటూ చదివాను...

"ఈ బోర్డు వెనకవైపు ఫర్లాంగు దూరంలో ఓ చెరువు వుంటుంది. అది దాటి సుమారు రెండుమైళ్ళు తిన్నగా

ప్రయాణించండి. మంచి ఆతిథ్యం మీకు లభించగలదు—
—కోబ్రా''

కోబ్రా??
ఉలిక్కిపడ్డాను.
ఎవరీ కోబ్రా??
అతని ఆశయం ఏమిటి?

ఇందులో...
ఇందులో కొంపదీసి ఏదైనా మోసం లేదు గదా!
అయితే...
ఇప్పుడేం చెయ్యాలి?
విసుగ్గా తల విదిలించాను.

ఖాళీ రైఫిల్‌తో ఈ ఆఫ్రికా అరణ్యాల్ని, నడుస్తూ దాటగలననుకోవడం ఎంత అవివేకమో తెలుసా.

అంతరాత్మ పీక నొక్కేసి, దూరంగా పారేసి ముందుకి కదిలాను.

రొట్టెముక్క దారిలో ఎప్పుడో నవిలేశాను.

మళ్ళీ ఆకలి కరకరలాడుతోంది.

ఈ బోర్డు దగ్గర ఫుడ్ పాకెట్స్‌లాంటివేమీ లేవు.
ఉంటె వుండాలి.

బహుశా ఏ జంతువో లాక్కెళ్ళి వుండవచ్చు.

ఒళ్ళంతా అరంగుళం మందాన ధూళిదుమ్ము అట్టకట్టుకు పోయింది.

పాంటు చమటకంపు కొడుతోంది.

ముందు ఆ బోర్డులో చెప్పబడిన చెర్వులో హాయిగా స్నానం చేయాలి.

స్నానం సగం బలం అంటారు.

ఆ శక్తి అయినా నన్ను కోట్రావద్దకు చేరుస్తుంది...

అతివేగంగా అడుగులు వేశాను.

మరో అర్ధగంటలో ఆ చెరువు ప్రత్యక్ష్యమైంది.

అయామ్ ఇన్ రైట్ వే!

ఆనందంగా చెర్వువేపు చూసాను, తుపాకీ ఒడ్డున పడేసి.

సంతోషంతో ఎగిరి గంతెయ్యాలనిపించింది.

అదే చేశాను.

చల్లగా తగిలాయ్ నీళ్ళు...

ముందు చేపలా నీళ్ళు తాగేసాను కడుపు నిండా.

పెద్దలోతు లేదది.

నాకు భుజాలదాకా వచ్చింది నీటి లెవెల్.

ఒళ్ళు శుభ్రంగా తోముకుని, కుర్రాడిలా కేరింతలు కొడుతూ యీద సాగాను.

వెల్ లేక్!

చేపలు పుష్కలంగా ఉన్నట్టు గ్రహించాను.

అలసిపోయేదాకా అటూ ఇటూ ఈది అరగంట తర్వాత ఎంప్టీగన్ తీసుకొని అవతలి ఒడ్డుకు కదిలాను.

నీటిలోంచి బైటకు అడుగేసాను.

అంతే!

ఒళ్ళు జలదరించినట్లయింది!

కెవ్వున అరిచాను.

నాకు తెలీకుండానే కుడి తొడమీద చెయ్యిపెట్టి బలంగా లాగాను.

చూయింగ్ గమ్‌లా సాగుతూ బయటపడింది బాగా బలిసి వున్న ఓ నాలుగంగుళాల జలగ!

అదిరిపడుతూ నీటిలోకి విసిరేసాను దాన్ని!

మెడమీద ఏదో కదిలినట్లయింది.

త్రుళ్ళిపడి మెడ చేత్తో తడుముకున్నాను.

మైగాడ్!

మరో రెండు!!

దోమను చరిచినట్లు అరచేత్తో బాది, మెడనుండి వాటిని గట్టిగా పీకేసాను.

ఒళ్ళంతా వెతుక్కున్నాను.

ధీర్ఘంగా నిట్టూర్చాను...

థాంక్ గాడ్! యిక లేవు.

ఒడ్డుమీద మెత్తని పచ్చికపై వెల్లకితలా పడుకొని, చల్లగాలి పీలుస్తూ ఓ పావుగంట విశ్రాంతి తీసుకున్నాను.

మధ్యాహ్నపు సూర్యుడి ఎండకు బట్టలు ఆరుతున్నాయి.

పాంటు జేబులోంచి పాలిథిన్ బాగ్ తీసి మరో సిగరెట్ ముట్టించాను.

మస్తిష్కంలో కోబ్రానుగురించిన ఆలోచనలు సాగుతున్నాయి.

మరో రెండు మైళ్ళు తుప్పలూ, చెట్లూ చేమా దాటుకుంటూ అతనివద్దకు వెళ్ళాలి!

అసలు అతను ఈకీకారణ్యంలో ఎందుకు వుంటున్నట్లు??

అలసట వచ్చేవరకు ఈదడంవల్ల ఆకలి ఎక్కువయ్యింది.

మెల్లిగా బూటుకాల్లోంచి కత్తి తీసాను.

నేలను తవ్వాను అక్కడక్కడా...

ఓ పది నిముషాలు కష్టపడితే, చిన్న చిన్నవి నాలుగయిదు వానపాములు లభించాయి.

చెరువులో నీరు నిశ్చలంగా వుంది.

ఒడ్డున కూర్చుని, ముందుకు వంగి నాలుగింటినీ నీటి అంచుమీద కాస్సేపు వుంచి, మెల్లగా జారవిడిచాను.

అంతే!

నీటి అంచుమీద ఎలులను తగిలించినవైపు జర్రున ఈదు కుంటూ వచ్చాయి అరచేయి మందాన వున్న చేపలు గుంపులు గుంపులుగా...

రెండు అరచేతులతోటీ, రపాలున కొట్టాను చేపల గుంపులోకి.

మరుక్షణం రెండు చేపలు విలవిల్లాడుతూ నా చేతుల్లోకి వచ్చాయి.

అగ్గిపెట్టెతో, నిప్పుచేసి ఆ రెండు చేపలనీ కాల్చుకుని తినేసాను.

కానీ ఆ రెండు చేపలు, నా కడుపులోకి ఏమూల?

రెండు బిస్కట్లు నమిలినట్లయింది. అంతే.

ఆరాకలిగా లేచి, పాలిథిన్ బాగ్ లోకి నీళ్ళు ముంచు కున్నాను.

తుపాకీ తీసుకొని మళ్ళీ ప్రయాణం సాగించేను.

దూరంగా ఏనుగుల గుంపొకటి నడుస్తోంది.

మరో గంట నడిచేసరికి నా కాళ్ళు పీక్కుపోయాయి.

అక్కడక్కడా ఎత్తయినకొండలు కనబడుతున్నాయి.

అలసటగా ఓ రాతిమీద కూర్చుండిపోయాను.

పాలిథిన్ బాగ్ ఓపెన్ చేసి అందులోని చెరువులో పట్టిన నీళ్ళు గడగడా తాగేసాను.

మధ్యాహ్నం ఆకలి తీరలేదు. టార్చెరింగ్ హంగర్!

ఏం చెయ్యాలి?

మరో ఆరు సిగరెట్లు వున్నాయి.

వాటితో కడుపు నిండదు. కడుపు నిండిన తర్వాత వుపయోగించేవవి.

కడుపులోకి వెళ్ళిన నీళ్ళు కదుల్తున్నప్పుడు శబ్దం చేస్తూ స్పష్టంగా తెలుస్తున్నాయి.

అలసటగా రాతి వెనకాల వున్న చెట్టు మొదలుకు నడుం వాల్చాను.

ఉన్నట్టుండి ఉలిక్కిపడ్డాను.

చెట్టు మొదట్లో సగంసగం కప్పడుతూ తెల్లగా ఏదో నన్నాకర్షించింది. గబగబా పైన ఉన్న మట్టి తొలగించాను.

నా కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

అది ఓ గుడ్డు.

ఫుట్ బాల్ సైజులో ఉందది.

పైకి ఎత్తి చూసాను. రెండు కేజీల బరువున్నట్లు తోచింది.

ఏ జంతువు గుడ్డది?

తినొచ్చో లేదో?

చెట్లు పుట్టలు దాటుకుంటూ కోట్రా నెప్పుడు కలుసుకుంటానో? అప్పటిదాకా ఆకలి తీరేదెలా?

పోనీ, పగలగొట్టి చూస్తే...

ఆకలి రాక్షసుడు నన్ను సాహసం చేయమంటున్నాడు.

చిన్న రాయి తీసుకుని దానిమీద కొట్టసాగాను.

రెండు... మూడు...

ఊహుఁ! గుడ్డుమీద పెంకు చాలా దళసరిగావుంది.

రాతిమీదనుంచి దిగాను.

నిటారుగా నిలబడి తుపాకీని తిరగేసి పట్టుకుని బట్ తో కపాలున ఆ గుడ్డుమీద బాదేను.

సరిగ్గా మధ్యని పగిలి రెండుగా విడిపోయింది అది కొబ్బరి చిప్పల్లా.

ఆశ్చర్యంగా దానికేసి చూసాను.

సగం సగం తయారవుతున్న పిండం...

ఏదో... జారుతున్న జిగురుపదార్థం...

భయంవేసింది నాకు...

ముందుకు వెళ్ళి పరీక్షగా ఆ పిండంకేసి చూసాను.

మైగాడ్!

నా ఒళ్ళు జలదరించింది.

అది డినోసార్ (రాకాశితొండ) గ్రుడ్డు!

సగం సగం తయారవుతున్న దాని అంగాలను బట్టి, ఆకృతినిబట్టి గ్రహించాను.

అంతలో వెనుకనించి భీకరంగా అరుపు వినబడింది.

భూమి అదిరింది ఆ శబ్దానికి - భూకంపం వచ్చినట్లుగా.

గుండెలు చేత్తో బట్టుకుని, మెల్లగా వెనక్కి తిరిగాను.

అంతే!

వెయ్యి యిటుకలు నా తలమీద కూలినట్లయింది.......

ఎదురుగా రెండుకాళ్ళమీద నిలబడి - పైకి లేచి వుంది డినోసార్.

నలభయి అడుగుల ఎత్తుగా......

ఆకాశంలో మెలితిరిగి, క్రిందికి వంగినట్లున్న ఎనభై అడుగుల పొడువాటి మెడ. ఆ మెడ చివర క్రూరమైన అతి చిన్నని ముఖం...

పొలుసులు నిండిన కాళ్ళతో...

కొండచిలువ లాంటి బలమైన తోకతో...

కళ్ళల్లోంచి నిప్పురవ్వలు రాలుస్తూ, క్రోధంతో

అరుస్తూ రెండుకాళ్ళు ఎత్తి నావేపు చూస్తోంది డినోసార్ నాలోని కదలికకోసం ఎదురుచూస్తూ...

నా గుండెలు డప్పుల్లా మ్రోగుతున్నాయి.

తుపాకీలో గుళ్ళు లేవు.

డినోసార్ శాఖాహారే!

కాని నన్ను అది కోరికి పారేస్తుంది....

కారణం!

అది పెట్టిన గుడ్డును ... దానికి తయారవబోయే పిల్లను చంపాను నేను.

నా గొంతులో తడారిపోయింది...

కాళ్ళు చేతులు, గడగడలాడి పోతున్నాయి.

పారిపోవాలి?

కాని ఎలా?

ఎదురుగా రాకాశిలా నిల్చుని ఉందది.

అంతే! కాళ్ళు కొద్దిగా వంచి గిరుక్కున చెట్టువెనక్కి దూరేను.

డబుల్ అప్!!

పరుగు...!

ప్రాణభీతి నన్ను లేడిలా పరిగెత్తిస్తోంది...

నేను కదల్డం చూసి, నా వెనకాల పడింది ఆ రాకాశి బల్లి...

అది ఎలా తెల్సిందంటే.. ...

వెనకాల చెట్లు విరుచుకుపడుతున్న చప్పుడు...

డినోసార్ నామీద పగబట్టిందన్న అనుమానం నిర్ధారణైపోయింది.

ఆ తోకతో ఒక్కటి బాదితే చాలు ... నన్ను—తన

పాట్టి కాలితో నేలకు అరక్షణం నొక్కి పెట్టితే చాలు. రక్తం కక్కుకుని చస్తాను.

డినోసార్ కీచు అరుపుతో నన్ను తరుముతోంది...

గాలిలో పరిగెడుతున్నాను.

ఆ కంగారులో- చెట్టుకొమ్మల క్రిందనుంచి, ఒకోసారి పైనుంచీ పరిగెట్టాల్సి వస్తోంది.

నా పరుగులో అనుభూతి ఎలా వుందంటే-గుండె గతి తప్పి అటూ ఇటూ ఊగుతున్నట్లుగా...

రాకాశి తొండ అతి పెద్ద జంతువు. అందుకే - అది ప్రయాణించలేని యిరుకైన మార్గాల్లోంచి దట్టమైన చెట్ల మధ్యనుంచి ఎగురుతున్నాను.

బూట్లు చిరిగిపోయాయి.

అందులోంచి నాలుగయిదు ముళ్ళు దూసుకుపోయాయి పాదంలోకి.

ముఖానికి ముళ్ళకంపల్లాంటివి అడ్డు తగిలి బుగ్గలు చీరుకు పోతున్నాయి.

ఇవేమీ లెక్క చెయ్యడంలేదు నేను...

ఒక మృగంచేత మేజర్ భయంకర్ మరణించడానికి వీల్లేదు.

అందుకే నా కాళ్ళకు శక్తి వస్తోంది...

ఒకనాడు మిరాక్యులస్‌గా నరమాంస భక్షకులనుండి నన్ను రక్షించిన డినోసారే యిప్పుడు నామీద పగబట్టి తరుముతోంది.

వెనక్కి చూసే ధైర్యం లేదు.

తారాజువ్వలా దూసుకుపోతున్నాను యిరుకైన మార్గాల్లో.

ఉన్నట్టుండి ఠక్కుమంది కుడికాలి దగ్గర...

ఆ పరుగులో ఎడమకాలి తర్వాత కుడికాలు లేవలేదు.

లాగాను...ఘట్టిగా...

కెవ్వున అరిచాను బాధగా.

తలదించి చూసాను.

ఇనుప దంతాలు నా పాదం చుట్టూ బిగుసుకున్నాయి.

ఎలుకబోనులాంటి యినుప సాధనమది!

క్రూరజంతువులను ట్రాప్ చేసేందుకు వుపయోగిస్తారు అది.

కాలు లాగితే అక్కడ చర్మం ఊడి తెల్లటి ఎముక బయటికి వస్తుంది.

అంగుళం లోతుదాకా దిగబడ్డాయి కాల్లోకి-అటూ ఇటూ దవడల్లావున్న యినుప పళ్ళు.

కదల్డానికి వీల్లేదు.

కాలు బలంగా లాగలేను.

లాగి అ...క్క...డ

ఖాళీ ఎముకతో పరిగెత్తలేను...

పరిగెట్టి రాకాశి తొండ బారినుండి తప్పించుకోలేను.

కీచుగా అరుస్తూ దూరంగా, బరువుగా గెంతుకుంటూ వస్తున్న డినోసార్ నా కంటబడింది.

ముచ్చెమటలు పోస్తున్నాయి.

హే భగవాన్!

ఇవే నా ఆఖరి క్షణాలు!

ఉన్నట్టుండి ఠక్కున తెగిపోయింది రాకాశితొండ ముఖం.

అదిరిపడుతూ పక్కకి తిరిగి చూశాను.

ఖాకీ దుస్తులతో వున్న యిద్దరు దృఢకాయులైన నీగ్రోలు రాకాశిలోండ ఎదురుగా నిలబడివున్నారు.

ఇద్దరి చేతుల్లో రైఫిల్స్ వున్నాయి.

ఒకడు తాపీగా, క్రిందికివంగి రైఫిల్ ముందు భాగాన వున్న చిక్కటి ఎఱ్ఱటి రక్తంతో నిండిపోయిన బాయ్‌నెట్‌ని గడ్డికి తుడవసాగాడు.

క్షణంలో సంగతి అర్థమైంది నాకు.

బాయ్‌నెట్‌తో నీగ్రో డినోసార్ కంఠాన్ని ఖండించి వుంటాడు.

ఇంకా ప్రాణం వున్నది కాబోలు—

రాకాశిలోండ ముఖం నేలమీద పడి తపతపలేస్తూ, కొట్టుకుంటోంది.

రెండు నిముషాల తర్వాత దాన్లో చలనం ఆగిపోయింది.

దూరంగా—ఎక్కడో వున్న డినోసార్ మొండెం చివరిసారిగా భీభత్సం చేస్తోందని చప్పుళ్ళబట్టి గ్రహించాను.

ఆకాశంలో అటూ ఇటూ అస్తవ్యస్తంగా మెలికలు తిరుగుతూ, భయంకరంగా చెట్లను గుద్దుకుంటూ పది నిముషాల తర్వాత వెనక్కి వాలిపోయింది నిర్జీవంగా.

దానికి యిప్పుడు ముఖంలేదు.

కేవలం గాయపడివుంటే నోటితో కేకలు వేసి ఎంత భీభత్సం చేసేదో?

కాస్సేపటికి గందరగోళం నుండి తేరుకున్నాను.

“ఎవరు మీరు?” అన్నాను కృతజ్ఞతగా యిద్దరు నీగ్రోల వేపు చూస్తూ.

“కోబ్రా మనుషులం.”

అన్నారిద్దరూ ముక్త కంఠంతో—

నల్లని దేహాలు వారివి.

తలమీద అతి సన్నని వెంట్రుకలు బిరుసుగా రింగులు తిరిగిపోయి వున్నాయి.

"నిన్ను మాతో తీసుకెళ్తాం యజమాని దగ్గరకి" అన్నారిద్దరూ.

"ఎంత దూరం?"

"అరఘల్లాంగు" అన్నాడొకడు.

"కాలికి చూసారా?" అడిగాను.

"ఏవిటి?"

"కుడికాలు చూడండి."

ఇద్దరూ అటువైపు చూసారు. "సారీ! మర్చిపోయాం" అన్నాడొకడు, కుడికాలు బిగుసుకుపోయిన ట్రాప్ వైపు చూస్తూ.

వెను వెంటనే యిద్దరు ధృడకాయులు, స్ప్రింగ్ యాక్షన్‌తో దవడల్లా తయారు చేయబడ్డ యినుప పళ్ళను అటూ యిటూ బలంగా లాగారు.

కాలుకు విముక్తి లభించింది.

పాదానికి పైగా గాట్లు స్పష్టంగా కనపడుతున్నాయి.

రక్తం కార్తోంది గాయాల్లోంచి.

"ఎందుకు అమర్చారు?" అడిగేను తల వంచుకుని పాదాన్ని పరీక్షించుకుంటూ.

"సింహాలు తిరుగుతుంటాయిక్కడ. వాటికోసం" సమాధానమిచ్చాడు బాయినెట్‌ని తుడిచేసిన మనిషి.

తలఎత్తి నిటారుగా నిలబడ్డాను.

"నేను నడవగలనని అనుకోను" గొణిగాను.

"మేం సాయం చేస్తాం. కేట్రిడ్జెస్ వున్నాయా అందులో?"

"తుపాకీలోనా? లేవు."

నా తుపాకీ మాగజిన్ తెరిచి పరీక్షించాడు మొదటి నీగ్రో. తర్వాత మౌనంగా భుజాన్నే తగిలించుకున్నాడు.

"మళ్ళ యిచ్చేస్తారా నాకు."

"అవసరంలేదు." అన్నాడతను గంభీరంగా "మూవ్!"

యిద్దరూ అటూ ఇటూ నా భుజాల్ని సాయంపట్టారు.

కుంటుతూ నడుస్తున్నాను యిద్దరి సాయంతో.

రక్తం కార్తూనే వుంది కుడిపాదం.

"డబుల్ థాంక్స్" అన్నాను నవ్వి తల అటూ ఇటూ తిప్పి యిద్దర్నీ చూస్తూ.

* * *

ఎదురుగా – ఎత్తుగా ఓ పెద్ద పర్ణశాల లాంటిది వుంది. మట్టితో మల్చిన మెట్లు......

దాదాపు ఆ యిల్లు కట్టడంలో చెక్కలు, వెదురుబొంగా ఉపయోగించి, యింటిచుట్టూ – మైదానంలో రాటలు పాతబడి కంచెలాంటిది వేయబడింది. రకరకాల జంతు చర్మాలు బయట ఆరవేయబడి వున్నాయి.

చెక్క గేటు తోసుకొని లోపలికి నడిచాను నీగ్రో వ్యక్తులతో.

సరిగా అప్పుడే ఖాకీ కలర్ సఫారీ సూటులో ఓ బలిష్టుడైన వ్యక్తి మెట్లమీద ప్రత్యక్షమయ్యాడు, చేతిలోని హంటింగ్ గన్‌తో. అతని మొలచుట్టూ కేట్రిడ్జ్ బెల్ట్ బిగించబడి వుంది.

నల్లని శరీరచ్ఛాయ అతనిది.

గుబురైన కనుబొమలు, బలమైన ముక్కు, బిగించిన ట్టుండే పెదిమలు, టోటల్ గా గంభీరమైన వ్యక్తిలా అవుపించాడు. బుగ్గలమీద ఏదో జంతువు గీరినట్లున్న గాయపు మచ్చ......

"వెల్ కమ్ స్ట్రేంజర్!" అన్నాడతను నవ్వుతూ.

"థాంక్యూ మిస్టర్ ..." ఆగిపోయాను.

"కో...బ్రా"... పూర్తిచేసాడతను. "దయచేసి కూర్చో" అంటూ ఆగి "మనం ఏకవచనంలోనే మాట్లాడు కుందాం" అన్నాడు నవ్వి వెనక్కి జరుగుతూ.

నన్ను లోపలికి తీసుకు వెళ్ళాడు కోబ్రా.

కుంటుకుంటూ వెళ్ళి ఓ పేముకుర్చీలో కూర్చున్నాను. కోబ్రా ఎదురుగా వున్న మరో కొయ్య సోఫాలో ఆశీను డయ్యాడు.

అతని కేసి సూటిగా చూసాను. "మిస్టర్ కోబ్రా! నీవద్ద ట్రాన్సిస్టర్ వుందా?" అడిగాను.

వింతగా నావేపు చూసాడు కోబ్రా "లేదు. ఎందుకు?"

"న్యూస్ పేపర్స్?" రెట్టించాను.

పకపకా నవ్వాడు కోబ్రా "స్టుపిడ్ క్వొశ్చన్. కీకా రణ్యంలో వార్తాపత్రిక లేమిటి?"

థాంక్ గాడ్! కోబ్రాకు నేను పారిపోయిన మిలటరీ ఖైదీనని తెలిసే అవకాశం లేదన్నమాట. తేలిగ్గా శ్వాస వదిలాను.

"మిస్టర్ భయంకర్! ఎందుకడిగావ్ ఈ ప్రశ్నలు?"

నాలో తడబాటును కప్పిపుచ్చుకుంటూ కోబ్రా వేపు చూసాను.

"ఈ రెండూ లేకుండా ఎలా జీవిస్తున్నావో ఇక్కడ అని. బోర్ కొట్టదూ?" అన్నాను నవ్వేస్తూ.

ఇంతేనా అన్నట్లు తేలిగ్గా నవ్వేసాడు కోబ్రా. "బోరు అనిపించదు. యింగ్లాండ్ మేడ్ రికార్డ్ ప్లేయర్ ఉంది నా దగ్గర. బ్యాటరీ ప్లే."

"సో యూ ఆర్ యన్ యింగ్లీష్‌మన్? వీయామ్ ఎన్ ఇండియన్."

"తెల్సు. మీ దేశాన్ని మేం కొన్నాళ్ళు పరిపాలించేం" అన్నాడు నవ్వుతూ కోబ్రా.

"యింగ్లీషు వారికి సహజంగా గర్వం ఎక్కువ' అన్నాను జవాబుగా.

"కాదు. కాన్ఫిడెన్స్ అనాలి. 'గర్వం' అని వాడతారు బయటివాళ్ళు. అది సరే. నువ్వీ అడవిలో ఎలా పడ్డావ్" అడిగాడు సిగరెట్ ముట్టించి కోబ్రా.

"తర్వాత చెప్తాను. ముందు నీ గురించి తెల్సుకోవాలని వుంది. ఈ అరణ్యంలో ఎలా ఉండగలుగుతున్నావ్?" అడిగాను ఉత్సుకతగా.

"అలవాటు తర్వాత నేటివ్స్ సాయం. మూడోది డబ్బుకోసం. నేనో షికారీని. రకరకాల జంతువులను వేటాడి యింగ్లాండ్‌లోను, యితర దేశాల్లోను రహస్యంగా అమ్ముతుంటాను..."

"సో యు ఆర్ ఎ పోకర్?" అన్నాను ఆశ్చర్యంగా మధ్యలో కలుగజేసుకొని. దొంగతనంగా జంతువులను చంపి చర్మాలను అమ్మేవాళ్ళని పోకర్స్ అంటారు.

"అవును." తేలిగ్గా నవ్వుతూ తల ఊపాడు కోబ్రా. "సంవత్సరానికి ఆరు నెలలు అక్కడా, ఆరు నెలలు ఇక్కడా

నా మజిలీ. విషసర్పాల్ని సేకరించడంలో సుప్రసిద్ధుడ్ని. అందుకే నన్ను 'కోబ్రా' అంటారు."

"దేనికి విషసర్పాలు?"

"మందుల ఫాక్టరీలకి సప్లయి చేస్తాను. యిది మాత్రం చట్టబద్ధంగానే." అంటూ సిగరెట్ నుసి, — చూపుడు వ్రేలితో సున్నితంగా నలుపుతూ అడిగాడు. "అండ్ వాట్ ఎబౌట్ యూ?"

"యిండియాలోనే మా తండ్రి మరణించాడు. పోర్ట్ సుడాన్‌లో నా తమ్ముడు జాబ్ చేస్తున్నాడు. ఆస్తి పంచుకునే విషయంలో అతన్ని యిండియా తీసుకు రావడానికి షిప్‌లో బయలుదేరాను. తుఫాన్‌కి బలి అయింది ఓడ. నాతో వచ్చిన నా ప్రేయసి యిక్కడి నరమాంస భక్షకులకి బలి అయింది. ఒంటరిగా ఈ అరణ్యాల్లో పడి తిరుగుతుంటే నువ్వు కాపాడావ్."

"పెళ్ళి కాకుండా దేవుడు మిమ్మల్ని వేరుచేసేడన్న మాట. అయామ్ సారీ ఫ్రెండ్. ఆమె మరణం విషయంలో నా కండోలెన్సెస్." అంటూ కోబ్రా నా కాలికేసి చూసి ఉలిక్కిపడి "కాలికి ఆ గాయం ఏమిటి?"అడిగాడు.

"మీరు అమర్చిన ట్రాప్‌లో పొరబాటున నా కాలు పడింది. డినోసార్ బారినుంచి రక్షించారు మీ సేవకులు."

"ఐ.సీ!" ఆశ్చర్యంగా చూసాడు కోబ్రా గడ్డంముని వేళ్ళతో రాసుకుంటూ. "డినోసార్ సాధుజంతువు. ఆకారం పెద్దదే కానీ మనుషుల్ని చంపదే అది."

"దాని గుడ్డును చితకొట్టాను పొరపాటున. ఆ కోపంతో పగబట్టి వెంటబడిందది."

"ఐ.సీ!" మళ్ళీ అన్నాడు కోబ్రా. "ఆ జంతువు వెజి

థేరియన్. పైగా ప్రీహిస్టారిక్ యానిమల్. ఆ జాతి నశించి పోకూడదు. అలాంటి శాంపిల్ వుండాలి. అందుకే నేను చంపించలేదు యింతకు ముందు దాన్ని."

"కొద్ది రోజుల్లో శిథిలావస్థలోకి వెళ్ళవల్సిన నన్ను ఆదుకున్నందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు అందుకుంటారని ఆశిస్తాను." అన్నాను చేయిచాపుతూ.

కోబ్రా నవ్వుతూ నా చేయి స్పర్శించి వదిలేశాడు. "ఇట్సాల్ రైట్ మిస్టర్ భయంకర్! కాని స్వార్థంతో మిమ్మల్ని కాపాడేనేమోనని మీరెందుకు అనుకోకూడదు?" అన్నాడు అదోలా చూస్తూ కోబ్రా.

పజిల్డ్ గా అతనికేసి చూసాను. "అర్థంకాలేదు." సన్నగా గొణిగాను.

"ఐ మీన్...మీ సహాయం నాకుకూడా కావాలి."

పకపకా నవ్వాను.

"మిస్టర్ కోబ్రా! యూవార్ జస్ట్ జోకింగ్! సగం చిరిగిపోయిన కట్టుబట్టలతో అడవిలో మిగిలిపోయిన అనాథను. నేను మీకేం చేయగలను సాయం?"

"లుక్ హియర్ మిస్టర్ భయంకర్! మీరు ధృఢకాయులు. ఈజింట్ యిట్?" అన్నాడు కోబ్రా.

"మేబి."

"మీకు గుండెబలం దండిగా వుందనుకొంటాను."

"ఉండే వుండాలి. అది లేకపోతే ఎదుర్కొన్న ట్రాజిడీలకి ఈపాటికి ఆత్మహత్య చేసుకొని వుండేవాడినేమో."

"అందుకే. మీరు నాకు సహాయం చేయగలరు."

"ఏమిట(టది?" అన్నాను వింతగా చూస్తూ.

"అంత అర్జంటుకాదు. తర్వాత చెప్తాను. ప్రక్కన

మంచం వుంది. మీరు ఈ రోజుకి ఈ గదిలోనే రెస్ట్ తీసుకోండి. మీ లెగ్ గాయపడింది. భుజంవద్ద మరోటి. మా నీగ్రోలు మీకు సేవలు చేస్తారు 'వైల్డ్ మెడిసిన్స్'తో. రేపటికల్లా మిరాక్యులస్‌గా మీ గాయాలు మాయమై, రెండ్రోజుల్లో కొత్త చర్మం పుడుతుంటుంది. అప్పటిదాకా మీరు ఫిజికల్‌గా గానీ, మెంటల్‌గా గానీ ఏ శ్రమా తీసుకోవద్దు. ఓ.కే?" అన్నాడు పైకిలేస్తూ. "నేను హంటింగ్ కెళ్ళి వస్తాను. తిరిగి ఉదయం మాట్లాడుకుందాం మనం."

నవ్వి, తలుపుమూసి వెళ్ళిపోయాడు కోబ్రా.

* * *

మర్నాటి మధ్యాహ్నం......

చేతిలోని జంతువుల ఆల్బమ్ పుస్తకంమూసి నేలమీద పెట్టాను. అది ఇంటి ముఖద్వారం వద్ద అరుగులాంటి ప్రదేశం. వాలుపేముకుర్చీలో కూర్చుని కాళ్ళు ఎదుటి స్టూలు మీద పెట్టి అరనిమీలిత నేత్రాలతో తన్మయంగా సిగరెట్ పీల్చసాగాను.

ఆ యింటిలో చాల గదులు ఉన్నాయి.

కాని అవేమీ నేను చూడలేదు.

కోబ్రాని అడగడం సభ్యతగా వుండదని ఆ ఆసక్తి చంపుకున్నాను.

ఇంటి వెనుకభాగంలో చిన్న స్టేబుల్ ఉన్నది. అందులో మూడు గుర్రాలు......

జీపుమీద కోబ్రా, అతని అనుచరులు ఉదయాన్నే అడవిలోకి వెళ్ళారు. వుడెన్ ఫెన్సింగ్ యివతల నేల మీద కూర్చొని యిద్దరు నీగ్రోలు మాత్రం ఓ జీబ్రా

చర్మాన్ని కొవ్వుతీసి చర్మాన్ని శుభ్రపరిచే పనిలో వున్నారు.

సన్నగా అటువేపు నుంచి దుర్వాసన వెలువడుతోంది.

కోబ్రా నాకు కేటాయించిన గదిలోనే గడిపాను.

అడవిలో విపరీతమైన ''నడక''తో అల్సిపోడంవల్ల, సగం సగం నిద్రవల్ల—ఊహించనివిధంగా నిన్న అమోఘమైన నిద్ర పట్టేసింది. నిన్న పడుకోడమే పడుకోడం... తిరిగి తెల్లవారు ఝామున మెలుకువ వచ్చింది.

గతదినం నేను త్రాగిన బ్రాందీ బాగా పనిచేసింది.

కాలి నొప్పులు తగ్గి యిపుడు హాయిగా వుంది.

లేచీ లేవగానే - భుజంవద్దా, కాలి పాదంవద్దా కట్లు కనపడ్డాయి.

కోబ్రా సేవకులు నిన్న నిద్రలో వుండగానే మందువేసి కట్టుకట్టి వుంటారు. ఆ భాగాలవద్ద చల్లగా ఉంది.

ఉదయాన్నే నీగ్రోలిచ్చిన మందు - నాలో మిగిలి పోయిన సగం ఎల్లో ఫీవర్‌ని పూర్తిగా తగ్గించేసింది.

నిప్పుకోడి — గుడ్లతో వేసిన ఆమ్లెట్లు, బ్లాక్ కాఫీ బ్రేక్‌ఫాస్ట్‌గా నాకు ఉదయాన్నే సప్లయి చేయబడ్డాయి.

మళ్ళీ నాగరికప్రపంచంలోకి వచ్చినట్లు ఫీలవుతున్నాను.

కోబ్రా నిజంగా నాకు ఎంతో సహాయం చేసాడు. డబ్బుపెట్టి కొనుక్కోలేని సహాయం అది.

గేటువరకూ తీగ దండేలపై వ్రేలుడుతున్న వివిధరకాల జంతు చర్మాలు గాలికి అటూ ఇటూ కదులుతున్నాయి.

చురుక్కుమంది చెయ్యి. గబుక్కున విసిరేసాను సిగరెట్ బిట్.

గేటువద్ద జీపు శబ్దం అయింది. ఓపెన్ జీప్!

దాదాపు పదిమంది నీగ్రోలతో జీపు దిగాడు కోబ్రా.

అనుచరులు గేటు తెరచి లోనికి రానిచ్చారు వాహనాన్ని.

కుర్చీలోంచి లేచాను. నవ్వుతూ నావేపు నడిచివచ్చాడు కోబ్రా.

"హెల్లో మిస్టర్ భయంకర్! ఆర్యూ ఫీలింగ్ బోర్డమ్?" అన్నాడు చెయ్యెత్తి పలకరిస్తూ.

"నాటెటాల్."

నవ్వాను.

"నీ వేట బాగా సాగిందా?"

"నాట్ సో వెల్. ఒక్క జంతువుకూడా పడలేదు యివ్వాళ. అరడజను కింగ్ కోబ్రాలు మాత్రందొరికాయ్" అంటూ తన అనుచరుడ్ని పిల్చాడు కోబ్రా.

అతను సన్నని తీగల షీట్స్‌తో చేయబడ్డ ఓ పెట్టెతో మా ముందుకు వచ్చాడు.

ఆ కేజ్ వేపు చూసాను. భయంకరమైన నల్లత్రాచులు మెలికలు తిరుగుతూ కనబడ్డాయి లోపల. కేజ్ హాండిల్ చేత్తో పట్టుకుని చూడసాగాను చిన్న పిల్లాడిలా.

పెదిమల మధ్య సిగరెట్ తీసి నవ్వాడు కోబ్రా.

చాల బరువుగా ఉన్నాయి పాములు. "ఎలా వేటాడుతారు ఈ పాముల్ని?" అడిగాను కోబ్రా వేపు చూస్తూ.

కోబ్రా సైగతో, పెట్టె పట్టుకుని అక్కడ్నుంచి మాయమయ్యాడు సేవకుడు.

"అలా కూర్చో మిస్టర్ భయంకర్!" అన్నాడు తాను కుర్చీలో కూచుని సిగరెట్ వున్న చేత్తో చూపిస్తూ కోబ్రా.

నేనూ కూర్చున్నాను.

"వెరీ సింపుల్! కాని అలవాటుండాలి. ఓ పొడుగాటి కర్ర ఉంటుంది. ఆ స్టిక్ చివర్న ప్రశ్నార్థకం (కొశ్చన్ మార్క్) షేప్‌లో ఓ తీగ ఉంటుంది. కర్ర ముందుకు సాచి ఆ భాగాన్ని పాము మూతి దగ్గర ఆడిస్తాం. అది కోపంతో పైకిలేస్తూ మూతితో ఆ తీగ భాగాన్ని కొడుతు వుంటుంది.

ఈ లోపున ఎంతో నేర్పుగా సరిగ్గా దాని తల క్రింద చేత్తో పట్టుకుని కేచ్‌లో పడేస్తాం. ఫినిష్!" ఆగాడు నవ్వుతూ కోబ్రా.

ముందుకు వంగి ఆసక్తిగా వింటున్న నేను—వెనక్కి వాలాను.

"చెయ్యి గురితప్పి చేతిమీద కాడితే?" అన్నాను గబుక్కున.

కోబ్రా పెదవుల మీద నవ్వు యింకా నాట్యమాడుతూనేవుంది.

"మామూలు వ్యక్తులకు తప్ప మాలాంటి వారికి ఫర్వాలేదు" అన్నాడతను.

"అంటే?"

"నియాకీ అనబడే ఆకులు మావద్ద వుంటాయి. వాటిని నూరి తాగితే విషం విరిగి పేషంట్ నవ్వుతూ లేచి కూర్చుంటాడు.

"మిస్టర్ కోబ్రా! అడవుల్లో నివశిస్తున్నారు. నీది ఎంతో త్రిలింగ్ లైఫ్!" అన్నాను ప్రశంసాపూర్వకంగా.

"యు వార్ రైట్! కొత్తలో ఎంతో భయం వుంటుంది. అలవాటయితే జంతువును వేటాడ్డంలోవున్న

ఆ థ్రిల్, ఆ అడ్వెంచర్ కోసం తహతహలాడిపోతాం. ఇట్స్ లైక్ ఎ డ్రగ్ ఎడిక్షన్" అన్నాడు కోబ్రా-
"మిస్టర్ భయంకర్! మన చర్చ ఆపేద్దాం యిక. దిసీజ్ టైంఫర్ లంచ్!" అన్నాడు పైకిలేస్తూ.

నేను మౌనంగా అతన్ని అనుసరించాను.

రెండు నిముషాల్లో యిద్దరం డైనింగ్ టేబుల్ ముందు వున్నాం.

*　　　*　　　*

తృప్తిగా తిని, తాగి నాప్‌కిన్‌తో మూతి తుడుచుకుంటూ కోబ్రాకేసి చూసాను "వెరీ మెనీ థాంక్స్ కోబ్రా! ఆకలితో పడిపోయిన వాడిని లేవదీసి పంచభక్ష్య పరమాన్నాలు పెట్టావ్."

నవ్వి ఊరుకున్నాడు కోబ్రా.

ఇద్దరం సిగరెట్లు ముట్టించాం.

"మిస్టర్ కోబ్రా! యిప్పుడు చెప్పు. నేను నీకు చేయగల సహాయం ఏమిటి?"

"ఓహ్! దాని గురించే ఆలోచిస్తున్నావన్న మాట నిన్నటినుంచీ."

సిగరెట్‌ని గట్టిగా మరో పఫ్ లాగి "దటీజ్ నాచురల్!" అన్నాను.

"మిస్టర్ భయంకర్! యిప్పుడే చెప్పాలంటావా ఆ విషయం."

"ఇప్పుడే. ఆలస్యమైతే నాలో అనవసరంగా థ్రిల్, టెన్షన్ ఏర్పడుతాయ్."

"మిస్టర్ భయంకర్! బోలెడంత టైం తీసుకొని, మంచి ఆతిథ్యం యిచ్చి, బాగా మచ్చిక చేసుకొని ఆ కోరిక కోరదామనుకున్నాను. కానీ 'యిప్పుడే' అంటున్నావు నువ్వు."

కోబ్రా వేపు మెచ్చుకోలుగా చూశాను.

"మిస్టర్ కోబ్రా! నువు ముహం మీద గుద్దినట్లు నిర్మొహమాటంగా మాట్లాడుతావ్. ఆ నేచర్ అంటే నాకెంతో యిష్టం.

మచ్చిక విషయం ఆ రీతిలో చెప్పావ్. కనుక కోరిక విషయం కూడా నిర్మొహమాటంగా చెప్పు. నేను చేయ గలిగేదైతే తప్పక చేస్తాను" అన్నాను కోబ్రా ముఖం లోకి ఏదో వెతుకుతున్నట్లు చూస్తూ.

"ఆల్ రైట్" కోబ్రా భుజాలెగరేసాడు.

అతని ముఖం కొంత సీరియస్‌గా మారింది.

"నా చిరకాల వాంఛ నీకు చెబుతున్నాను. నేను జంగిల్‌లో తిరిగే షికారీనని నీకు తెల్సు. అంటే వేట విషయంలో అడవి జంతులతో నాకెంతో పరిచయము సంబంధము వున్నాయి..."

ఊపిరి బిగబట్టి వింటున్నాను.

"...రకరకాల మెత్తని జంతుచర్మాలను మంచంమీద పరుపుగా వేసుకొని మత్తుగా పడుకుంటాను నా గదిలో. ఓ రోజు రాత్రి మామూలుగా మంచం వద్దకు వెళ్ళాను" సీరియస్‌గా సిగరెట్ పీలుస్తూ ఆగి నా వేపు చూసాడు కోబ్రా.

"తర్వాత!" విసుగ్గా అన్నాను మధ్యలో ఆగి సిగరెట్ పీల్చడం చూస్తూ.

"...పడుకోబోయేముందు మంచం మీద ఎత్తుగా, పరిచిన మెత్తటి చర్మాలను చేతితో తడిమాను. సరిగ్గా అప్పుడే ఓ ఆలోచన వచ్చింది నాకు..."

అంటూ పది నిముషాల పాటు మాట్లాడాడు కోబ్రా.

పూర్తయింది చెప్పడం...

(సశేషం)

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యాలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి?

ఈ నెల ప్రచురింపబడిన నవలలు, కథలు, హాస్య రచనలలో ఏది ఉత్తమమైనవో, మాసపత్రికలో ప్రచురించబడిన బ్యాలెట్ పత్రంలో వ్రాసి పంపండి.

ఉత్తమ నవలకు రు. 200/-లు, ఉత్తమ కథకు రు. 100/-లు, ఉత్తమ జోక్‌కు రు. 20/- బహుమతి ఇవ్వబడుతుంది. ఇలాగే యీ మూడు ఉత్తమ రచనలను సరిగ్గా ఎన్నిక చేసిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10-/లు బహుమతి వుంటుంది.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీదులో కొంత తగ్గింపు లభిస్తుంది. సభ్యత్వము కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.



# క్రైమ్‌లో తమాషా

## ఆధిక్యత?

డాంబికరావు: మీకేమాత్రం ఆస్తి ఉంది?

అమాయకరావు: ఒక బంగళా ఉంది.

డాం: నాకు రెండు బంగళాలున్నాయి!

అమా: నాకు ఒక కారు కూడా ఉంది.

డాం: నాకైతే మూడు కార్లున్నాయి!

అమా: నాకు ఇద్దరు తమ్ములున్నారు.

డాం: నాకు నలుగురు తమ్ములున్నారు!!

అమా: నాకు నాన్న వున్నాడు.

డాం: నాకు నలుగురు నాన్నలు....

అంతే, నాలిక కరుచుకొని మళ్ళీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు, డాంబికరావు పాపం.

—రోజాచలం, బెల్లంపల్లి.

## "దొంగ"

బస్సు నిండుగా ముందుకు సాగింది. కండక్టరు టిక్కెట్లిస్తున్నాడు. బస్సులో లైట్లు వెలిగాయి.

"బాబోయ్ నా పర్సు పోయింది" అని ఎవరో గట్టిగా కేక పెట్టారు.

కండక్టరే బస్ ఆపించాడు. ఎవ్వరూ దిగకుండా రెండు ద్వారాలవద్దా కట్టుదిట్టం చేశాడు. పర్సు పోయిందన్న అతడు గవర్నమెంటు డాక్టరు. కాబట్టి—బస్సు టిక్కెట్ ఛార్జీకి కక్కుర్తిపడి ఆడే నాటకం బాపతు కాదు. పైగా రెగ్యులర్‌గా అతడీ బస్ ఎక్కుతాడు.

"ఎంత వుందండీ పర్సులో?" కండక్టరు అడిగాడు.

"నూట ఇరవై చిల్లర వుందండి."

కండక్టరు ఒక్కొక్కరినీ చెక్‌చేస్తూ క్షమించమని అడుగుతున్నాడు.

"ఫర్వాలేదులే బాబూ—తిన్నగా పోలీస్ స్టేషన్ ముందాపివుంటే వాళ్ళంత తొందరగా వదల్రు నిర్దోషుల మైనా" అన్నారు కొందరు.

కండక్టర్ చెకింగ్‌చేయసాగాడు.

ఆ బస్సులో గజ గజ ఒణికిపోతున్న వ్యక్తి—నాగేంద్ర. చెమటతో తడిసి ముద్దయిపోయాడు. పారిపోదామంటే వీలుకాదు. చేతిలో సంచీ వదిలేద్దామంటే ప్రాణం ఒప్పట్లేదు. పైగా నలుగురూ చూశారు ఆ సంచీ తనదిగా.

కండక్టర్ అందర్నీ చెక్‌చేస్తూ నాగేంద్రదగ్గిరకొచ్చాడు. అతడి ముఖంలో కొట్టొచ్చినట్లగుపిస్తున్న భీతిని చూశాడు. 'తప్పకుండా వీడే పర్సు కొట్టేసి వుంటా' డనుకున్నాడు. జేబులు వెతికాడు. సంచి చూపమన్నాడు, చూశాడు.

అంత మనిషీ "కెవ్వు"మన్నాడు.